

సంపుటము 18
సంచిక 3

# భారతి

విక్రమ ఫాల్గునము
మార్చి 1941

# కాళిదాసుని ప్రేమతత్త్వము

శ్రీ బి. లక్ష్మీనారాయణరావు

సంస్కృత కావ్యప్రపంచమునకుఁ గాళిదాసు సూర్యునివంటివాఁడు. ఖండాంతరములయందుఁ గూడ పొగడ్తఁ గన్న గీర్వాణకవులలో నితఁడు ముఖ్యుఁడు. భారతదేశకవిపండితు లితని కిచ్చిన గౌరవ మనన్యలభ్యమైనది. ఇతని కావ్యసముదాయము రత్నములఖని. శోధించినకొలఁది అనర్ఘములగు రత్నములు మనకు సదా లభించుచునే యుండును. ఓపిక కొలఁది ఇతని సూక్తిరత్నముల నేరి హారముగాఁ గూర్చి యితనికే యర్పించుట యితనికి మన మొసఁగఁ జాలిన కానుక. మహాకవిలక్షణములగు భావనాసంపత్తి, అర్థస్ఫూర్తి, మానవస్వభావచిత్రణము, భావగాంభీర్యము, లలితపదప్రయోగచాతుర్యము, సహజార్థాలంకారమనోహరత్వము, సహృదయత — యిత్యాదు లన్నియు నీతనికి సహజగుణములు. కాఁగా, నీమహాకవి తన కావ్యములందుఁ గావించిన రసపోషణ యప్రతిమమై, సహృదయహృదయంగమమై యలరారినది.

## శృంగారరసముయొక్క— వివిధస్వరూపములే ఇతరరసములు

రఘువంశము, కుమారసంభవము, మేఘదూత- అను కావ్యత్రయమందును, అభిజ్ఞానశాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము నను నాటకత్రయమునను గూడ నీకవి శృంగారమునే ముఖ్యరసముగఁ బోషించియున్నాఁడు. దీనినిబట్టి శృంగార మీతని యభిమానరస మనిమాత్రమే చెప్పుట చాలదు. భవభూతి "ఏకో రసః కరుణ ఏవ" అని వచించి తన కరుణరసపరత్వమును జాటుటలో, ఒక్క కరుణరసమే వివిధసందర్భములయందు అవస్థాభేదములఁ జెంది, శృంగారాదిరసములుగాఁ బరిణమించు నని తెలిపియున్నాఁడు. అట్లే కాళిదాసు తన కావ్యత్రయ నాటకత్రయముల నన్నిటినిఁగూడ శృంగారాధిష్ఠితములుగఁ జేయుట చూడఁగా, శృంగారరసమే వివిధదశలయందు వివిధరసరూపములఁ జెందు నని యితని యభిప్రాయమేమో యని యూహ కలుగుచున్నది. మనస్తత్త్వశాస్త్రపరిశోధకాగ్రగణ్యుఁ (Psychologist) డని పేరొందిన ఫ్రాయిడ్ (Freud) మహాశయుఁడు

మానవతత్త్వమున కంతటికిని మూలకారణమైనది శృంగార (Sex Instinct) మొక్కటే యనియు, మానవ స్వభావలక్షణము (Instincts)లని పిలువఁబడు నితరములన్నియు నీశృంగారముయొక్క దశాపరివర్తనములే యనియు నభిప్రాయపడియున్నాఁడు. శృంగారరసవిషయమున కాళిదాసున కిట్టి యభిప్రాయ ముండెనేమో? శృంగారము నాయికానాయకుల విషయమున ప్రణయముగను, శిశువునెడఁ దలిదండ్రులకు వాత్సల్యముగను, గురువునెడ శిష్యునకు గౌరవముగను, దేవుని యెడ భక్తిగను సహజముగఁ బరిణమించును. "భక్తిః పరానురక్తి రీశ్వరే" యనెడు సూత్రార్థముకూడ నిందు సమన్వయించుచున్నది. ప్రేమ ఫలించనప్పుడా ప్రేమ వ్యక్తుల మానసికస్వభావము ననుసరించి రౌద్రముగనో, ఈర్ష్యగనో, శాంతముగనో పరిణమించుటయుఁ గలదు. వివిధనాయికానాయకులమధ్య, వివిధసందర్భములయందు, వివిధావస్థలలో, వివిధరూపములఁ బ్రకాశితమైన ప్రణయస్వరూపము నెంతో స్వాభావికముగ, మనోజ్ఞముగఁ గాళిదాసు చిత్రించియున్నాఁడు.

## అలౌకిక, సాత్త్వికశృంగారమే ప్రేమగా పరిణమించును

కాళిదాసు తన కావ్యములందుఁ బోషించిన శృంగారము జఘన్యప్రవృత్తిమూలకమైన మోహవికారము కాదు. అది దైవికమైన సాత్త్వికప్రేమ, దాంపత్యధర్మపు పరాకాష్ఠదశ. ప్రాపంచికవిషయముల నాధారముగఁ జేకొని యుద్భవించిన శృంగారరసము క్రమక్రమముగా సాత్త్వికప్రేమయొక్క చరమసీమను జేరిన విధము నతివిపులముగ, మనోహరముగ కవి వర్ణించియున్నాఁడు. ప్రేమ, ప్రణయము, అనురక్తి, అనురాగము అని వివిధాభిధానములతో వ్యవహరింపఁబడుచు, స్త్రీపురుషతత్త్వముల రెంటినిఁ జేర్చు నా దివ్యసాత్త్వికబంధమును వివిధవిధములఁ జిత్రించి మన జీవితమును ప్రణయోద్యానవిహారముగ మార్చినవాఁడు కాళిదాసు. మన కితఁడు ప్రాపంచిక శృంగారమందలి చంచలత్వమును, అస్థిరత్వమును విశదపఱచి, దానినుండి మనదృష్టిని మరల్చి, దివ్య, సాత్త్విక, అలౌకిక శృంగారమందలి స్థిరత్వమును, పవిత్రతను బ్రదర్శించి, మనకుఁ బ్రణయస్వరూపమును జూపఁగలిగినాఁడు.

## కావ్యత్రయమున సాత్త్వికప్రేమయు, నాటకత్రయమున ప్రాపంచికప్రణయమును వర్ణితములు

కావ్యత్రయములోని నాయికానాయకులు దివ్యులు. రఘువంశపురుషులనుగూడ కాళిదాసు మానవాతీతులుఁగ గణించి వర్ణించినాఁడు. రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశములందు దివ్యము, అలౌకికము నగు సాత్త్వికప్రేమ వర్ణితమైనది. ఏకపత్నీవ్రతులగు సుదాత్తనాయకులయు, సౌశీల్యాదిగుణశోభితలగు నాయికలయు చరిత్రములను వస్తువుగఁ గైకొని, కాళిదాసు లోకకల్యాణాధిష్ఠితమైన సాత్త్వికప్రణయతత్త్వము నీకావ్యత్రయమునఁ జిత్రించియున్నాఁడు. శాకుంతల, విక్రమోర్వశీయ, మాళవికాగ్నిమిత్రములందు వర్ణితమైన ప్రణయము ప్రాపంచికప్రణయము. దేహసౌందర్యమున నుద్భూతమైన లౌకికప్రేమ ఇందు వర్ణితమైనది. ఇందలి నాయకులైన దుష్యంతపురూరవోఽగ్నిమిత్రులు మానవమాత్రులు. ధీరోదాత్తులైనను నింద్రియజేతలు గారు. వారు భోగదేవేంద్రులు. కావ్యత్రయనాయకులగు దిలీప, అజ, శ్రీరామచంద్ర, పరమేశ్వర, యక్షాదులవంటి మహానుభావులు కారు. శకుంతలాదినాయికల ప్రేమ అనన్యసాధారణమైనదియైనను నది యింద్రియక్షోభజనితమైన ప్రాపంచికప్రేమ. పార్వతీదేవిప్రేమవలె స్వార్థరహితమై సంయమముతోఁ గూడినది కాదు. ఇట్లు దివ్యులగు నత్యుత్తమదంపతుల ప్రణయఫలమగు లోకకల్యాణమును కావ్యత్రయమందును, మానవదంపతుల లౌకికప్రణయఫలిత మగు ననర్థమును నాటకత్రయమందును చిత్రించి, కాళిదాసు సాత్త్వికప్రేమపరిణామమందలి రెండంతస్తులను జూపియున్నాఁడు.

## దాంపత్యతత్త్వము

ఇది కాక, పరస్పరానురక్తులగు దంపతులకు దైవికముగనో, కారణాంతరములచేతనో కలుగు వియోగ

దుఃఖము ననేకవిధముల కరుణరసపూరితముగ కాళిదాసు వర్ణించియున్నాఁడు. రఘువంశకావ్యారంభమునఁ గాళిదాసు,

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ."

అని జగత్పితలగు పార్వతీపరమేశ్వరులను శబ్దార్థముల వలె అవినాభావసంబంధము కలవారని నిర్దేశించుటలో స్త్రీపురుషు లిరువురకును గల వీడరాని నిత్య సంబంధమును సూచించియున్నాఁడు. ఇట్టి నిత్య సంబంధమును నిర్దేశించుచు "వాగర్థావివ" యను నేకపదమును నిత్య సమాసముతో కావ్యారంభమును గావించియున్నాఁడు. కుమారసంభవమందలి బ్రహ్మస్తవమున కాళిదాసు

"స్త్రీపుంసావాత్మభాగౌ తే భిన్నమూర్తేస్సిసృక్షయా,
ప్రసూతిభాజః సర్గస్య తావేవ పితరౌ స్మృతౌ."

అని ప్రకృతి పురుషులను నిర్గుణబ్రహ్మము యొక్క బింబమైన మాయోపాధికుఁడగు నీశ్వరునిగ గ్రహించి, ప్రేమ లోకకల్యాణాధిష్ఠితమగు సృష్టికి బీజమని పలికియున్నాఁడు. పురుషుఁడు ప్రకృతిరహితుఁడైనచో నిర్వ్యాపారుఁ డగును. ఈ విషయమునే శ్రీ శంకర భగవత్పాదులవారు తమ సౌందర్యలహరి మొదటి శ్లోకమున,

"శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి."

అని వక్కాణించియున్నారు. "ప్రకృతిః కర్త్రీ పురుషః పుష్కరపలాశవ న్నిర్లిప్తః" అను సాంఖ్య సిద్ధాంతముకూడ నిందు సమన్వయించుచున్నది. కనుకనే, సతీదేవి దక్షరోషమువలన యోగవిసృష్టదేహ కాఁగా శివుఁ డశక్తుఁడై తపస్సు నారంభించినాఁడు.

"యదైవ పూర్వే జననే శరీరం
సా దక్షరోషా త్సుదతీ ససర్జ,
తదాప్రభృత్యేవ విముక్తసంగః
పతిః పశూనా మపరిగ్రహో౽భూత్."

అట్లే హిమవంతుని పుత్రియై యుద్భవించిన సతీదేవికూడ పరమేశ్వరునిఁ జేరుటకై యుగ్రతపమును జేసినది. దివ్యమాలాతాడితయై భూమి కొరగిన ఇందుమతి మృతింపఁగా నామెతోఁగూడ తానును గ్రిందఁబడి కొంతవడికి మూర్ఛదేరిన అజుని యవస్థను,

"వపుషా కరణోజ్ఝితేన సా
నిపతంతీ పతి మప్యపాతయత్,
నను తైలనిషేకబిందునా
సహ దీపార్చిరుపైతి మేదినీమ్."

అని వర్ణించినాఁడు. ఇందు దీపము కొడినుండి జ్వాలతోఁగూడ క్రిందఁబడిన తైలబిందు వుపమానము. జ్వాల యారి తైలబిందువుమాత్రము మిగులునట్లు, ఇందుమతి మృతింపఁగా అజుఁడుమాత్రము తేజోవిహీనుఁడై జీవించియున్నాఁ డని యిందు వర్ణింపఁబడినది. అనఁగా సతియే పతిజీవితమును వెలిఁగించు తేజోవిశేషము, పతిజీవితమును సార్థక మొనరించు శక్తి అను భావ మీ యుపమానమున గర్భితమై యున్నది. ఇం దుపమాలంకారమనోజ్ఞత మాత్రమే కాక దాంపత్యమును గూర్చిన కాళిదాసుని యుత్తమాభిప్రాయముగూడ ద్యోతితమైయున్నది. జ్వాలారహితమైన తైలబిందువువలె కళత్రరహితుఁడైన పురుషుని జీవితము తేజోవిహీనమైనది, వ్యర్థమైనది. ఈ యభిప్రాయమునే వ్యాసులవారు "న గృహం గృహమిత్యాహుః గృహిణీ గృహ ముచ్యతే" అని వెలిఁబుచ్చియున్నారు. దాంపత్యమునుగూర్చియు, ప్రేమను గూర్చియు కాళిదా సిట్టియుత్కృష్ట భావములను వెలిఁబుచ్చియున్నాఁడు.

## సుదక్షిణాదిలీపులు, ధర్మార్థకామమోక్షములు

రఘువంశమున వర్ణింపఁబడిన ప్రథమదంపతులు సుదక్షిణాదిలీపులు. స్మృతిప్రోక్తమైన భారతీయ గృహస్థధర్మము వీరిచేఁ బూర్తిగ ననుగమింపఁబడినది. రాజులకు బహుపత్నీత్వము దోషము కాకున్నను, దిలీపచక్రవర్తి సంతానాపేక్షచే, బహుభార్యలను గైకొనలేదు. తన ధర్మపత్నియైన సుదక్షిణాదేవియందే

సుపుత్రునిఁ గాంచ నిచ్ఛగించిన దిలీపునిచే వసిష్ఠుని గూర్చి,

"కింతు వధ్వాం తవైతస్యా మదృష్టసదృశప్రజమ్,
న మా మవతి సద్వీపా రత్నసూరపి మేదినీ."

అని కాళిదాసు పలికించినాఁడు. ఇందు కాళిదాసు ప్రశంసించినది ఏకపత్నీత్వము, ధర్మప్రణయము. వివాహమునకు ఫల మింద్రియతృప్తి కాదు, వంశోద్ధారకమగు సుపుత్రజనన మని కాళిదాసు,

"మత్పరం దుర్లభం మత్వా
నూన మావర్జితం మయా,
పయః పూర్వైః స్వనిఃశ్వాసైః
కవోష్ణ ముపభుజ్యతే."

అను దిలీపవచనార్థముచే సూచించియున్నాఁడు. రఘువంశప్రారంభమందు,

"త్యాగాయ సంభృతార్థానాం
సత్యాయ మితభాషిణామ్,
యశసే విజిగీషూణాం
ప్రజాయై గృహమేధినామ్"

అని ప్రజారూపమైన తంతువు పెరుగుటకే వివాహము కాని కామతృప్తికిఁ గాదు అను నభిప్రాయమును దెలియఁజేసియున్నాఁడు. వ్రతానుష్ఠానతత్పరులగు సుదక్షిణాదిలీపుల అనుకూలదాంపత్యమును కాళిదాసెంతయో ముచ్చటగ వర్ణించియున్నాఁడు.

"పురస్కృతా వర్త్మని పార్థివేన
ప్రత్యుద్గతా పార్థివ ధర్మపత్న్యా,
తదంతరే సా విరరాజ ధేను
ర్దినక్షపామధ్యగతేవ సంధ్యా."

సాయంసమయమున వనసీమనుండి యాశ్రమమునకు మరలివచ్చువేళ తన్ననుసరించివచ్చు దిలీపునకును, తన కెదురువచ్చు సుదక్షిణాదేవికిని మధ్య నానందినీధేనువు దివారాత్రులమధ్యగతయగు సంధ్యారాగమువలె ప్రకాశించుచుండెనఁట. ఆ సమయమును దివారాత్రుల మధ్యగతయగు సాంధ్యవేళయే. ఉపమానోపమేయములు రెండును నొకేసమయమునఁ బ్రత్యక్షములయియుండుటచే నీవర్ణన యెంత మనోహరమైనదియో సహృదయులు గమనింతురుగాక.

"ప్రదక్షిణీకృత్య పయస్వినీం తాం
సుదక్షిణా సాక్షతపాత్రహస్తా,
ప్రణమ్య చానర్చ విశాల మస్యాః
శృంగాంతరం ద్వారమి వార్థసిద్ధేః"

అక్షతపాత్రహస్తయైన సుదక్షిణాదేవి కార్యసిద్ధికి ప్రవేశమార్గమువలె నుండు గోవువిశాలమైన శృంగాంతరసీమను బూజించినది.

నందినీధేనువనుగ్రహమున వీరి దాంపత్యము ఫలించినది. సుపుత్రుఁడగు రఘువుబాహుబలముకలిమిచే దిలీపుఁడు ధర్మపత్నీయుతుఁడై అశ్వమేధఫలమును గాంచినాఁడు. ప్రియసతియగు సుదక్షిణయందు ధర్మార్థకామముల మూఁటిని సాధించిన దిలీపుఁడు రఘువు వివాహానంతర మతనిని రాజ్యాభిషిక్తుఁ జేసి, పత్నీసమేతుఁడై మోక్షసాధనకొఱ కాశ్రమమున కేఁగినాఁడు. ఇట్లు కాళిదాసు సుదక్షిణాదిలీపుల చరిత్రకథనమున భారతీయదాంపత్యతత్త్వమును విశదము గావించియున్నాఁడు.

## అజ ఇందుమతులు,

## అజుని స్వార్థత్యాగము

కాళిదాసు అజ ఇందుమతుల ప్రేమప్రాబల్యమును, దైవికమైన వియోగము నాధారముగాఁ జేసికొని రమణీయముగ వర్ణించియున్నాఁడు. సుదక్షిణాదిలీపుల ప్రేమవలె వీరి ప్రేమ శాంతముగా కలకాలము ఫలించినది కాదు. యౌవనముననే అజున కిందుమతీవియోగము కలిగినది. మర్త్యులగువారికి సాధారణముగఁ గల్గు నిట్టివియోగమును వర్ణించుటలో కాళిదాసు ఉత్కృష్టమైన సాత్త్విక ప్రేమయొక్క స్థిరత్వమును, పవిత్రతను, స్వార్థరాహిత్యమును జాటియున్నాఁడు. జీవితజ్యోతియగు నిందుమతి మృతింపఁగా నిస్తేజస్కుఁడైన అజుఁడు రఘుకులబాలచంద్రుఁడగు దశరథుని రక్షణార్థమై దేహయాత్ర నెట్లో కడపవలసి వచ్చినది. కాని యిందుమతిలేని జీవితము మాత్రము వ్యర్థమైనది.

"విభవేఒపి సతి త్వయా వినా
సుఖ మేతావ దజస్య గణ్యతామ్,
అహృతస్య విలోభనాంతరై
ర్మమ సర్వే విషయా స్త్వదాశ్రయాః."

"నాసర్వసౌఖ్యములును నిన్నాశ్రయించి యుండినవి. విభవ మెంతయున్నను నాజీవితసౌఖ్యము నీతో నంతమొందినది" అని దీనముగా విలపించు నజుని ప్రేమ యెంతటి మహత్తరమైనది! జీవితాంతమువఱకును నిందుమతీస్మరణమాత్రద్వితీయుఁడై, పునర్వివాహప్రశంస లేకయుండిన అజుఁడు లోకమున కత్యుత్తమాదర్శమును జూపియున్నాఁడు. విగతప్రాణమైన ఇందుమతీ దేహమును చిరపరిచితమగు తన యుత్సంగమున నిడికొని విలపించు అజుని యవస్థను కాళిదా సెంతయు రసవత్తరముగ వర్ణించినాఁడు.

"ప్రతియోజయితవ్యవల్లకీ
సమవస్థా మథ సత్త్వవిప్లవాత్,
స నినాయ నితాంతవత్సలః
పరిగృహ్యోచిత మంక మంగనామ్."

విగతప్రాణమైన యిందుమతీదేహము తంత్రీరహితమైన వీణతోఁ బోల్పఁబడినది. కాళిదాసుని మనోజ్ఞములైన యుపమానముల కిది యొక యుదాహరణము. "ఉచిత మంకం నినాయ" అనుట ఆ ఉపమానోపమేయముల రెంటికిని చక్కఁగా సరిపోవుచున్నది. ఉత్సంగమున నిడికొని వీణకుఁ దంత్రులను గట్టుట సాధారణముగా మనము గనుచుండు విషయము. ఇఁక నుపమేయపక్షమున, అజజీవిత సర్వస్వమును, ప్రియసతియు అగు నిందుమతి కజుని యుత్సంగమునకంటె నుచితమైన స్థాన మేది కలదు? ఇందుమతీవిషయమున నజుఁడు "నితాంతవత్సలుఁ డైనాఁడు." ఉత్తమప్రేమ వాత్సల్యముగఁ బరిణమించినది.

"విలలాప స బాష్పగద్గదం
సహజా మ ప్యపహాయ ధీరతామ్."

సహజధైర్యమును గోల్పోయి, బాష్పాకులుఁడై, గద్గదస్వరమున విలపించు నజుని విషయమున కాళిదాసుని సాత్త్వికప్రేమ కరుణరస స్వరూపమును దాల్చినది.

"గృహిణీ సచివః సఖీ మిథః
ప్రియశిష్యా లలితే కలావిధా,
కరుణావిముఖేన మృత్యునా
హరతా త్వాం వద కిం న మే హృతమ్."

అని అజునివాక్యముగా కాళిదాసు భారతీయులకు సహధర్మచారిణివిషయమునఁ గల యుదారాభిప్రాయములను వెల్లడించియున్నాఁడు. భారతీయులు స్త్రీని భోగ్యవస్తువుగాఁ జూతురను అపోహకుఁ బాత్రులైన నవీను లీశ్లోకార్థమును గమనింతురుగాక. స్వార్థత్యాగము లేమిచే ప్రేమస్వరూపమును దెలియఁజాలక, భావైక్యము లేదను నెపమున వివాహబంధములఁ ద్రెంచివైచి, స్వచ్ఛందగాములగువారికి భారతీయుల వైవాహికబంధ మొక శృంఖలముగఁ గన్పడుట నైజమే. పూర్వులలో బహుపత్నీత్వము పాపముగాఁ బరిగణింపఁబడకున్నను, అది యెన్నఁడును గౌరవార్హముగా నెన్నఁబడలేదు. దిలీప, అజ, రామచంద్రాదులయెడఁ గల గౌరవము మనవారికి దుష్యంతాదుల విషయమున నెన్నఁటికిని గలుగదు. ఇట్టి ఏకపత్నీత్వమందలి ప్రణయోత్కృష్టతనే భారతీయకవిశ్రేష్ఠుఁడగు కాళిదాసు మిక్కిలిగ వర్ణించినాఁడు.

### సీతారాముల ఆదర్శదాంపత్యము, దివ్యప్రేమ

సీతారాములు మానవలోకమునకే ఆదర్శప్రాయులగు సతీపతులు. భారతీయ గృహస్థధర్మము వీరి దాంపత్యరూపమును దాల్చినది. రామచంద్రుఁడు పుత్రధర్మ, భర్తృధర్మ, రాజధర్మములను బాలించిన పురుషోత్తముఁడైనను నతఁడు భరతఖండమున సీతాపతిగనే యెక్కువగఁ బూజింపఁబడుచుండుట. సీతారాములఁ దలఁచినంతనే మనకు హృదయగోచరమగునది వారి యనుకూలదాంపత్యము. ఉత్కృష్టప్రేమకు వీరిజీవితము పరమావధి. స్వార్థమును, అభిమానమును విషయలోలుపతను నశింపఁజేసి, జీవిత

మును పరిశుద్ధముజేసి, త్యాగమహిమను జూపఁగల మహోచ్ఛక్తి ప్రేమ. ప్రేమతప్తుఁడైన జీవి ఆత్మత్యాగము నొక లీలగఁ బరిగణించును. సీతారాముల జీవిత మట్టి యలౌకిక సాత్త్విక ప్రేమసారము. వియోగానల తప్తములైన వీరిజీవితము లుత్తమప్రేమామృతస్నానమున నమరత్వముం జెంది భారతీయుల గృహములలో శాశ్వతపూజ నందుచున్నవి. పతిపత్నుల ప్రేమదార్ఢ్యము విపత్తులయందుఁ బరీక్షింపఁబడును. అట్టి విపత్తులలో వియోగ మొకటి. దైవిక వియోగకారణముగా అజున కిందుమతియందుఁ గల ప్రేమ ప్రకాశితము చేయఁబడినది. సీతారాముల జీవితములం దిట్టి వియోగము రెండుపర్యాయములు గల్గినది. రాముఁడు పితృవాక్యపరిపాలనార్థమై యరణ్యమున కేఁగినపుడు భర్తతోడి వనవాసమును స్వర్గతుల్యముగ నెంచిన సీత తన యనన్యాదృశప్రేమను వెల్లడించినది. లంకలో, రాక్షసులమధ్య నతికష్టముల కోర్చి, ప్రియభర్తృస్మరణ చేయుచు, త్రైలోక్యవీరుఁడగు రాముఁ డెన్నఁటికైనను తన్ను విడిపించుకొను నను నాసచేఁ బ్రాణముల ధరించినది జీవిత సర్వస్వమగు సీత వియోగమున రాముఁ డనుభవించిన దుఃఖమును వర్ణించుట వాల్మీకికే చెల్లినది. అతని దుఃఖమును చూడలేక చేతనాచేతనము లన్నియు నేడ్చినవి. రాముఁడు మహత్ప్రయత్న మొనర్చి తన ప్రేయసిని విడిపించుకొన్నాఁడు. అగ్నిప్రవేశమున సీత లోకమునకుఁ దన పరిశుద్ధతను వెల్లడించి తన బహిఃప్రాణమగు రామునిఁ జేరినది. కాని చిరదుఃఖితయగు సీతకు వియోగము జన్మస్వత్వమైనది. లోకాపవాదమునకు వెఱచి రాముఁడు తన ప్రాణమునకుఁ బ్రాణమైన, అగ్నిశుద్ధయైన సీతను విడుచుటను గూర్చి,

"కి మాత్మనిర్వేదకథా ముపేక్షే,
జాయా మదోషా ముత సంత్యజామి"

అని డోలాందోళితమనస్కుఁడై తుదకు లోకాపవాదనివృత్తికొఱకు సీతావియోగమున నాత్మత్యాగముఁ జేయ నిశ్చయించినాఁడు. "జాయాం అదోషాం" అని పలికి రాముఁడు తనకు పత్నియందుఁ గల గౌరవమును వెల్లడించినాఁడు.

"తజ్జాయాయా జాయాత్వం య దస్యాం జాయతే పునః"

అను వ్యుత్పత్తిని పర్యాలోచించిన జాయాశబ్దము నెంతటి అర్థస్ఫూర్తితో కాళిదాసిందు (జాయా మదోషాం) ప్రయోగించినాఁడో యభిజ్ఞు లూహింతురు గాక. సీత అప్పుడు పూర్ణగర్భిణి. పౌరులయందు వ్యాపించుచున్న అపవాద ముపశమించుటకై పూర్ణగర్భిణియగు జాయను పరిత్యాగము చేసినాఁడు. తన కత్యంత ప్రీతిపాత్రమగు వస్తువును దృణప్రాయముగ లోకరంజనార్థము త్యజించుటయందే ప్రజారంజకుఁడైన రాముని త్యాగము కనఁబడుచున్నది.

"తస్యాపనోదాయ ఫలప్రవృత్తా
వుపస్థితాయా మపి నిర్వ్యపేక్షః,
త్యక్ష్యామి వైదేహసుతాం పురస్తా
త్సముద్రనేమిం పితు రాజ్ఞయేవ"

ఇట్లు చేతులార సీతను బోఁగొట్టుకొన్న రాముఁడు వియోగాగ్నిదగ్ధుఁడై విశ్వకారుణ్యమునకుఁ బాత్రుఁడైనాఁడు. శిరీషకుసుమకోమలమైన సీతాదేవిహృదయము చిరంతన దుఃఖము ననుభవించుటలో వజ్రమైనది. అగ్నిశుద్ధయైన, నిష్కలంకయైన, పతిజీవితయైన తన్ను కారణముగ భర్త విడిచినను, నతని నేమాత్రమును దూఱక, యది తన పూర్వకృతకర్మఫలమని విలపించు సీతవంటి ప్రేమమూర్తి ప్రపంచచారిత్రమం దెందును గానరాదు.

"కిం వా తవాత్యంతవియోగమోఘే
కుర్యా ముపేక్షాం హతజీవితేఽస్మిన్,
స్యా ద్రక్షణీయం యది మే న తేజ
స్త్వదీయ మంతర్గత మంతరాయః"

"సాహం తపః సూర్యనివిష్టదృష్టి
రూర్ధ్వం ప్రసూతే శ్చరితుం యతిష్యే,
భూయో యథా మే జననాంతరేఽపి
త్వమేవ భర్తా నచ విప్రయోగః"

భర్తృవియోగమున నిష్ఫలమైన తన హతజీవితము నుపేక్షింపఁదగినదైనను గర్భస్థమగు భర్తృవంశసంతానాంకురము రక్షింపఁదగినదని పల్కుటలో సీతయుదారాశయము విశదమగుచున్నది.

సీత తన జన్మాంతరమందును రాముని నే భర్తగాఁ గోరుటలో సీతారాముల యోఁడోరుల పవిత్రప్రేమ మనకు గోచరమగుచున్నది. ఈ విషయమునే భవభూతి

"ప్రకృత్యైవ ప్రియా సీతా
రామస్యాసీ న్మహాత్మనః,
ప్రియభావః సతు తయా
స్వగుణైరేవ వర్ధితః.
తథైవ రామః సీతాయాః
ప్రాణేభ్యోఽపి ప్రియోఽభవత్,
హృదయం త్వేవ జానాతి
ప్రీతియోగం పరస్పరమ్."

అని యనభవైకవేద్యముగాఁ బలికియున్నాఁడు.

సీతాత్యాగానంతరము రాముఁ డేకాకియై కాలముఁగడపుచు, సీతావిగ్రహమునే ప్రక్కనిడికొని అశ్వమేధయాగమును నిర్వహించెనని వర్ణించి కాళిదాసు మహోత్కృష్టమైన ప్రేమస్వరూపమును మనకుఁ జూపియున్నాఁడు.

"సీతాం హిత్వా దశముఖరిపు ర్నోపయేమే యదన్యాం
తస్యా ఏవ ప్రతికృతిసఖో యత్క్రతూ నాజహార,
వృత్తాంతేన శ్రవణవిషయప్రాపిణా తేన భర్తుః
సా దుర్వారం కథమపి పరిత్యాగదుఃఖం విషేహే."

ఈ వృత్తాంతమును విన్న సీత తన దుర్వారమైన పరిత్యాగదుఃఖమును సహింపఁగల్గినదఁట. గృహమునుండి సీతను బంపినను రాముఁడు తన మనస్సునుండి పంపలేకపోయినాఁడు.

"బభూవ రామః సహసా సబాష్ప
స్తుషారవర్షీవ సహస్యచంద్రః,
కౌలీనభీతేన గృహాన్నిరస్తా
న తేన వైదేహసుతా మనస్తః"

కుశలవులు తండ్రినిఁ జేరినతర్వాత సీత తన పవిత్రతను సంశయించు నీలోకమున నుండఁగూడ దని నిశ్చయించినది. తన పవిత్రతను లోకమునకును, తన నిశ్చలమైన ప్రేమను రామునకును బ్రదర్శించి సీత జననియగు భూమిగర్భమునఁ బ్రవేశించినది.

"సా సీతా మంక మారోప్య
భర్తృప్రణిహితేక్షణామ్,
మా మేతి వ్యాహరత్యేవ
తస్మిన్పాతాళ మభ్యగాత్."

సువర్ణాక్షరములతో లిఖింపఁదగిన దీశ్లోకము. "భర్తృప్రణిహితేక్షణామ్"అని సీతను వర్ణించుటలో కాళిదాసు ప్రేమస్వరూపమునే శాశ్వతముగఁ జిత్రించినాఁడు. సీతారాముల ప్రణయచారిత్రము కాళిదాసు ప్రేమతత్త్వమునకు గీటురాయి.

ఉమామహేశ్వరుల ప్రణయము

ప్రకృతిపురుషుల లీలావిలాసము

సీతాదేవిపవిత్రప్రేమకు సరిదూఁగునది ఉమాదేవియొక్క సాత్త్వికప్రేమ. ఉమామహేశ్వరుల ప్రణయము ప్రకృతిపురుషుల లీలావిలాసము. ప్రకృతిపురుషులకుఁ గల్గిన సహింపరాని తాత్కాలిక వియోగము నెంతో మనోజ్ఞముగ కాళిదాసు వర్ణించియున్నాఁడు. స్త్రీపురుషతత్త్వములు రెండును పరబ్రహ్మముయొక్క వివర్తములగుట నీ రెంటికిని గల పరస్పరాకర్షణమే ప్రణయముగా గ్రహించి కాళిదాసుమామహేశ్వరుల ప్రణయమును జిత్రించియున్నాఁడు. దక్షయజ్ఞవాటికలో జరిగిన భర్తృనింద నోర్వలేనిదై సతీదేవి దేహము చాలింపఁగా శివుఁడు సతీవియోగము నోర్వలేక తపస్వి యైనాఁడు.

"తత్రాగ్ని మాధాయ సమిత్సమిద్ధం
స్వమేవ మూర్త్యంతర మష్టమూర్తిః,
స్వయం విధాతా తపసః ఫలానాం
కేనాపి కామేన తప శ్చచార."

తపఃఫలముల నిచ్చు ఈశ్వరుఁడును తానే ఏదో కోరికచే తపస్సుచేసెను. ప్రకృతివియోగమున తపోభిముఖుఁడైన శివునకు ప్రకృతిని జేరుటకంటె కాంక్షితమేమున్నది? కనుకనే కాళిదాసు "కేనాపి కామేన" అని యనిశ్చితముగఁ బలికి యీయర్థమును ధ్వనింపఁ జేసియున్నాఁడు.

"తదాప్రభృత్యేవ విముక్తసంగః
పతిః పశూనా మపరిగ్రహోఽభూత్."

అని శివుఁడు సంసారరహితుఁ డని యిదివఱకే కవి వర్ణించియున్నాఁడు. కనుక తపమునకుఁ గాంక్షిత ఫల మితఁడు శక్తియుతుఁ డగుటయే యని కాళిదాసు కావ్యదృష్టిచే సూచించియున్నాఁడు. ప్రకృతియగు సతీదేవి పురుషుఁడగు శివునిఁ జేరక యుండఁజాలదు. హిమవంతునకుఁ బుత్త్రీరూపమునఁ బరమేశ్వరి జనించినది. నారదునిచే భవిష్యత్తును దెలిసిన హిమవంతుఁడు పుత్త్రిని శివశుశ్రూషార్థము నియోగించినాఁడు. దేహాంతరమును జెందిన సతీదేవి పరమేశ్వరునితోఁ జేరుటకుఁ దగిన యర్హతను సంపాదింపవలసియున్నది. అట్టి యోగ్యతను సాధించుటకు మహనీయులసేవ మొదటి సోపానము. ఈఘట్టమును జిత్రించుటలో కాళిదాసు చూపిన చాతుర్య మనన్యసాధ్యమైనది. పరమేశ్వరుని జితేంద్రియత్వము, తపోనిష్ఠ, సంయమము వర్ణింపఁబడనిచో నుమాదేవి యతనికై చేయఁబోవు మహాప్రయత్నము వ్యర్థ మని తోఁచెడిని. పరమేశ్వరుని ప్రేమ పరమోత్కృష్టమైనది, అనిర్వాచ్యమైనది. తన సతిని క్షణముకూడ విడిచియుండలేక యామె కర్ధదేహమునే యొసఁగఁజాలిన నిర్వ్యాజప్రేమ. అట్టి ప్రేమను బొందుటకుఁ దగిన యర్హత నుమాదేవి గడింపవలసియున్నది.

"స కృత్తివాసా స్తపసే యతాత్మా
గంగాప్రవాహోక్షితదేవదారు,
ప్రస్థం హిమాద్రే ర్మృగనాభిగంధి
కించి త్క్వణత్కిన్నర మధ్యువాస."

కిన్నరగానము, కస్తూరీపరిమళము, గంగాప్రవాహముచేతఁ దడుపఁబడు దేవదారువృక్షములు గల హిమవత్పర్వతపు చరియలో నియతచిత్తుఁడగు శివుఁడు తపస్సు నారంభించినాఁడు. ఆయనకు సేవచేయుటకై నియోగింపఁబడినది త్రిలోకసుందరియు, నవయౌవనోన్మేషయు, శివునియందు బద్ధానురాగయు, పూర్వమున నతని సతియు నగు నుమాదేవి. ఇట్టి పరిస్థితులు శృంగారమున కనుకూలించునట్లు సంయమమున కనుకూలించవు. కాని,

"వికారహేతౌ సతి విక్రియంతే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః."

అని పరమేశ్వరుని దృఢచిత్తమును, నింద్రియనిగ్రహమును కవి వెల్లడించినాఁడు. మన్మథపురోయాయియగు వసంతుని విజృంభణముచే కేవల తపోవనమే కాక కాళిదాసుని విశ్వమంతయు రతిభావసమన్వితమైనది.

"మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః,
శృంగేణ సంస్పర్శనిమీలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః."

"దదౌ రసా త్పంకజరేణుగంధి
గజాయ గండూషజలం కరేణుః,
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామా."

"గీతాంతరేషు శ్రమవారిలేశైః
కించిత్సముచ్ఛ్వాసితపత్రలేఖమ్,
పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి
ప్రియాముఖం కింపురుష శ్చుచుంబే."

జంగమముల స్థితి యిట్లున్నది. ఇఁక స్థావరములగు వృక్షాదులుసైత మీభావమునకు లోనైన వని కవి,

"పర్యాప్తపుష్పస్తబకస్తనాభ్యః
స్ఫురత్ప్రవాళోష్ఠమనోహరాభ్యః,
లతావధూభ్య స్తరవోఽప్యవాపు
ర్వినమ్రశాఖాభుజబంధనాని."

అని మనోహరముగా వర్ణించియున్నాఁడు. ఇట్లు స్థావరజంగమాత్మకములగు మిథునము లన్నియు కాష్ఠాగతస్నేహరసానువిద్ధమగు భావమును ప్రకటించఁగా, నాతపోవనమందలి మునులు,

"ప్రయత్నసంస్తంభితవిక్రియాణాం
కథంచి దీశా మనసాం బభూవుః"

మనోవికారముల నతికష్టముతో నాపి యింద్రియములను స్వాధీనముచేసికొనిరి. కాని నిశ్చలుఁడై, యింద్రియములను బంధించి,

"అవృష్టిసంరంభ మివాంబువాహ
మపామివాధార మనుత్తరంగమ్"

అంతశ్చరాణాం మరుతాం నిరోధాత్
నివాతనిష్కంప మివ ప్రదీపమ్."

సమాధిలోనుండు హరునిఁ జూచి మన్మథుఁడు నిశ్చేష్టుఁ డైనాఁడు. బాహ్యవ్యాపారశూన్యుఁడగు నతని హస్తమునుండి ధనుర్బాణములు తమంతట జారినవి. ఇట్టిస్థితిలో నుండు మదనుఁడు,

"ఆవర్జితా కించిదివ స్తనాభ్యాం
వాసో వసానా తరుణార్కరాగమ్,
పర్యాప్తపుష్పస్తబకావనమ్రా
సంచారిణీ పల్లవినీ లతేవ."

ఇట్లు వచ్చు జగదేకసుందరియగు పార్వతీదేవినిఁ జూచి లబ్ధధైర్యుఁడై వింటి నందుకొన్నాఁడు. ఇంతలో శివుఁడు తపస్సు చాలించఁగా, పార్వతి సమీపించి,

"ఉమాఽపి నీలాలకమధ్యశోభి
విస్రంసయంతీ నవకర్ణికారమ్,
చకార కర్ణచ్యుతపల్లవేన
మూర్ధ్నా ప్రణామం వృషభధ్వజాయ."

ప్రణమిల్లినది. శివుఁడు "అనన్యభాజం పతి మాప్నుహి."అని యామెను దీవించినాఁడు. ఈదీవనలో కాళిదాసుయొక్క ప్రేమతత్త్వ మిమిడియున్నది. ఈ సందర్భమును బురస్కరించుకొని మన్మథుఁడు సమ్మోహనాస్త్రముఁ దొడుగ నీశ్వరుఁడు కించిత్పరిలుప్తధైర్యుఁ డైనాఁడు. కాని మఱుక్షణముననే యింద్రియములను నిగ్రహించినవాఁడై, ఫాలనేత్రాగ్నిచే మదనుని భస్మీభూతుఁ గావించి యదృశ్యుఁడైనాఁడు. అప్పుడు,

"తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్నమనోరథా సతీ,
నినింద రూపం హృదయేన పార్వతీ
ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా."

తన సమక్షముననే మన్మథుఁడు భస్మమగుటఁ జూచిన పార్వతి తన సౌందర్యమునే నిందించుకొన్నది.

రతిభావపోషకములగు పరికరములు గల వనమధ్యమున, వసంతవిజృంభణకాలమున, త్రిలోకసుందరియగు తన సమక్షముననే మన్మథుని భస్మము చేసిన శివుఁడు 'అరూపహార్యుఁ' డని నిశ్చయించి తన సౌందర్యమును నిందించుకొన్నది. ఇంతటి గంభీరార్థమును కాళిదాసు "తథా సమక్షం" అను ప్రయోగమున నిమిడ్చియున్నాఁడు. శివుఁ డరూపహార్యుఁడు గనుకనే పార్వతి యతనిని సాధింప నిశ్చయించినది.

"అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతి మాప్తు మిచ్ఛతి."

అనన్యభాజుఁడగు పతిని బొందు మని శివుఁడు తన్ను దీవించినాఁడు. రూపహార్యుఁడగు భర్త అనన్యభాజుఁడు కాఁజాలఁడు. కనుకనే సౌందర్యమునకు లొంగని పరమేశ్వరు నెట్లైన చేఁబట్ట పార్వతి కృతనిశ్చయ యైనది.

స్వార్థము, అహంభావము, మమత—యిన్నియు నశించి, భూతసేవాసక్తి, ఆత్మత్యాగము అలవడిననే కాని ప్రేమస్వరూపమును జూడలే మను నంశమును కాళిదాసు పార్వతీదేవి తపోనిష్ఠావర్ణనమున వివరించినాఁడు. నగాధిరాజపుత్రియగు పార్వతీదేవి ఆటపాటలను, సర్వసౌఖ్యములను త్యజించి, ఆశ్రమవృక్షములను, వన్యమృగములను, అతిథులను సేవింప నేర్చుకొన్నది. కొంత కాలమునకు సామాన్యమైన తపస్సుచే శివుఁడు లభ్యుఁడు కాఁడని తెలిసి యుగ్రమైన తపస్సున కారంభించినది. పర్ణవృత్తినిఁ గూడ మాని, పంచాగ్నిమధ్యమున నిలిచి యత్యుగ్రమగు తపస్సు చేసినది. తుదకు శివుఁడు బ్రహ్మచారిరూపమున వచ్చి, పార్వతీదేవిసాత్త్వికప్రేమచే జితుఁడై, యామె నర్ధాంగిగాఁ గైకొనినాఁడు. వీరిది అలౌకికమైన, అతీంద్రియమైన సాత్త్వికప్రేమ. ఈ దివ్యప్రణయవర్ణనమున కాళిదాసు మనకు నిజమగు ప్రేమస్వరూపమును బోధించియున్నాఁడు. దేహసౌందర్యాభిమానత్యాగముచే నాత్మసౌందర్యము, సత్కార్యానుష్ఠానమున చిత్తశుద్ధి, నిష్ఠచే నాత్మజ్ఞానము, తపస్సుచే నాత్మసంయమము సాధించిననే కాని ప్రేమతత్త్వమును దెలియఁజాల మని కాళిదాసు కుమారసంభవమున సూచించియున్నాఁడు.

### సాత్త్వికశృంగారరసస్వరూపము
### రతిమన్మథుల దాంపత్యము

నిశ్చల ప్రణయస్వరూపమును చిత్రించుటకుఁ గాళిదాసు గైకొన్న మఱియొక వస్తువు రతిమన్మథుల ప్రేమైకదాంపత్యము. శృంగారప్రపంచమున కధినాథుఁడగు మదనుఁడు రతీదేవి ప్రేమకౌముదిని గ్రోలు చకోరము. సరళహృదయ యగు రతి ప్రేమజీవియగు మన్మథునకుఁ దగిన సతి. రతీదేవికిఁ గల్గిన వియోగమును కాళిదాసు కరుణరసభూయిష్ఠముగ వర్ణించినాఁడు. భార్యావియోగపీడితుఁడైన మానవ చక్రవర్తియగు నజుని విలాపమునకు భర్తృవియోగతప్తయైన దేవతాస్త్రీయగు రతీదేవివిలాపము ప్రతిబింబము. ఇందుమతిలేని యజుని జీవిత మెట్లు నిరర్థకమో, మన్మథుఁడు లేని రతిజీవిత మట్లు వ్యర్థము. ప్రాజ్ఞుఁడును, పురుషుఁడును నగుటచే నజుఁడు దేహత్యాగముఁ జేయఁగూడక దుఃఖజీవితమును నెట్లో ఈడ్వ నిశ్చయించినాఁడు. అగతికయు, సుకుమారహృదయయు నగు రతీదేవి దేహము వహ్నిపాలుచేసి భర్త ననుగమింప నుద్యుక్తయైనది. వసంతునిఁ జూచి,

"గత ఏవ న తే నివర్తతే
స సఖా దీప ఇవానిలాహతః,
అహమస్య దశేవ పశ్య మా
మవిషహ్యవ్యసనేన ధూమితామ్"

"గాలి కాఱిపోయిన దీపజ్వాలవలె నశించిన నీ చెలికాఁడు మరలిరాఁడు. నే నన్నెనో దీపమాఱి పోఁగా నిలిచిన పొగతోడి వత్తివలె నున్నాను." అని పలుకుచున్నది.

"నను తైలనిషేకబిందునా సహ దీపార్చి రుపైతి మేదినీం" అని ఇందుమతిని జ్వాలకును, అజుని తైలబిందువునకును బోల్చి, పతిజీవితమున కత్యుత్తమస్థాన మొసఁగిన కాళిదా సిచట మన్మథుని దీపజ్వాలకును, రతిని వత్తికిని బోల్చి, పతిజీవితమున కనన్యమగు స్థానము నొసఁగియున్నాఁడు. సతివలననే పతికి శోభ, పతివలననే సతిజీవితము కాంతిమంతము నను నీ యంశమును కాళిదా సెన్నిపర్యాయములైనను సూచించియున్నాఁడు. చితిఁ బేర్చి, తన్ను తన భర్తతోఁ జేర్చి, ఆఖరు బంధుకృత్యమును నెఱవేర్పుమని రతీదేవి వసంతుని వేడుచున్నది. విచేతనములు సయితము భర్తల వెడఁబాసి యుండలేవన సచేతనయగు తా నెట్లు తాళ సింపఁగలదని పలుకు రతీదేవి ప్రేమవేగ మసమానమైనది.

"శశినా సహ యాతి కౌముదీ
సహ మేఘేన తటిత్ప్రలీయతే,
ప్రమదాః పతివర్త్మగా ఇతి
ప్రతిపన్నం హి విచేతనైరపి."

మన్మథుఁడు తన్ను విడిచి క్షణమైన నుండఁజాలఁడు. కనుక తన్నగ్నియందుంచి దక్షిణానిలములఁ దొందరపఱచవలెనని వసంతుని నాదేశించుచున్నది. పరలోకమందును విభాగము చేయక ఇరువురును త్రాగునట్లొకే జలాంజలి నిరువురకు నిమ్మని కోరుచున్నది.

"ఇతిచాపి విధాయ దీయతాం
సలిలస్యాంజలి రేక ఏవ నౌ,
అవిభజ్య పరత్ర తం మయా
సహితః పాస్యతి తే స బాంధవః"

పరలోకమందును విడిపోని దాంపత్యము వీరిది. కాళిదా సిట్టి మహోత్కృష్టమైన ప్రేమను వర్ణించి సతీపతుల జీవితైక్యమును మన కాదర్శముగాఁ జేసియున్నాఁడు.

### యక్షదంపతుల ప్రేమైకదాంపత్యము
### స్వార్థరహితమైన సౌశీల్యమునకు
### గీటురాయి

కాళిదాసు తన మేఘసందేశమునఁ గల్పించిన వియోగదశ యిదివఱలో వర్ణింపఁబడినవాటి కన్నిటికిని విలక్షణమైనది. యక్షదంపతులు కాళిదాసుని భావనాప్రపంచమున సృష్టింపఁబడినవారు. కాళిదాసు తన విప్రలంభశృంగార వర్ణనాసామర్థ్య చాతుర్యములను ప్రదర్శించుటకై వీరిని గల్పించి కావ్యమును రచించినవాఁడు కాఁడు. అట్టి యుద్దేశ ముండినచో రామాయణకథయందే తన చాపలమును దీర్చుకొనియుండెడి

వాఁడు. కాళిదాసుని యక్షుఁడు రసికుఁడు, సర్వ సౌఖ్యములను రుచిచూచిన సౌందర్యపిపాసి, భావనా సంపత్తిగల యువకుఁడు. యక్షుని భార్యయు విద్యావతి, లలితకళాభిజ్ఞ, భర్త లేనికాలమున గృహభారమును వహింపఁగల స్వతంత్ర. ఇట్టి యౌవనప్రాదుర్భావమున నున్న వీరి నిరువురను దేశాంతరముఁ బడవైచి వీరి విప్రలంభమును వర్ణించుటలో కాళిదాసునకు మహోద్దేశము లేకపోలేదు. యక్షదంపతుల కొకవత్సర మవధిగాఁ గల బలవద్వియోగమును ఘటింపఁజేసి కాళిదాసు వారి శీలము నగ్నిపరీక్షకు గురిచేసినాఁడు. ఒకరి విషయ మొకరు దెలిసికొనుటకుఁ గూడ సాధ్యముగాని పరిస్థితులలో నుండు నీయక్షదంపతులు పరిశుద్ధాంతఃకరణ హృదయులైన సాత్త్వికోత్తములైననే కాని కాళిదాసుని కఠినపరీక్షకు నిలువఁజాలరు. వీరి నట్టిపరీక్షయం దుత్తీర్ణులఁ జేసి, నిశ్చలప్రేమతత్త్వమును లోకమునఁ జాటుటయే కాళిదాసుని యాశయము.

సీతాదేవి స్నానముచేఁ బవిత్రములైన తీర్థములు గల రామగిర్యాశ్రమము యక్షుని ప్రవాసస్థానమని కావ్యారంభముఁ గావించి, కాళిదాసు తన పవిత్రోద్దేశమును సూచించినాఁడు. భార్యావిరహమునఁ గృశించిన యక్షుఁడు తొలకరి మేఘముచేఁ బ్రియసతికి సందేశ మంపుటయే కావ్యవస్తువు. ఈకావ్యమందలి కాళిదాసుని భావనయు మేఘమార్గమునే యనుసరించినది. ఇందితఁడు గావించిన వర్ణన లనన్యసాధ్యములైనవి, మనోహరములైనవి.

"జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపై
ర్బంధుప్రీత్యా భవనశిఖిభి ర్దత్తనృత్తోపహారః,
హర్మ్యేష్వస్యాః కుసుమసురభిష్వధ్వఖేదం నయేథాః
పశ్యన్ లక్ష్మీం లలితవనితాపాదరాగాంకితేషు"

ఇట్లు విశాలాపురి భవనములను వర్ణించుటలో కాళిదాసుని భావన విహంగపథమున సంచారము చేసినది. అలకాపట్టణమున మందాకినీతీర సైకతస్థలములలో నాడుకొను బాలికలను రసికజన హృదయరంజకముగఁ జిత్రించియున్నాఁడు.

"మందాకిన్యాః సలిలశిశిరైః
సేవ్యమానా మరుద్భి
ర్మందారాణా మనుతటరుహాం
ఛాయయా వారితోష్ణాః,
అన్వేష్టవ్యైః కనకసికతా
ముష్టినిక్షేపగూఢైః
సంక్రీడంతే మణిభి రమర
ప్రార్థితా యత్ర కన్యాః"

యక్షుఁడు భోగప్రియుఁడైనను పవిత్ర హృదయుఁడైన ప్రణయతపస్వి. ప్రవాసకాలమును ప్రియురాలి చింతతోఁ గడపుచున్నాఁడు. మేఘదర్శన మయినతోడనే దయితాజీవితాలంబనార్థి యయి, సందేశమును గొనిపొమ్మని,

"తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబంధు ర్గతోఽహం
యాచ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామా"

దీనముగ వేఁడినాఁడు. దివసగణనాతత్పరయైన తన సతిజీవిత మేమగునో యని కాతరుఁడగు యక్షుని ప్రేమ నిశ్చలమైనది.

"ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీ వోన్ముఖీ సా
త్వాముత్కంఠోచ్ఛ్వసితహృదయా వీక్ష్య సంభావ్య చైవ,
శ్రోష్యత్యస్మాత్పరమవహితా సౌమ్య సీమంతినీనాం
కాంతోదంతస్సుహృదుపనతస్సంగమాత్కించిదూనః"

అని తన భార్యను సీతాదేవితోఁ బోల్చి తనకు తన సతియందుఁ గల గౌరవమును దెలియఁజేయుచున్నాఁడు. పతివ్రతయగు యక్షిస్థితి నెంతో మనోహరముగ వర్ణించియున్నాఁడు.

"తాం జానీథాః పరిమితకథాం
జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే
చక్రవాకీ మివైకామ్,
గాఢోత్కంఠాం గురుషు దివసే
ష్వేషు గచ్ఛత్సు బాలాం
జాతాం మన్యే శిశిరమథితాం
పద్మినీం వాన్యరూపామ్."

"ఉత్సంగే వా మలినవసనే
సౌమ్య నిక్షిప్య వీణాం

మద్గోత్రాంకం విరచిత పదం
గేయ ముద్గాతుకామా,
తంత్రీ మార్ద్రాం నయనసలిలైః
సారయిత్వా కథంచి
ద్భూయోభూయః స్వయమపి కృతాం
మూర్ఛనాం విస్మరంతీ."

ఈ ప్రియకార్యమును నిర్వహించినవాఁడవై,
"ఇష్టాన్ దేశాన్ జలద విచర ప్రావృషా సంభృతశ్రీ
ర్మాభూ దేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయోగః"

అని యక్షుఁడు మేఘునితోఁ బల్కు కడపటి మాట లెంతయు భావగర్భితములై, తన విరహవిధుర తను బూర్తిగా వర్ణింపఁజాలినవియై యున్నవి. కాళిదా సిట్లు మేఘసందేశకావ్యమునందు యక్షదంపతుల సాత్త్వికదాంపత్యవర్ణన గావించి తన దివ్యప్రేమసందేశము నొసఁగియున్నాఁడు.

## నాటకత్రయము - లౌకికప్రేమ

ఇఁకఁ, గాళిదాసు తన నాటకములయందుఁ బోషించియుండునది లౌకికప్రేమ. నటులచే రంగమునఁ బ్రదర్శింపఁబడి సామాన్యు లందఱికిని ప్రేక్షణీయములగు నాటకములలోఁ బ్రాపంచికప్రేమను బ్రదర్శించి, సంస్కారముగల పండితలోకమున వెలయు శ్రవ్యకావ్యములందుమాత్రము దివ్యప్రేమను జిత్రించు నుద్దేశము కాళిదాసున కుండినట్లు తోఁచుచున్నది. మానవస్వభావజ్ఞుఁ డగు నితఁడు సంఘమున సాధారణ ప్రేమయను పేర జరుగు ననర్థములనుగూడ లోకమునకు దృశ్యకావ్యములమూలమున వెల్లడించి, నిజమైన ప్రేమ స్వరూపమును జూపఁదలఁచియున్నాఁడు. తన నాటకత్రయమందలి నాయకులు ముగ్వురును మానవమాత్రులగు చక్రవర్తులు. దుష్యంత పురూరవోఽగ్నిమిత్రుల పాత్రలను బోషించుటలో నితఁడు తనకాలపు రాజులనుగూడ కొందఱను మనసున నెంచుకొనెనా యని యనుమానము కలుగకపోదు. శకుంతలాదినాయికలు సాధ్వీమణు లయ్యును సంయమనశక్తి చాలని మానవస్త్రీలు.

## శకుంతలాదుష్యంతుల ప్రణయము ఇంద్రియమోద్భూతమైనది

దుష్యంతుని పాత్రను కాళిదాసు ధీరోదాత్తునిగాఁ బోషించియున్నను, నతని నొక దివ్యునిగాఁ జేయలేదు. అట్లుచేయుట కతని కిష్టమును లేదు. పవిత్రమగు కణ్వాశ్రమమును బ్రవేశించిన రాజు ఆశ్రమవృక్షములకు నీరు పోయుచుండు శకుంతలను, అనసూయా, ప్రియంవదలను జూచినాఁడు. చూచినతోడనే లతానికుంజములవెనుక దాఁగి వీరిని గమనింపవలె నని కోరిక కలిగినది. ఇది శృంగారరసపోషణకు మంచి ప్రారంభమేయైనను దుష్యంతుని ప్రాపంచిక శృంగారరస లోలుపతను ప్రదర్శించుచున్నది. శకుంతలాముఖమున వ్రాలుచుండు భ్రమరమునుగూర్చి దుష్యంతుఁడు,

"చలాపాంగం దృష్టః స్పృశసి
బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి
మృదు కర్ణాంతికచరః,
కరా వ్యాధూన్వత్యాః పిబసి
రతిసర్వస్వ మధరం
వయం తత్త్వాన్వేషా న్మధుకర
హతాః త్వం ఖలు కృతీ."

అని సానూయముగ, ధ్వనిప్రధానముగఁ బలుకుటలో నితఁ డెట్టి యింద్రియవ్యామోహమును జూపినాఁడో చూడుఁడు. కుటుంబియైన రాజు శకుంతలను గ్రహింప నిచ్చగించుటలో గొప్ప ఆశయ మేమియును గానరాదు.

"అనాఘ్రాతం పుష్పం కిసలయ
మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ
మనాస్వాదితరసమ్,
అఖండం పుణ్యానాం ఫలమివచ
తద్రూప మనఘం
నజానే భోక్తారం క మిహ
సముపస్థాస్యతి విధిః."

తావిమూర్కొనని క్రొవ్విరి, గోరుమోపి గిల్లని చిగురాకు, వజ్రమూచిరాయని రతనము, జిహ్వ చవి

యానని లేనియ — అని యిట్లు శకుంతలను దుష్యంతుఁడు వర్ణించినాఁడు. లాలితవిలాసనికేతనమగు నా లతాంగి ననుభవించు ఘనుఁ డెవ్వఁడో యని తహతహ పడినాఁడు. ఇట్లు శకుంతలసౌందర్యము నాసించి, యామె నొకభోగ్యవస్తువుగనే చూచినాఁడు దుష్యంతుఁడు. లేడిపిల్లలనడుమఁ బెరిఁగి తన్మయురాలైన శకుంతల చక్రవర్తిబాహ్యసౌందర్యపాశమునకుఁ జిక్కినది.

"పౌరవ, రక్ష వినయం. మదనహస్తగతాప్యాత్మనో న ప్రభవామి."

అని పలుకఁదగిన సంయమనము శకుంతల చూపినను, తుద కింద్రియముల కోడినది. ఇట్లిరువురి విషయమునను నింద్రియసంయమాభావకారణమున నుద్భూతమైన ప్రేమకు కాళిదాసు గౌరవము నొసఁగ లేదు. సులభముగనే లభించిన దగుటచే శకుంతల యవ్యాజప్రేమయొక్క విలువ దుష్యంతునకుఁ దెలియదు. ఆత్మసంయమములేని శకుంతలకు చక్రవర్తి పట్టపురాణి యగు నర్హత లేదు. కనుక నిరువురును వియోగానలమున తప్తులై యర్హత సంపాదించుకొన వలసియున్నది.

పెద్దల యాజ్ఞ లేక స్వతంత్రించినందులకుఁ దగిన ఫల మనుభవించినది శకుంతల. మానవతి యగు స్త్రీ కింతకంటెను ఘోరదండన కలుగదు. భర్తచే తిరస్కరింపఁబడి గౌతమిని వెంబడించినపుడు గురుసముఁడగు శార్ఙ్గరవుఁడు "ఆః పురోభాగిని! కిం స్వాతంత్ర్య మవలంబసే?" అని యర్థగర్భితముగ గర్జించినాఁడు. "స్వాతంత్ర్యకారణమున నీస్థితికి వచ్చిన నీవు మరల స్వతంత్రత వహించుచుంటివా" అని భావము. "ఇత్థ మాత్మకృతం చాపల మప్రతిహత మాత్మానం దహతి" అని శార్ఙ్గరవునిచేఁ బలికించి కాళిదాసు, ఇంద్రియోద్భూతమైన ప్రాపంచికప్రేమ ఫల మిట్టి దని బాహాటముగ చాటినాఁడు. ఈ దృశ్యమునే షష్ఠాంకమున పరితాపఖిన్నుఁడైన దుష్యంతుఁడు,

"ఇతః ప్రత్యాదేశా త్స్వజన మనుగంతుం వ్యవసితా
తత స్తిష్ఠే త్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే,
పున ర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ
మయి క్రూరే య త్తత్సవిష మివ శల్యం దహతి మామ్"

అని స్మరణకుఁ దెచ్చుకొనుచున్నాఁడు. పవిత్రాశ్రమలతారూపమైన శకుంతల యిట్టి వంచనాభూయిష్ఠమైన లోకమున నెట్లుండఁగలదు?

"వసుధే, దేహి మే వివరమ్" అని సీతాదేవి వలె సగద్గదికయై విలపించినప్పుడు కరుణరసరూపమై కన్పట్టినది. ఇం కొకవిషయము గమనించవలసి యున్నది.

"విశ్వంభరే దేవి! మా మంతర్ధాతు మర్హసి" అని సీతాదేవి కోరినతక్షణమే భూమిని పగుల్చుకొనివచ్చి భూదేవి యామెను పాతాళమునకుఁ గొంపోయినది. ఇది సీతాదేవియొక్క అతీంద్రియప్రేమప్రభావము. శకుంతల కట్టి ప్రేమప్రభావము లేదు. దానికిఁ గారణ మామె యింద్రియవశంవద యగుటయే.

శకుంతలకు దుర్వాసశ్శాపవృత్తాంతము తెలియదు. కనుక దుష్యంతుఁడు తన్ను మనఃపూర్వకముగ వంచించినాఁ డనియే తలఁచినది. ఐనను సాధ్వియగు నామె దుష్యంతుని నిందించినది కాదు. పునస్సమాగమ సందర్భమున శకుంతల,

"నూనం మమ సుచరితప్రతిబంధకం పురాకృతం తేషు దివసేషు పరిణామాభిముఖ మాసీత్, యేన సానుక్రోశోఽప్యార్యపుత్రః మయి తథావిధ స్సంవృత్తః"

అని దుష్యంతునితోఁ బలుకు మాట లీమెసరళహృదయమును, సౌశీల్యమును బ్రకటించునవియై యున్నవి. పశ్చాత్తాపతప్తుఁడైన దుష్యంతుని స్థితిని కవి అనుకంపార్హముగఁ జిత్రించియున్నాఁడు.

"స్వప్నో ను! మాయా ను! మతిభ్రమో ను
క్లిష్టం ను! తావత్ఫలమేవ పుణ్యమ్,
అసన్నివృత్త్యై తదతీతమేవ
మనోరథానా మతటాః ప్రవాహాః."

అని పలుకునప్పటికి దుష్యంతునకు శకుంతల యొక్క విలువ తెలియవచ్చినది.

"సంరోపితేఽప్యాత్మని ధర్మపత్నీ
త్యక్తా మయా నామ కులప్రతిష్ఠా,
కల్పిష్యమాణా మహతే ఫలాయ
వసుంధరా కాల ఇవోప్తబీజా."

అని దుష్యంతుఁడు దుఃఖించుటలో నితని యాశయమును మారినదని తెలియుచున్నది. ఇప్పుడితని దృష్టిలో శకుంతల అకృత్రిమసౌందర్యరాశి కాదు, మాతృత్వమున పరిపూర్తిరైన గృహిణి. ఇప్పుడు దుష్యంతుఁడు దుఃఖించునది 'అనాఘ్రాతపుష్పము కొఱకు' గాదు, ధర్మపత్నికొఱకు. కుమారుఁడను భరతునితో మొదట దుష్యంతునిఁ జేర్చి, తత్కుమారుని ద్వారా శకుంతలాసమాగమమునుఁ గల్పించిన కాళిదాసు తన యుదారప్రేమతత్త్వమును, ప్రేమపురుషార్థమును బ్రకటించినాఁడు. ప్రేమ వివాహముతో ప్రారంభమై సుసంతానమునఁ బరిణమించును. ప్రేమ నింద్రియ ప్రపంచమునుండి తప్పించి పూత మొనర్చునది సంతానము. మాతాపితలను వీడరానట్లు ప్రేమపాశములతో బంధించునది సంతానము. ఇట్లు కుమారుని మూలమున శకుంతలాదుష్యంతులకు పునఃసమాగమ మగునప్పటి స్థితి వేఱు. ఆత్మనిగ్రహము చాలని ముగ్ధయగు శకుంతల భోగలాలసుఁడగు దుష్యంతుని ప్రేమింప నారంభించినది మానవలోకమున. భరతమాతయు, తపస్వినియు నగు శకుంతల పశ్చాత్తాపతప్తుఁడైన దుష్యంతుని మరల చేరుట దివ్యలోకమందలి మారీచాశ్రమమున. వీరి గాంధర్వవివాహమైనను పవిత్రమగు కణ్వాశ్రమమున జరిగిన దగుటచే నిట్లు మంగళాంతముగఁ బరిణమించినది. ప్రేమకు ఫలము ప్రేయసీప్రేయసుల సంయోగము కాదు; లోకకల్యాణమునకగు సుపుత్రోత్పత్తి యని కాళిదాసు ప్రేమపవిత్రతను లోకమునకుఁ జాటినాఁడు.

## పురూరవోఽగ్నిమిత్రుల యింద్రియలోలుపత

విక్రమోర్వశీయ నాటకమందలి నాయకుఁడగు పురూరవుఁడు దుష్యంతునివలెనే ఇంద్రసఖుఁడగు మానవచక్రవర్తి. నాయిక అప్సరసయగు నూర్వశి. ఊర్వశీపురూరవుల ప్రణయము గాఢమైన దైనను నది లౌకికప్రణయమే. అనురక్తయు, సాధ్వియు నగు కళత్రమును గల్గియుండియు, ఊర్వశీసౌందర్యమునకు ముగ్ధుఁడైన పురూరవునియందు మనకు గౌరవము కలుగదు.

"ఆ దర్శనాత్ప్రవిష్టా
సా మే సురలోకసుందరీ హృదయమ్,
బాణేన మకరకేతోః
కృత మార్గ మవంధ్యపాతేన."

అను పురూరవుని వచనమున నతఁ డూర్వశిని మోహించుటకుఁ గారణ మామెసౌందర్యమే యని తెలియుచున్నది. ఉపవన విహారసమయమున పురూరవుఁడు,

"నిషిఞ్చ న్మాధవీ మేతాం
లతాం కొందీంచ నర్తయన్,
స్నేహదాక్షిణ్యయో ర్యోగా
త్కామీవ ప్రతిభాతి మే."

అని దక్షిణానిలుని కాముకుని దక్షిణనాయకునిగా వర్ణించిన వర్ణనచే కాళిదాసు పురూరవుని స్వభావమునుగూడ చిత్రించియున్నాఁడు. ఊర్వశీపురూరవసులయందు పవిత్రాశయము లెవ్వియుఁ గానరావు. పురూరవునియందు బద్ధానురాగయగు నూర్వశి యతనివలని రెండవబోటును సహింపఁజాలక పుత్రుని చ్యవనాశ్రమమున వదలినది. పురూరవునితోడి సౌఖ్యమే స్వర్గతుల్యమని యెంచినది. గర్భస్థమగు భర్తృతేజమును రక్షించు పవిత్రాశయము గలిగి, వాల్మీకి యాశ్రమమున దేహరక్షణ గావించుకొనిన ప్రేమమూర్తియగు సీత యెక్కడ, యింద్రియతృప్తికై కన్న కొడుకును చ్యవనాశ్రమమున విడిచిన యూర్వశి యెక్కడ? ప్రేమమోహములకుఁ గల భేద మిట్టిది. పురూరవునియం దీమెకుఁ గల మోహ మసాధారణమైనదియే కాని, యది ప్రేమగాఁ బరిగణింపఁబడఁజాలదు. ఆత్మసౌఖ్యమును మాత్రమే గణించిన ఊర్వశీపురూరవులు ప్రేమస్వరూపము నెఱుఁగఁజాలరు. మొదట స్త్రీసహజమగు మాత్సర్యమునకు లోనైనను,

వెంటనే సతీలక్షణమును నౌదార్యమును జూపిన పురూరవుని భార్య ఔశీనరి మిక్కిలి ప్రశంసనీయురాలు. పతిసౌఖ్యమే తన యానందముగా నెంచిన యీ దేవి 'ప్రియప్రసాదనవ్రతమును' భర్తసన్నిధియందు జరిపి, "అద్యప్రభృతి యాం స్త్రియ మార్యపుత్రః ప్రార్థయతే, యా చార్యపుత్రస్య సమాగమప్రణయినీ తయా సహ మయా ప్రీతిబంధేన వర్తితవ్యమ్." అని రోహిణీమృగలాంఛనమిథునము సాక్షిగా శపథముఁజేసి తన స్వార్థత్యాగమును ప్రదర్శించినది. పురూరవుఁ డిట్టి స్వార్థరహితమైన ప్రేమ నర్థముచేసికొనలేక పోయినాఁడు.

మాళవికాగ్నిమిత్రమందలి నాయకుఁ డొక సామాన్యమానవచక్రవర్తి. బద్ధానురాగలగు భార్యలను, యుక్తవయస్కుఁడగు పుత్రుని గల్గిన అగ్నిమిత్రుఁడు భార్యవద్ద దాసీస్థానమున నున్న మాళవికను మోహించుట యితని యింద్రియలోలుపతను జూపుచున్నది. రాజ్యభారమును మంత్రులపై నుంచి, భోగలాలసుఁడై శృంగారవిహారముల కాలముబుచ్చు రాజమాత్రునిగా నగ్నిమిత్రపాత్రను బోషించి కాళిదాసు తనకాలపు రాజుల చరిత్రమును జిత్రించి యున్నాఁ డని తోఁచుచున్నది. విక్రమోర్వశీయము నందువలె నిందును పట్టపురాణియగు ధారిణీదేవి యుదారస్వభావయగు సుశీల. భర్తయే సర్వస్వమని యెంచి, యాతనికై ఆత్మార్పణము చేయు భారతీయ గృహిణి యీ ధారిణి. ఈమెకు భర్తయందుఁ గల ప్రేమ నిశ్చలమైనది. సాపరాధుఁడైన భర్తను "యది రాజకార్యేష్వపీదృశ్యుపాయనిపుణతా ఆర్యపుత్రస్య తతః శోభనం భవేత్" అని యెంతో మృదువుగఁ బల్కిన యీమె గాంభీర్యము, పతిభక్తి కొనియాడఁదగినవి. ఇరావతీ ప్రోద్బలమున మాళవికను బంధించినను, అనంతరము పశ్చాత్తాపముఁ జెంది, తానే మాళవికను రాజున కిచ్చినది. స్త్రీపాత్రల నిట్లు పోషించుటలో కాళిదాసు భారతజాతికి స్త్రీలయందుఁ గల గౌరవమును, పక్షపాతమును జూపియున్నాఁడు.

ఇట్లు కాళిదాసు తన నాటకత్రయమున లౌకిక ప్రేమయొక్క వివిధ దశాపరిణామములను ప్రదర్శించి, తాను తన కావ్యత్రయమునఁ జిత్రించిన దివ్య, సాత్త్విక ప్రేమోత్కృష్టతను మనకు బోధించి యున్నాఁడు.

### సింహావలోకనము

ఇది కాక పరబ్రహ్మస్వరూపమైన ప్రణయము వివిధ స్వరూపములఁ దాల్చి యీ మానవ జీవితము నెట్లానందమయముగఁ జేయుచున్నదియు నీకవి తన రచనలయందు వర్ణించియున్నాఁడు. ధర్మార్థ కామ మోక్షరూప పురుషార్థసిద్ధికి సాధకమగు ధర్మస్వరూపముగా సుదక్షిణాదిలీపుల దాంపత్యప్రేమ పోషింపఁబడినది. అనురక్తులగు దంపతులకు దైవయోగమున శాశ్వతవియోగము కలిగినప్పుడు ప్రేమ యే రూపమున వ్యక్తమగునదియు అజరతీదేవి విలాపములయందుఁ జిత్రింపఁబడినది. సతీపతులకు తాత్కాలిక వియోగము కలిగి, పునస్సమాగమము కలుగు నను వాసనయున్నప్పటి ప్రేమస్థితి సీతారాముల ప్రథమ వియోగమందును, యక్షుని ప్రవాసమందును వర్ణితమైనది. సీతారాముల ద్వితీయవియోగమునఁ బ్రకాశితమైన ప్రేమస్వరూపము వేఱు, శకుంతలాదుష్యంతుల వియోగమందు వ్యక్తమైన ప్రేమస్వరూపము వేఱు. దుష్యంత భరతుల సమాగమమందును, శ్రీరామ కుశలవుల సమాగమమందును ప్రేమ పితృవాత్సల్యరూపమును బొందినది. తన బహిఃప్రాణ మగు సీతయపహరింపఁబడినప్పుడు రాముని ప్రేమ వీరరసరూపమును దాల్చి రాక్షసకులనాశకమై వెలుఁగొందినది. రఘువంశ సత్కీర్తిక్షయకారకుఁడగు అగ్నివర్ణుని విషయమున ప్రేమ తుచ్ఛకామముగాఁ బరివర్తనముఁ జెంది జుగుప్సాకరమై, బీభత్సరసరూపమును దాల్చినది. రాముని ప్రేమమూర్తియైన సీత ప్రియభర్తను, కుమారులను వదలి భూగర్భమున లీనమగునప్పుడు కరుణరస స్వరూపముగాఁ గన్పట్టినది. సతీదేవి వియోగ కారణమున తపస్వియై, యోగసమాధిలో నుండు పరమేశ్వరుని వర్ణనమున ప్రేమ శాంతరసముగాఁ బరిణమించినది. ఇట్లు ప్రేమ వివిధరూపముల జీవితమునం దెట్లు ప్రకా

శించునదియు కాళిదాసు మనోహరముగఁ జిత్రించి యున్నాఁడు.

లోకకల్యాణాధిష్ఠానమైన ధర్మదాంపత్యము ప్రేమపూరితయ మని యితని యభిప్రాయము. అలౌకిక, సాత్త్విక ప్రేమరాజ్యము ననుభవించుటకు నర్హత కావలయును. అట్టి యర్హత నొసఁగునవి ఇంద్రియ నిగ్రహము, మనస్సంయమము, స్వార్థత్యాగము నను దివ్య గుణములు. ఇట్టి సుగుణోపేతు లగు నుమామహేశ్వర సీతారామాది దివ్యదంపతుల లీలావిభూతిని వర్ణించి కాళిదాసు నిశ్చలప్రేమతత్త్వమును లోకమున చాటినాఁడు. ఇతఁడు డనన్యసాధ్యమగు స్వార్థత్యాగముతోఁ గూడిన దైవికప్రేమయొక్క భువనమోహన రూపమును తన కావ్యములందుఁ జిత్రించి లోకమునకు మహోపకారమును గావించినాఁడు.

---



# కళలు-వాటివల్ల ప్రయోజనం

శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తి

కవిత్వం, సినిమాలు చూడటం, ధనం వ్యయం చెయ్యటం, సంగీతం, పేచీలువేసి ఎలెక్షన్లు గెలవటం, పేకాటలో అవతలవాడికి తెలియకుండా అణాలు, పావలాలు, రూపాయలు లాగెయ్యటం, ఎప్పటి కేది అవసరమో అప్పుడామాట మాట్లాడటం, కందిపచ్చడిచెయ్యటం, చీరకట్టటం, తల్లో పూలు పెట్టుకోటం, నడవటం, మరొకడి పెళ్లాన్ని లేవతీసుకుపోవటం మొదలయినవన్నీ కళలుగానే పరిగణింపబడుతున్నాయి ఎవరిచేతనో ఒకరిచేత, ఎక్కడో ఒకక్కడ, ఎప్పుడో ఒకప్పుడు. కొంతమంది చీరకట్టితే అంగసౌష్ఠవం అవతారం దాల్చి చూచేవాళ్ల హృదయాల్ని వేధించుకుతింటుంది. కొంతమంది చీరకడితే అంగసౌష్ఠవం వున్నదీ లేనిదీ కూడా తెలియదు! కొంతమంది తల్లో పూలుపెట్టుకుంటే పద్మవ్యూహంలా దుర్భేద్యంగా వుంటుంది—కొందరి కవిత్వంలా. మహాబద్ధకంతో ఏమీ శ్రద్ధ తీసుకోకుండా వొంకెన చొక్కా తగిలించినట్టు పూలుపెట్టుకుంటే కొంతమందికి ఎంతో నాజూకుగా వుంటుంది. కోడిపుంజుమల్లేనూ, బాతుమల్లేనూ, ఇంకా అనేకపశుపక్ష్యాదులమల్లేనూ నడిచేవా రున్నారు; తాచుపాములా అందంగా నడిచేవా రున్నారు. సృష్టి యావత్తూ కళామయమే అంటే అర్థం ఇదేకామాలు!

ఇలా గోలకాకుండా వుండటానికే కామోలు మహాత్ములు ఎవరో కొన్నిటినే లలితకళలు అని ప్రత్యేకించారు. సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం మొదలయినవి వీటిల్లో చేరతై. పద్యాలు రాసేవారు కవులు—మక్తాకాదుసుమా! ఒకప్పుడు కవిత్వం ప్రచారంలో వున్నట్టు ఇప్పుడు కథానిక ప్రచారంలో వుంది. కథానిక సాహిత్యంకాదు అనుకునేవారు పెరటిదోవలోనే వుంటారు—ఎవరన్నా అనుకుంటేనే సుమా! కథారచన అలవాటులేని సాహిత్యసంపన్నులు కథానిక కాంగ్రెసులా విజృంభించటం చూచి ఎలాగో ఒకలాగు కథారచనచేసి పరిపూర్ణసిద్ధిని పొందారు. కథారచనతోనే పైకివచ్చినవారిని చూచి పద్యాలతో పైకి రాలేనివారు పైకిరావటమే ప్రధానంగా పెట్టుకుని, కథలు రాయలేకపోయినప్పటికీ అందరి వివాహాలూ కలగలిపి కలగూరగంపకథలుగా తయారుచేసి, కవులే కథలురాయగలరుగాని కథకులు కవిత్వంరాయలేరన్న

నిక్కాను లోపలే అణచి పెట్టుకుని, పులినిచూచి నక్క వాతలు పెట్టుకున్నట్టుంటుందన్న గమనం లేకుండా, కథలలో పాత్రలు ఎప్పుడో ఒకప్పుడు సమయంకనిపెట్టి దేహశుద్ధి చేస్తారన్న గమనంకూడా లేకుండా తిరిగే వానపాములు లేకపోలేదు. ఈసంగతి తెలిస్తే "కోకిల కాకుల గలసెన్" అని కవితా కళాకోవిదులు ఎంత ఖేదిస్తారో. కవిత్వం పోయి కథవచ్చె ఢంఢాం!

కవిత్వానికి సవతిగా కథానిక తయారయినట్టు, చిత్రలేఖనానికి ఫోటోగ్రఫీ తయారయింది. మీ మొహం ఇది కళ ఏమిటనీ, మీ మొహం ఇది కళ కాకపోవటం ఏమిటనీ మీమాంస దీనిమీద ఈరోజువరకూ జరుగుతూనే వున్నది. కథకులను కొందరు కవులు ఎలా అసహ్యించుకుంటారో పిక్టోరియలిస్టులను చూచి కొందరు చిత్రకారులు అలా అసహ్యించుకుంటారు. కవులను చూస్తే కథకులకు—ఇతరులకు కొంతమందికి వలెనే—ఎలా ఎగతాళో చిత్రకారులను చూస్తే పిక్టోరియలిస్టులకు అలా ఎగతాళిలేదు. పద్యం రాయగలిగినవాడల్లా కవి అయినట్టూ, రంగువెయ్యగలిగినవాడల్లా ఆర్టిస్టు అయినట్టూ ఫోటోలు తియ్యగలిగినవాడల్లా పిక్టోరియలిస్టు కాదు. పద్యంలో చూపటానికి వీలున్నంత కళ వచనంలోనూ, చిత్రలేఖనంలో చూపటానికి వీలున్నంత కళ ఫోటోలలోనూ చూపటానికి వీలున్నది. చూపించేవారూ, చూపించినవారూ వున్నారు. రాజుకొడుకు రాజు కావటంలో వున్నంత అన్యాయం వుంది రంగువేసే ప్రతివాడూ 'ఆర్టిస్టు' కావటంలో. ఈ అన్యాయం మధ్య మధ్య పండితపుత్రుడిద్వారా బయటపడుతుంది. పద్యాలు రాసేవారిలోనూ, రంగులు వేసేవారిలోనూ, ఫోటోలు తీసేవారిలోనూ 'ఆర్టిస్టు' లున్నారు. ఇందరు ఆర్టిస్టులేమిటి, ఇన్ని కళలేమిటి? అందుకనే "ఇందరు కవులేమిటి — వీరిలో చాలామంది కవితమ్ముళ్లూ, కవివర్ధకులూ, కవిమామలూ" అన్నాడు రుక్మిణీనాథశాస్త్రి అతని పుణ్యమా అని! వినటానికి శ్రావ్యంగా లేకపోయినా 'ఆర్టిస్టు ఆర్టిస్టు' కంటే 'పాయట్ ఆర్టిస్టు' క్షమించనీయం!

పద్యాలు రాసేవాడికీ, కవికీ వున్నంత భేదం వుంది సంగీతానికీ, పాటకీ. శోభనంరోజు అందరికీ కలగాలిసిన సిగ్గు ఇంకోవిధంగానైనా కలిగించేటంతటి సిగ్గుతో, అన్ని తీగెలున్నప్పటికీ చాడయ్య ఫిడేలుకుకూడ సాధ్యంగాని పాకంలో హారతి పట్టుకుని పాడబడేదీ పాటేననీ, డోలును చేతితో చరచవలిసినవైపు కర్రతో గీరితే బయలుదేరే శబ్దానికి ఒక్క పీసంకూడ తీసిపోని గొంతికతో, నాగలి దున్నినంత నాజూకుగా దాక్షిణాత్యులచేత పాడబడేదీ పాటేననీ, గొంతును శ్రుతిలో హాయిగా మేళవించో ఏదోచేసి – బాగా తెలియదు నాకు – సగం మూతలు పడిన కన్నులతో వీణె మీటుతూ వినేవారికి మత్తు ఎక్కేటట్టుగా చేసే రాల్గరగించు విమల గాంధర్వంబూ పాటేననీ పాఠకులు గ్రహింతురుగాక! ఒక్కొక్కరి దగ్గర లలితకళలు ఇంత లలితంగా వుంటయి! నాజూకుగా చీరలు చుట్టబడి చెల్లారాం షాపులో అద్దాల వెనకాల వుంచబడే యువతుల బొమ్మలకూ, వీధివొడ్డున వాలే కొమ్మలకూ వున్నంత భేదం వుంది పద్యాలు రాసేవారికీ కవులకూ; గాయకులకూ పాటకులకూ. ఈ మధ్య మద్రాసులో జరిగిన లీలా దేశాయి డాన్సుల మధ్య మధ్య సునీలాదేవి చేత పాటలు పాడించారు. గొంతు శ్రావ్యంగా వుంటుంది. అయినా పాట బాగుండలేదు. ఆ పాటంతా వుప్పుడుపిండి ఇడ్లీ వతు! గిరీశం లాంగ్వేజీ చూడగానే కరటకశాస్త్రుల్లు శిష్యుడికి మతిపోయినట్టు పోయింది ఆ పాటకు మద్రాసు సోదరులకు. ప్రతిసారీ ఆమెను రెండుసార్లు పాడించారు. అరవసోదరులు శ్రావ్యమైన గొంతికలకు వాదిపోతున్నమాట నిర్వివాదాంశము. "నూనెను ఇలా దాహం పట్టుతున్నారే, మంచి వెన్నకాచిన నెయ్యి అయితే ఏం చేస్తారో" అన్న పార్వతీశం జ్ఞాపకం వచ్చాడు ఎక్కడున్నాడో కాని. పదజాలానికి, ఫేసు పవుడరు మొహాలకు, మెరపుచీరెలకు వ్యామోహపడే వారంతా తల్లకిందులు కావటానికి అవకాశం వుంది ఆ పాటకు. మొన్న మద్రాసులో సెనెటుహాలులో జరిగిన సభలకు కలకత్తానించి సుబ్బులక్ష్మి వస్తానని రాకపోతే అన్నం సయించనివారు అనేకమంది. ఏమిటి

కారణం అని విచారిస్తే ఆమెగొంతు వినలేదా అనే వారే కాని పాట వినలేదా అన్నవారు లేరు. తెలుగు వారికి సంగీతంలో జాతిలేకుండా పోయింది. అరవ నేమ భావాలతో తృప్తిచెందలేక అరవపేర్లు పెట్టుకుని తిరిగే ఆంధ్రగాయకులు వున్నారు. ఇతరుల సంగీతాన్ని అనుకరించటంలో ఆంధ్రులు పాతకాపులు కనక వారివిషయం అదోరకంగా తగలబడుతున్నది. అరవసంగీతాన్ని కర్ణాటకసంగీతం అనుకునేవారు లక్షలు పెద్దలలోనే వున్నారు. హిందూస్థానీసంగీతం 'అరవంగా' పాడవచ్చు నని ఆంధ్రులకు తెలియదేమో. కర్ణాటకసంగీతాన్ని 'తెలుగుగా' పాడేవాడు ఏడీ? ఇక మనల్ని ఇమిటేట్ చేసేవాళ్లు అరవలు తప్ప ఇంకెవ్వరూ వుండరేమో! హిందీటాకీలు వచ్చి తమిళులకు జ్ఞానోదయం కలిగించినై. అరువు సంగీతం అలవాటయి పోతున్నది అరవలకు. ఇమిటేషన్లు సి. యస్. ఆర్. మొదలయినవారివల్ల వినివిని ఆ బాణకు అలవాటయిన చెవి ఎప్పటికా లిట్టిలిట్టే అన్న విధంగా మళ్లీ అరవసోదరుల చేతగాని ఇమిటేషన్లు వింటుంటే చిల్లులు పడక తప్పదు. వ్యాసు పాడిన 'శ్యామసుందర మదనమోహన' కీర్తనకు సుబ్బులక్ష్మి తద్భవం విన్నారు? వినకపోతే వినండి—వింటే మళ్లీ వినరు కనక! క్రొత్త బిచ్చగాడిరకం, వీరి వాపటం బ్రహ్మతరం కాదు మహాప్రభూ! ఇప్పుడు దనకొకపోయినా కొన్నాళ్లకయినా అనకుంటారు ఇన్నాళ్లు సంగీతంలో ఎలా తీసికట్టుయినామని. కళలవల్ల ఇదొక ప్రయోజనం!

కళ అంటే ఏమీ లేదు! చుక్కలు (Dots) కలిసి గీత (Line) అయినట్టుగా శబ్దాల కలయిక సంగీతం, రంగుల కలయిక చిత్రలేఖనం, మాటల కలయిక సాహిత్యం అవుతాయి. మాటలు కలిసినంతమాత్రాన సాహిత్యం, రంగులు కలిసినంతమాత్రాన చిత్రం, శబ్దాలు కలిసినంతమాత్రాన సంగీతం కావు. శబ్దాలకు సంబంధించిన కళ సంగీతం, మాటలకు సంబంధించిన కళ సాహిత్యం, రంగులకు సంబంధించిన కళ చిత్రలేఖనం. కంది పచ్చడి దేనికి సంబంధించిన కళ? ఎంత బాగున్నా అది ఇచ్చే ఆనందం క్షణికమే — మహా అయితే ఒక రోజే! అది చేసిన మనిషికాని, వడ్డించిన మనిషికాని—అదైనా స్త్రీ అయితేనే— బాగుంటే తప్ప దానివిషయం మనకు జ్ఞాపకమే వుండదు తర్వాత. మరి లలితకళ అలా కాదు. లలితకళలకూ కళలకూ (కందిపచ్చడి చెయ్యటమూ మొదలయినవి) వున్న ముఖ్యభేదం అదే!

ఔరంగజేబువిషయం ఒక కథ చెప్పతారు. ఆయన ఏవో రాజకీయవిషయాలు రాసుకుంటుండగా ఒకరోజున హజారముకడ ఎవరో ఫకీరుపాట వినిపించింది. ఆ పాడేదెవరో చూడకుండానే తల తీసెయ్యమని ఆజ్ఞఇచ్చాడు. ఆఫకీరు ఆయన్ని ప్రార్థించాడు. "నాఅంత నిగ్రహమున్నవాడినే చలింపచేసింది నీసంగీతం, ఇతరులు వింటే ఏమవుతారు? నువ్వు బతకటం దేశానికి క్షేమం కాదు" అన్నాట్ట ఆయన. దీనివల్ల ఆయన అధికారాన్ని ఎంత విరసంగా దుర్వినియోగం చేసేదీ విశదమవుతున్నప్పటికీ అతని హృదయం ఆకళకు ఎలావుడికిపోయేదీకూడా తెలుస్తుంది. ఆఫకీరుసంగీతంవల్ల ఒక్కక్షణంలో తనకు ఎంత గాయం కలిగిందో అంతగాయం విన్నప్రతివారికీ తప్పదు అనుకున్నాడు. సంగీతానికి — ఆఫకీరు సంగీతానికైనా సరే—తను పడ్డ బాధ అందరూ పడరని ఆయనకు తెలియదు. అందరూ అలా బాధపడేటట్టయితే భగవంతుడు సృష్టిఎప్పుడో ఆపేవాడు! సంగీతంవల్ల కలిగే బాధను భరించలేకే దాన్ని నాశనం చేశాడు ఔరంగజేబు అని వేరే చెప్పనక్కర్లేదు. అయితే ఔరంగజేబు తాను పండిపోవటానికి వున్న అవకాశాన్ని జారవిడిచాడనికూడ చెప్పక తప్పదు. అంత ముక్కోపి అయిన గాంధీమహాత్ముడు ఎలా సాధు వయినాడో అలాగే అవటానికి అవకాశం వుంది ఔరంగజేబుకుకూడ! "చేబ్రోలుపొగాకు చాలా బాగుంటుందయ్యా ఆనందయ్యా" అని ఓకొట్టుదగ్గిర అంటే నావెనకున్నాయనకు ఆవేశం పెరిగి "నువ్వు ఎప్పుడయినా చేబ్రోలుపొగాకు అసలు చూశావూ?" అన్నాడు. మర్నాడు కాని అర్థం కాలేదు ఆయనకు ఆపొగాకు అంటే ఎంత ఇష్టమో! ఏవిషయంలోనైనా ఎక్కువప్రీతి, అనభవం వున్నవాళ్లు దాన్ని

గురించి మాట్లాడే ఇతరులను చూచి అసహ్యించుకోవటం చాలా సహజంగా జరుగుతుంటుంది. సంగీతంసంగతి బాగా తెలిసినవాడి దగ్గర ఆ సంగతి ఎత్తితే వాడు మనల్ని మూడునిమిషాలలో బయటికి నెట్టటానికి అవకాశం వున్నది. ఇలా శృంగభంగం అయినవాళ్లు అందుకనే "అంత గొప్పవాడని చెప్పుతారు, వెళితే తిన్నగా మాట్లాడనుకూడ లేదు. వాడి గొప్పతనం ఎక్కడుంది?" అని నిందించటం వింటాము. అటువంటివారికి ఎవడికి తెలిసినసంగతి వాడి దగ్గిర మాట్లాడవద్దని నా సలహా. "అరె! నీవు రాసిన పద్యాలు అచ్చయినవేఁ" అంటే బుగ్గలు ఎఱ్ఱబడటానికి జరిగే విశ్వప్రయత్నం ఆపలేక, ముక్కుల్లోనించి మైలాపూరు ట్రాములా గాలివదలి, నిప్పులలో పెట్టిన దోసకాయ కొంచెం సేపటికి తుస్సున పగిలినట్టు నోరు తెరిచి చిరునవ్వు ద్వితీయముద్రణంచేసేవారున్నప్పటికీ "మీరు రాసిన కథ బాగుందండీ" అంటే "చంపుతా!" అని లేచేవారు లేకపోలేదు!

సరిగమలలో కళ లేకపోయినప్పటికీ వీటిని కలపటంచేత సరసమూ విరసమూ, సామాన్యంగానూ ఉపద్రవంగానూ జరుగుతుంది ఆయావ్యక్తులకు వారివారి అనుభవాలనుబట్టి, అదృష్టాన్నిబట్టి. బీరు తాగితే నిషా ఎక్కనివారూ, విస్కీ తాగితే నిషా ఎక్కనివారూ రెండూ కలిపి తాగిచూడండి అన్న అనుభవజ్ఞుడి మాట వాస్తవమే కావాలి! సమ్మేళనానికే కాక ఈ శక్తి ఆయాశబ్దాలకు ప్రత్యేకంగాకూడ వుంటుంది రసజ్ఞుడు ప్రదర్శించేటట్టయితే. హీరాబాయి కొంచెము సేపుపాడి శ్రుతిలో గొంతుకలిపితే, హృదయాన్ని దొంగిలించినవాడు గట్టిగా ముద్దుపెట్టుకుంటే వడుం మీద దెబ్బపడ్డ కోడెత్రాచులా సొమ్మసిల్లి ముగ్ధవలె కుర్చీలో కరిగిపోయి ఆరునెల్లదాకా కలవరింతలుగా అయిపోయినవారు వున్నారు! శబ్దానికి ఇంత శక్తి ఎలావచ్చింది? దీని నాడి తగిలితే ఎటువంటి మార్పు కలగటానికి సావకాశం వున్నదో చెప్పటానికి ప్రయత్నిస్తాను.

ఈ శబ్దాన్ని హోమోపతీపంచదారమాత్రతో పోల్చవచ్చును. హోమోపతీవైద్యవిధానంలో పంచదారమాత్రకు ఇనుముకంటె బలంకలిగిన వ్యాధులను వంచే శక్తి వుంది. ఈవిధానంలో ఆర్సెనిక్ విషం అమృతంలా పనిచేస్తుంది. గాయకుడిచేతిలో ఒక్క శబ్దం ఎలా వుడికించగలదో ఈవైద్యంలో పంచదార మాత్ర వ్యాధిని అలా వుడికిస్తుంది. సూక్ష్మంలో మోక్షం అన్నమాటకు ఇంతకంటె అర్థం లేదు. భగవంతుడు 'అణోరణీయాన్' అని అనటం వింటాము చూడండీ—అదంతా వుంది ఈ వైద్యంలో. దీనిలో వేదాంతం వుంది. జీవితం వుంది. కళకూ, లలితకళకూ వున్నంత భేదం వుంది ఈ వైద్యానికీ, ఇతర వైద్యాలకూ. ఇతరవైద్యవిధానం మనవ్యాధికి చలనం కలిగిస్తుందేమో కాని మానసికంగా మనం మారం. ఇతర వైద్యవిధానాలవల్ల కలిగే మార్పు కందిపచ్చడివల్ల కలిగే ఆనందంవిలువగలది! హోమోపతీవిధానంవల్ల మనకు ఇంకా ఆదర్శప్రాయమైన మార్పు కలుగుతుంది. పొరపాటున చదువుకోవటంచేత యితర విధానాలలో డాక్టర్లు అయినవారే కాని ఆవిధానంలో అభిరుచి గలిగి వైద్యులయినవాళ్లు ఎంతమంది? చదువుకోవటంవల్ల హోమోపతీడాక్టర్లయినవారికంటె ఆ విధానం చవిచూచినవారు తప్పనిసరిగా దానియందు అభిరుచి గలిగి డాక్టర్లయినవారు లక్షలమంది వున్నారు. వైద్యంలో అభిరుచిలేని డాక్టర్లు, లాలో అభిరుచి లేని ప్లీడర్లు, సినిమాలలో అభిరుచిలేని ప్రొడ్యూసర్లు బోలెడుమంది వున్నారు కాని హోమోపతీవిధానంలో అభిరుచి లేని హోమోపతిష్టును ఈధరాతలంలో ఒక్కడిని చూపలేరు ఎవరైనాసరే! డాక్టర్లయిన తరువాత, లాయర్లయింతరువాత ఆయావృత్తులలో అభిరుచి కలిగేవారు లేకపోలేదు. అభిరుచి వుండ మట్టెవైద్యులం అయినాము అనేవారంతా వున్నాడో లేదో తెలియకుండానే భగవంతుడున్నాడని నమ్మే రకం! పురాణామనుష్యులు అబద్ధం ఆడరని వారి నమ్మకం. డాక్టరుకు వైద్యం, ప్లీడరుకు లా వృత్తి అవుతున్నది కాని హోమోపతీవాడికి ఆవైద్యం అయినట్టు మతం ఎప్పుడూ కాదు. హోమోపతీవిధానంలో మంచికేగాని చెడుకు తావులేదు. అయితే గాయకుడు శబ్దాన్ని వాడినంత తెలివితేటలతో వాడాలి పంచ

దారమాత్రేనుకూడ. సంగీతం విని మతిపోయినవాడికి సంగీతమే మందు. హోమియోపతీ వైద్యవిధానతత్త్వమూ అంతే! వైద్యంలో అభిరుచివున్నవాడూ, అవసరమున్నవాడూ, ఈవిధానంవల్ల ఔరంగజేబులా అయినవాడూ కావాలంటే మావాళ్లోనే వున్నాడు!

పౌర్ణమినాడు సముద్రం ఒకచోట వుప్పొంగి మరొకచోట వుప్పొంగకుండా వుండనట్టూ, వర్షాకాలపు మబ్బులను చూచి కొన్ని నెమళ్లు వుప్పొంగి మరి కొన్ని వుప్పొంగకుండా వుండనట్టూ కొందరువ్యక్తులు కళలవల్ల ఆనందంపొందటమూ, మరికొందరు పొందక పోవటమూ జరగదు. కాకపోతే కొందరికి సంగీతం, కొందరికి సాహిత్యం, కొందరికి చిత్రలేఖనం నచ్చుతుంది. అప్పటికీ సాహిత్యమందు విపరీతమైన అభిరుచి కలవాడికి సంగీతంలో బొత్తిగా అభిరుచి లేక పోవటం ఎన్నటికీ జరగదు. కారణం రెండూ ఒక తల్లిబిడ్డలే కనక! కడసారివాడిమీద వున్న ప్రేమ తల్లికి ఇతరులయందు లేకపోవచ్చుకాని అసలు లేకపోవటం జరగదు.

సంగీతం వింటుంటే మనకు ఆనందం కలుగుతుంది. ఒకొక్కప్పుడు బ్రహ్మానందం కలుగుతుంది. అది ఒక్క క్షణమే కావచ్చు. ఆ ఒక్క క్షణం మన మనస్సులో ఏమీ వుండదు. ఈ ప్రపంచంలో వుండము. అటువంటి ఆనందం మనకు కలగకపోవచ్చు కాని కలిగితే ఆ ఒక్క క్షణం మనం మోక్షంపొందామన్న మాట. భగవంతుడు శూన్యుడు. మోక్షమూ శూన్యమే. మోక్షం అంటే భగవంతుడిని చూడటం అనుకోటం పొరబాటు. ఏమి చేసినా మానవుడు తను భగవంతుడిలో ఒక భాగమేనని తెలుసుకోవటం తప్ప ఇంకేమీ జరగదు. భూమి గుండ్రంగా వుంది. విశ్వం ఏలావుంది? మనకు ఆకారం వుంది. ఆత్మ కేమి ఆకారం వుంది? మోక్షానికీ ఆకారంలేదు. మణుగుదూది ఏకి దిళ్లుగానూ, పరుపులుగానూ చేస్తున్నాడు సాయిబు! కొన్నాళ్లయిం తరువాత యీదూది అంతా కలిసి మళ్లీ ఏకబడి మళ్లీ దిళ్లుగానూ, పరుపులుగానూ రూపం చెందుతుంది. మొదట దిండు దూదే మళ్లీ దిండు దూది అవుతుందా? పునర్జన్మవుంటే మనం అలా అవుతాం! అంటే చనిపోయిం తరువాత ఆత్మ దూదిలా కలిసిపోయి ఇంకోరూపం చెందాలి. అంతేకాని భగవంతుడి ఎదురుగా నిలబడి "హరీ! నువ్వు భగవంతుడివి, మా దుంప తెంపావే" అని గుర్తించటం ఎన్నడూ జరగదు. అలా జరగటానికి వీలులేదు—సమస్తమూ భగవంతుడిలోనే వుండాలని రూలు కాబట్టి. భగవంతుడిని చూచామని చెప్పే వారి మాటలు నమ్మొద్దు! ఎవరైనా చూస్తే నేనూ కొన్ని వందలసార్లు చూచాను. అయితే నేను నిజంగా చూడలేదు కనకనూ, చూడలేనని తెలుసు కనకనూ చెప్పుతున్నాను. భగవంతుడికంటె స్వార్థపరుడు లేడు కనక—ఈ సృష్టే అందుకు నిదర్శనం—భగవంతుడిని చూచామనేవాళ్లు ఒకటి చెప్పాలిసి వొకటి చెప్పుతున్నారు. భగవంతుడిని చూడటంకాదు వారు చేసింది, చవిచూడటం!

మోక్షం అంటే భగవంతుడి హుజూర్న వుండటం అనుకోటం కూడ పొరబాటు. ఇప్పుడు మనం ఆయనహుజూర్న వుండకుండా చేస్తున్న దేమిటి? ఇక మోక్షం అంటే మళ్లీ జన్మలేకుండా అయిపోవటం కూడ తప్పుగానే కనిపిస్తుంది! సృష్టి ఆగిననాడు తప్ప అలాంటిది జరగటానికి అవకాశం లేదు. అంటే నా వుద్దేశ్యం పునర్జన్మ వుందని కాదు! కాబట్టి మోక్షం అంటే మనం భగవంతుడిలో భాగమని నమ్మటంకాకుండా గుర్తించటం. చనిపోయి మోక్షం సంపాదించాలని ప్రయత్నిస్తున్నవారంతా ఆ పని మానేసి నామాట విని బతికుండగానే మోక్షం అనుభవించటం అలవాటు చేసుకోండి! చనిపోయింతరువాత మోక్షం అనుభవిద్దా మనుకోవటం వట్టి భ్రమ! ఈ మోక్షాన్ని అనుభవించటానికి భగవంతుడే కావలసినన్ని ఏర్పాట్లు చేశాడు. నదులూ, కొండలూ, మబ్బులూ, చెట్లూ, మృగాలూ, మనుష్యులూ, శబ్దాలూ, రంగులూ మొదలయిన వన్నీ ఇందుకు తోడ్పడుతయ్యి. ఇవన్నీ మనలాంటివే—భగవంతుడిలో భాగాలే. వీటిని చూస్తూ అంతులేని ఆనందాన్ని అనుభవించవచ్చు. ప్రతిక్షణం మనం అలాంటి బ్రహ్మానందాన్ని పొందామనుకోండి! నేనుమటుకు జీవితంలో అంతకంటె కోరుకునేదిలేదు! అలా జరగ

టానికి ఇక్కడ వీల్లేదు. అలా అనుభవించ దలుచుకున్న వాళ్లు అడవులలోనూ, కొండగుహలలోనూ కలిసిపోతారు. అలా చేసినా వారికోరిక తీరటానికంటె తీరకుండావుండటానికి బోలెడు అవకాశం వుంది. భగవంతుడిని చూడటానికి కాశీ పోయినట్టుంటుంది ఆనందంకోసం అడవులకు పోవటం! ఇక్కడకంటె అక్కడ ఏమీ ఎక్కువ లేదు. కాశీకి పోవటం ఇంక దేనికైనా అంటే అభ్యంతరం వుండదు కాని భగవంతుడికోసరం అంటేమటుకు అభ్యంతరం వుండక తప్పదు. కాశీలో భగవంతుడితోనే తృప్తిపడటం గవర్నమెంటుకు చెల్లించాలిసిన డబ్బు ఒక ఇంపీరియల్ బాంకు బ్రాంచిలోనే కట్టటం లాంటిది! ఏ బ్రాంచిలో, ఏ ట్రెజరీలో కట్టినా చేరాలిసినవారికి చేరుతుంది. కాబట్టి ఎక్కడివా రక్కడే వుండి మోక్షాన్ని సంపాదించవచ్చు. అంటే అందరూ వున్న చోటే వుండి మోక్షాన్ని అనుభవించటానికి అవకాశం వుందని మనవి. మోక్షాన్ని అనుభవించటంలో ఒకరికొకరు ఎప్పుడూ అడ్డంరారు. దాని కంతు లేదు కనక అయిపోతుందన్న దిగులు అక్కర్లేదు. యుద్ధాలప్పుడు దీని ఖరీదు పెరగదు. వానాకాలంలో దమ్మ్యనదు. దీన్ని పోగుచెయ్యగలిగిన వ్యక్తి ఎక్కడున్నా ఒకటే. జైలులో వున్నా, బయట వున్నా ఆ వ్యక్తికి కావలిసింది ప్రతి అణువులోనూ దొరక్కపోదు. చనిపోయినా జీవించినా ఆ వ్యక్తికి కలిగే భేదం ఏమీ లేదు. ఇతరులకే ఆ భేదం. అలాంటి వ్యక్తిని హిట్లరు మటుకు ఏం చెయ్యగలడు?

ఈ శబ్దం ఏమిటి? నాబోటి నలుసే. భగవంతుడిలో ఒక భాగమే. అందుకనే దానికా శక్తి. సవతికున్నంత రోషమూ, అసూయా వున్నయి దీనికి! అందుకనే చేపకు గాలం గుచ్చుకున్నట్టు మనుష్యుల్ని తగులుకుని చేపకుమల్లేనే గింజుకునేటట్టు చేస్తుంది. పీల్చి పిప్పిచేసి కమ్మెచ్చులు తీస్తుంది. లోపల వున్న మదమాత్సర్యాలను కరగించి ఒక మూల కూచోపెడుతుంది. ధనం, అధికారం అన్నీ తనకు లోకువేనని బుజావు చేస్తుంది. వ్యక్తికి అతనంత అల్పుడు లేడని తెలియబరుస్తుంది. లోపల కల్మషాన్ని ఎగరగొట్టి ఆర్సెనిక్ విషం అమృతం అయినట్టు చేస్తుంది. స్విచ్చి నొక్కితే ఎలెక్ట్రిక్ దీపంలా మెరిసిపోయేటట్టు చేస్తుంది వ్యక్తిని. ఇన్ని చేస్తుంది కాని పండితుల చేతుల్లో పడి పచ్చడి కాకుండా మటుకు తప్పించుకోలేదు ఈ శబ్దం!



# ఆనతి

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు



సవరింతునా
అగ్నివీణ
సవరింతునా దిశాం
చలముః రింగులువార
నవనవాంగార నం
భవకీల—బుస దేర
సవరింతునా
అగ్నివీణ

కనులలో రుధిరాశ్రు
కణము లుద్ధతిగూడ—
మనసులో మిన్నాగు
ఫణమెత్తి పారాడ—
సవరింతునా
అగ్నివీణ

ముకుళించి తపియింప
వెకలి నక్షత్రాలు—
సెకలోన భస్మమై
చెరలాడ జలదాలు—
సవరింతునా
అగ్నివీణ

తీగల్లో దారిద్ర్య
ధూమ్రధూమము లాగ—
రాగాలలో విధుర
వేగమ్ము చెలరేగ
సవరింతునా
అగ్నివీణ.




# కళ - పాండిత్యము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

విజ్ఞాని కానేరని జిజ్ఞాసువుకు పాండితి అక్కఱకైనది. దీని నందుటకు కాల డేండ్లను, పూండ్లను వెచ్చించును. నిద్రాహారములకు నీళ్ళువదలి సంయమి యైనవాడుగాని, బ్రహ్మచర్య దీక్షను బూనక వెలసిన వాడుగాని ఆదర్శపండితుడు కానేరడు. కాని, కళోపాసకుడు కానేరనివాడు పాండితి నందినపిదప జూప వలయు నాత్మసంయమము మఱింత యధికమైయుండ వలెను. కష్టపడి కడుపున జేర్చుకొనిన సామగ్రిని క్రక్కివేయుటకై పండితుడు వేయితెరవు లూహించును. తన యార్జనమును ప్రదర్శింప దలచుట తప్పు కాదు. న్యాయమే! ఇట్టికాంక్షను కట్టివేయుట కడు కష్టమే సుమీ! కాని, దీనిని కట్టివేయనంతవఱకు కుంచెను గాని, మంత్రశక్తిగల లేఖినినిగాని, మాధుర్యబంధురవీణాతంత్రినిగాని అతడు చేబూనరాదు. పూనె నేని, పిలువని పేరంటమునకు ముందంజవేయు ముదురు ముత్తైదువులవలె, పదస్యమునాడు సంభావనకై పరుగులిడివచ్చు ఛాందసులవలె లోనిసరకు సందర్భశుద్ధిని గమనింపక ఈవలబడి రసమును, ఔచిత్యమును, ధ్వనిని మున్నీట గలిపివేయును. కావుననే పండితులు పలువురు కవులగుట కసమర్థులగుచుందురు. వీరు పతితల కష్టసుఖములను పాటింపరు. తమ ధోరణిలో తాము పడియుందురు. తమ గొడవ తమది; తమ గోడు తమది; తమ ఘోష తమది; తమ వెఱ్ఱి తమది. కళోపాసకుడు తన యానందమునకు చేటు రానీయక, పాఠకుల పరితోషమునకు మసలను దెచ్చిపెట్టక, కన్నుగలిగి ప్రవర్తించి, వారికిని, తనకును అనుకూలమైన పంథ ననుసరించి చనును.

పాండితి అవ్వలినుండి లోనికి దిగుమతియగు సామగ్రి. లోగల దివ్యపదార్థము నవ్వలి పుడమికి ప్రసాదించి, దాని నలరించి, తా నలరునది కళ. స్వాతంత్ర్యకాములు అక్కఱలకు మానసికశిక్షణను నందినపిదప పాండితిని జూచి "ఇక మీదికి రాకుము" (*Thus far and no further*) అని వచింతురు. ఇది కెన్యూటును మార్కొనిన సముద్రము కాదు; కావున చెప్పినట్లు వినితీరును.

స్వీయపరిశోధనమున కవకాశ మీయక, పండితుడు పరపూజకై తన శక్తులను వినియోగించును. కట్టెదుట గల మూర్తినుండి ఇతడు కదలిపోజాలడు. పూజ మహత్తరమైనదే! కాని, పూజకూడ నిమిత్తమాత్రమే యని వక్కాణింతును. మహారచయితలను, వారి రచనలను పూజించి, కొంతకాలము వారి ననుకరించుట దొడ్డవిషయమే! కాని, వారి ప్రోలనే పూజాపీఠమును చిరప్రతిష్ఠగావించి కూర్చుంటిమేని, వారే యారాధ్యదైవతములని పొరబడెదము. ఎంతమహత్తరగ

మైనవారైనను, మానవదృష్టాంతము విజ్ఞానయాత్రయందలి కొండొక ఘట్టముమాత్రమే! మహాత్ముల యడుగు జాడల వెంటబోయి పోయి, పదంపడి మన జాడలను మనమే నిర్ణయించుకొనకపోయినచో, ఆక్రాంతము గద్దెనెక్క నుండవలసినవారమే! మహాత్ముల కింకరులమై యుండుము గాని పరమాత్మునందు, ఈశ్వర పర్యంకమున పట్టమహిషులమై యుండలేము.

మహారచయితలకు ప్రణమిల్లి, ఉత్కృష్ట రచనములను ప్రణుతించి "నిమిత్తమాత్రం బవు సుమీ" యని పాండితి నుద్దేశించి పలికి, ఈశ్వరదత్తజిజ్ఞాసాలోకమున తన తెన్నును తా నవలోకించి, అనువాద అనుకరణ అనుసరణములకు దిగదుడుపు విడిచి, ముందంజవేయుటే కళోపాసకుని కర్తవ్యము. అపుడే ఈతని మనుష్యత్వము సంకెలలు త్రెంచుకొని, విజయభేరిని మ్రోగించును. అపుడే ఈతని ప్రత్యేక వ్యక్తిత్వము, సహజప్రతిభ, స్వతంత్రప్రజ్ఞ ఆత్మప్రకాశము గావించుకొని, పంజరమునుండి విడివడి, రాగరంజిత వియత్తలమున సౌందర్యాన్వేషణమునకై యావేశభరితహృదయుడై వెడలు విహంగము వడువున విజ్ఞానాన్వేషణమునకై, సౌందర్య పరిశోధనమునకై కడంగును. అత్తఱి వేఱొక మానవునితో నీతనికి పోలిక పొసగదు. సాహితీ బృందావనమున జగదీశుని నెచ్చెలియై, మధుర మంజుల మురళిని మోవిగొని, గీతిక లాలపించుచు, యుగముల నలరించుచుండ, దివ్యగాయకు డీత డని లోకములు ప్రస్తుతించును.

భావమందును, భాషయందును గూడ స్వాతంత్ర్యకాముడై స్వీయవ్యక్తిత్వమును వ్యక్తీకరించితీరును. ఈతనిది సొంతతెరువు కావున నందు పరకీయమైన సామగ్రిని జొరనీయడు. పరభావములకు తన వ్రాతలందు తా చోటొసగుట కీత డిచ్చగింపడు. తా చోటొసగినను అది నామమాత్రమైనదై యుండును. ఇత డేలికవంటి వాడు; తానే సేనాధిపతియై ప్రవర్తించువాడు. ఎన్నడేని యొరుల యుద్దేశముల నుల్లేఖింపదలచినచో, తన రచనాంగణమున వీనిని వెన్కనే నిలుపును. "శ్రోహం కుమ!" అనుటకు సంశయింపనివాడు పరభావముల నుండి ఛాయలను గైకొనును. తన తలంపులను పెర తలపుల వెన్క నిలిపి వానిచే "తందానతాన" యనిపించును.

స్వాతంత్ర్యవిరోధి కాకున్నను, వినయమూర్తి వెన్కనే నిలువ గాంక్షించును. తన ప్రజ్ఞను దాను గుర్తింపనివాడును, తన శక్తియెడల విశ్వాసము లేనివాడును వెన్కనే నిలిచి కాలక్షేపము చేయురు.

కాని, చేకొనిన విషయము దృష్టాంతముల గొన్నిటి నపేక్షించునది యగుచో, ప్రతికూలాభిప్రాయములను తునియలుచేసి స్వీయభావములను రూఢిచేయవలసిన యక్కఱ యెదురొగ్గినచో, విషయము నవ్యమైనది కాక (తత్త్వశాస్త్ర మతశాస్త్రములవలె) సనాతనమైనదై, సంచితభావములకరణ బలవత్తరమైనదగుచో రచయితగాని, వక్తగాని (కవివలె వీరు నిరంకుశత్వమును ప్రదర్శింపరాదు కావున) పూర్వ ప్రస్తుత మహారచయితల వాక్కులను, స్వీయస్వాతంత్ర్యమునకు భిన్నము రాని తెఱగున, ప్రధానఘట్టములందు, ముఖ్యసందర్భములందు నుల్లేఖించు టొప్పు. ఇట్లుల్లేఖించుటకు విశాలహృదయుడు వెనుదీయ డని వచించితిని. *

ఉన్నత హృదయుడును, వినయమూర్తియునైన రచయిత తనవచనములందు అక్కఱైన ఘట్టములందు మాత్రప్రాయములైన మహాపురుషుల వాక్కులకు తా చోటొసగును.

మనుష్యమానసము సహజముగ ధ్వనిగర్భితమైనది. దీనికి ఊహాశక్తి మెండు. ఈశక్తి స్వతంత్రమైన

* "*Quotation confesses inferiority*" అని పలికిన ఎమర్సనుమనీషి "*A great man quotes bravely and will not draw on his invention when his memory serves him with a word as good...... The borrowing is often honest enough, and comes of magnanimity and stoutness*" అని వాకొనినాడు.

మానసికసంచలనమున నుదయించును. సంచలనమును పుట్టించు నిమిత్త మొకటి దానిని స్పృశించిన జాలును. ఒక మహారచయితవాక్కు, గభీరభావబంధురమై సౌందర్యమండితమైన వాక్కు పఠితచెవి బడినపుడు, పఠితహృదయమున గర్భాలయమందలి ఘంటారవమువలె ప్రతిధ్వనించినపుడు, ఆప్రతిధ్వనినుండి కోటికోటి క్రొత్తతలపు లుదయించి మెఱపుగుంపువలె వాని యంతరంగసీమయందు, విశాలమైన వాని మానసదిశావలయమున లెక్కింపరాని తళుక్కుల నీనును. వాల్మీకివాక్కులను వినిన యనంతరమే కాళిదాసుప్రతిభ ఆంతరంగిక సంచలనము నందినది. "రామం రాజీవలోచనం" అను వాక్కును వాల్మీకి తొలుత ప్రయోగించినాడు. ప్రకృతిపై కన్నుంచి, రాజీవముపై మనసుంచి, నిజాత్మను కలహంస గావించి సౌందర్యప్రవాహమున ముంచితేల్చి, ఆనందబంధురమైన ఉద్వేగమును హృదయబృందావనమున విజృంభింపనిచ్చి, వాల్మీకి చక్కని ఉపమ నూహించి, తన రచనమున దానిచే పైడిపంటను పండింపజాలినాడు. ఈ పైడిపంటచే తమ మానసములను తనుపుకొనజాలినవారు వివిధ సాహిత్యకేదారములందు చక్కని తలపువిత్తనములను నాటుకొనజాలిరి. వ్యాసకవివాక్కు ఎందఱెందఱి ప్రతిభావంతుల మానసముల నుద్వేగభరితము లొనరించినది కావు? ఎందఱెందఱి భావశక్తిని రేకెత్తించి బహుళ సాహిత్యవీథులందు దివ్యజ్యోత్స్నలను తేజరిల్లజేసినది కాదు? "నీలతోయదమధ్యస్థ విద్యుల్లతే" నభివర్ణించిన కవీంద్రుని భావ మహత్త్వ మెందఱెందఱి కవితమారుల ప్రతిభను నవ్యరచనావీథులందు విహరింపజేసినది కాదు? భగవద్గీతయందలి ఛాయలు బహుళభారతకవుల రచనలందేకాక కార్లైలు, ఎమర్సనులాది ప్రతీచీలేఖకుల రచనలందుగూడ ప్రవేశించినవి. ఉపనిషత్తులు పర్షియనుభాషనుండా లేటిన్ వాఙ్మయములోనికి అనువదింపబడినపుడు వానిని మనసార వీక్షించిన స్పైనోజా ఘనతాత్త్వికసంపద నంది, తన జీవితము ధన్యమైనదని మురిసినాడు. ఉపనిషత్తులందలి ఛాయలే రవీంద్రుని రచనమున రసధారిని గాంచి, అందు భువనమోహనభావసృష్టిని గావించినవి. ముత్తెపుచిప్పలో స్వాతివర్ష బిందువు పడిన యనంతరము అందు చక్కని ముత్తియ ముదయించును. పండితుని వాక్కు బిందువును బోలునది. కళోపాసకుని హృదయమున ప్రభవించు భావమో? ఇది మౌక్తికమే కదా!

నైసర్గికముగ రసభరితమైన హృదయమునకే, సహజముగ ఆనందపూరితమైన హృదయమునకే, స్వతస్సిద్ధముగ సౌందర్య మాధుర్య బంధురమైన హృదయమునకే, బహుభవసంచిత తపఃఫలముకతన ననల్పభావశక్తి నలవఱచుకొనిన హృదయమునకే, మనన నిదిధ్యాసనములను, ఏకాగ్రదృష్టి ధ్యానములను, గభీరసమాధి తన్మయత్వములను అలవఱచుకొనిన హృదయమునకే కళోపాసనము సాధ్యమగుట నిక్కమయ్యు, ఆంతరంగికమథనము గావించి అందలి భావరత్నములను వెలువరించునది కావున పాండితి కళాసృష్టికి నిమిత్తము కాగలదు.

---

# టక్కరి

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు

ఓయి, రసాలసాలమ! మహోన్నతి నందితి నంచుఁ గన్నులన్
మూయకు, మున్న నేఁ గనఁగ మోడువిధాన విలాప మందితే!
హేయము, నీదుదుర్గతిని జేమరి శ్రీమధుమాసవేళలన్
కోయిల టక్కులాఁడి దనుకోఁగదె, వాదన లేల సాలమా!

మధురమృదుస్వనంబులను మంజులశీతిక లెన్నొ పాడుచున్
బథికుల నెమ్మనమ్ములకుఁ బాయని సమ్మద మీయుకోకిలన్
బ్రథితునిఁగా గణించెదవు, స్వార్థపరత్వము దాని దేసుమా!
వ్యథల మునుంగునాఁడు గనువాఁ డొకఁడైనను లేఁడు సాలమా!

మెండగుఁ బండుటాకులను మెల్లఁగఁ బుట్టెడి లేఁజిగుళ్ల కీ
దండను జేరి గాన మను దాంభికమంత్రముఁ జేయుఁగాని, నీ
యండగలాటి శోభల సమంచితరీతి వచించునొక్కొ! యా
తిండి వసంతకాలమునఁ బ్రేపులు రాఁగ లభించుదన్కనే
కొండలు మారుమ్రోఁగునటు 'కో' యని కోయిల కూయు నెప్పుడున్.

కాలము చెల్లి యాకులను కాంతివిహీనత నంది రాలఁగా
నేలకొ చెంత చేర దది యేటిప్రవర్తన, కోకిలాంగనన్
చాల సుశీల యంచు మది సమ్మద మందితివోయి సాలమా
బేలవు! నమ్మె దండతనిఁ బ్రేమధనాన్వితు లంచు నయ్యయో!

చూచిన చిన్నపిట్ట! కడుచోద్యపువర్తన మేఁడ నేర్చెనో
చూచెదఁగాక! యంచనెదు, చూపులకందని మాయకోయిలన్
జూచుట కల్ల! ధర్మ మిల శూన్య మటన్నది నీ వెఱుంగవా?
శోచన మేల - నయ్యయొ! వసుంధర మాయలమూట సాలమా!

# దేవి యిచ్చిన వరం

[ కథానిక ]

★ శ్రీ కపిల చిన వేంకటరావు ★

చవితిచంద్రుడు ఉండీ లేనట్టుగా ఉన్నాడు. గుడ్డివెన్నెలలో లోకమంతా మసకమసకగా ఉంది. శరభన్న వంట చేసుకుంటున్నాడు. పొయ్యి మండడంలేదు. పొయ్యిలోనుంచి పొగ కళ్లలోకి పోయింది. శరభన్నకి మహాకోపం వచ్చింది. లేచి నుంచుని పొయ్యిరాళ్లని ఒక్క తన్ను తన్ని, "ఎంతసేపీ వెధవవంట! భోజనం కావాలి నాకు" అన్నాడు గట్టిగా.

మరుక్షణంలో అక్కడ ఒక అరటిఆకు పరచి ఉంది. అందులో మల్లెపువ్వుల్లాంటి అన్నం, పప్పూ, నాలుగుకూరలూ, ఆరు పచ్చళ్లూ, అప్పడాలూ, వడియాలూ, పులుసూ, పరమాన్నం, భక్ష్యాలూ వడ్డించి ఉన్నాయి. శరభన్న తన కళ్లని తాను నమ్మలేకపోయాడు. తాను తప్ప ఇంకో మనిషి లేని ఈ యింట్లో ఎల్లా వచ్చింది ఈ భోజనం? ఎవరు వడ్డించారు?

అసలు మొదటినుంచీ వినండి కథ. శరభన్న తండ్రిని మీరు చూసే ఉంటారు. నూజవీడు రైల్వేస్టేషనులో చలివేంద్ర లేదూ, అక్కడ మంచినీళ్ల బ్రాహ్మడాయన. ఆయనకు బాగా వృద్ధాప్యంలో కలిగాడు శరభన్న వరప్రసాదిలాగ. రైల్వే నౌకర్ల పిల్లలకుగాను ఏర్పాటుచేసిన ఒక చిన్నబడిలో విశేషకష్టంమీద తెలుగులు మాత్రం నేర్చుకున్న తర్వాత అక్కడ ఉన్న సత్రంలో గుమాస్తాపని ఖాళీ కాగా తండ్రిగారు తంటాలుపడి ఆపని చెప్పించారు శరభన్నకి.

దేశంయొక్క భారమంతా భుజాల మీద మోస్తున్న ఒక మహామంత్రికి ఉండవలసిన యోచనా నిమగ్నతా, దైహికమున్నూ, ఐహికమున్నూ అయిన ఈ తుచ్ఛ జీవనం మీద విరక్తిచెందిన మహాయోగి యొక్క పారలౌకికచింతా కనబడతాయి అతని ముఖంమీద. దానికి కారణం అతనికున్న బ్రహ్మచెవుడు.

చెవిటివాడు కావడంచేత చిన్నప్పటి నుంచీ శరభన్న తోడిపిల్లలతోటి ఆటపాటలకు వెళ్లడం ఎరుగడు. బాల్యచాపల్యంవల్ల ఒకటి రెండు పర్యాయములు అతను వెడితే తక్కినపిల్లలు అతనిని ముఖంమీదనే నిమ్మళంగా తిట్టడం, వాళ్లలోవాళ్లు పకపక నవ్వడం సాగించారు. అదిమొదలు శరభన్న ఏకాకిగానే సంచరించేవాడు. ఎవరితోనూ పని లేనిదే మాట్లాడడు. ఎవరైనా పిలిస్తే ముక్తసరిగా అడిగినదానికి జవాబు చెప్పి ఊరుకుంటాడు. అతని తండ్రి కాలంచేసిన కొద్దిరోజులకే తల్లి కూడా గతించింది. సత్రంలో ఒక మూల వండుకుని తింటాడతను. మిగతా అప్పుడల్లా ఏంచేస్తాడో ఎవరికీ తెలియదు. అతని సంగతే అక్కర్లేదు ఎవరికిన్నీ.

ఒకనాడు రాత్రి రైలులో వచ్చి సత్రంలో విడిసి మర్నాడు ఉదయాన్నే వెళ్లిపోయిన ఒక ఆసామీ మరచిపోయిన బాపతు 'దండకావళి' అనే పుస్తకం ఒకటి దొరికింది శరభన్నకి. అందులో అన్ని దండకాలూ పరిశీలించి తుదకు కాళిదాసుగారి శ్యామలా దండకం తనకు నచ్చగా అది వల్లనవేయడం మొదలుపెట్టి శరభన్న దానిని పూర్తిగా కంఠస్థం చేసుకున్నాడు.

ఆవేళ చవితి అని చెప్పాను కాదూ. శరభన్నకి ఎందుకో చాలా త్వరగా మెళుకువ వచ్చింది. పడుకున్న చింకిచాపమీద నుంచి ఒక్కగంతు వేసి లేచాడు. ఒళ్లు చాలా తేలికగా ఉంది. గబగబ పది దండేలూ, పది బస్కీలూ తీశాడు. జబ్బ కొట్టుకుంటూ సత్రం నూతిదగ్గరకి వెళ్లి స్నానం చేశాడు. స్నానం చేసి వచ్చేటప్పటికి శరభన్నకి శరీరంలో పుట్టిన చలాకీ ఇంతంత కాదు. ప్రపంచాన్నంతా తానొక్కడే జయించగల ననిపించింది. తన గదిలోకి వెళ్లి మూలను పెట్టిన ఒక పొట్లం విప్పాడు. కుంకుమపొట్ల మది. ఇంత కుంకుమ తీసి బొట్టు పెట్టుకున్నాడు. ఇంత కనుబొమలకి రాచుకున్నాడు. పొట్లం చేతిలో పట్టుకుని వంటగదివేపు వెళ్లాడు. వంటగది గోడమీద మసిబొగ్గుతో గీచి ఉంది ఒక పెద్దబొమ్మ—సింహంగా ఉద్దేశించబడిన భాగం ఒకటీ, దానిమీద సవారీ చేస్తున్నట్లుగా నాలుగు చేతులూ, పెద్ద తలా ఉన్న స్త్రీవిగ్రహంలాగ ఉన్న భాగం ఒకటీ. ఆ బొమ్మకి ఎదురుగా కూర్చుని శరభన్న మొదలుపెట్టాడు. "జయ జననీ! సుధాసముద్రాంత హృద్యన్మణిద్వీపసంరూఢ బిల్వాటవీమధ్య కల్పద్రుమాకల్పకాంతార" అంటూ దేవీదండకం. గట్టిగా కొంతసేపూ, పైకి వినబడకుండా పెదవులతో కొంతసేపూ, కేవలం మనస్సులోనే కొంతసేపూ, ఈ విధంగా చదువుతున్నాడు. ఆకలి లేదు, దప్పిక ఎరగడు. తిండి అతనే వండుకుని తినటం కాదూ. భోజనానికి వేళైంది లెమ్మని పిల్చేవాళ్లు లేరు. ఆరోజున సత్రంలోకి ఎవరూ రాలేదుకూడాను.

ఎండ క్రమక్రమంగా పెరిగి క్రమక్రమంగా విరుగుతోంది. వచ్చేరైలు వస్తోంది, పోయేది పోతోంది. శరభన్నమాత్రం అక్కడే నిశ్చలంగా కూర్చుని దండకం పారాయణ చేస్తున్నాడు.

మధ్యాహ్నం మూడు నాలుగుగంటల మధ్య ఎవరో ఒక వృద్ధసన్న్యాసి పీకవల్లి వైపునుంచి అడ్డదారిని నడిచివచ్చి ఆయాసంచేత ఆసత్రంఅరుగుమీద కూర్చున్నాడు. ఒక్క ముహూర్తం అల్లా కూర్చున్నాడో లేదో ఆయనకి వంటయింటివేపు పోవాలని బుద్ధి కలిగింది. అటువేపు వెళ్లి చూచాడు కదా, శరభన్న ఉత్సాహంగా ఉచ్చరిస్తున్నాడు: "తస్య భద్రాసనం భూతలం, తస్య గీర్దేవతా కింకరీ, తస్య...".

ఆసన్న్యాసికి ఆశ్చర్యంకలిగింది. అక్కడే నిలబడి విన్నాడు కొంతసేపు. శరభన్న కళ్లు తెరవకుండా ద్విగుణించిన ఉద్రేకంతో చేస్తున్నాడు జపం. ఆప్రకారం వినగావినగా ఏం గోచరించిందో, తన సంచిలోనుంచి ఒక కొబ్బరికాయముక్కా, ఒక బొంత అరటిపండూ తీసి అక్కడ పెట్టి, దేశద్రిమ్మరిన్నీ, వృద్ధుడున్నూ, సర్వసంగపరిత్యాగిన్నీ

అయిన ఆ సన్న్యాసి శరభన్నకు ఒక నమస్కారం పెట్టి, నెమ్మదిగా అడుగులు పెట్టుకుంటూ అవతలికి వెళ్లి, తనదారిని తాను పోయినాడు.

శీతాకాలపుప్రొద్దు. ఇంతట్లో రాత్రైంది. ఇళ్లల్లో దీపాలు వెలిగించుకున్నారు. వెన్నెల గ్రుడ్డిగా వెలుగుతోంది. ఎక్కడో దూరంలో ఎవరో బృందం భజన చేస్తున్నారు. తాళాలూ, పాటా వినబడుతున్నాయి. కొంతసేపటికి భజన చాలించారు వాళ్లు. ప్రపంచమంతా నిశ్శబ్దమైంది.

ఆ తరుణంలో శరభన్నకు విచిత్రమైన అనుభవం కలిగింది. ఆ గోడమీద అలౌకికమైన కాంతి ఒకటి కనిపించింది అతని కళ్లకి. సింహవాహనారూఢ అయిన దేవి అతని యెదుట సాక్షాత్కరించినట్లుగా ఉంది. దేవియొక్క ముఖంలో చిరునవ్వు విరిసినట్లూ, ఆమె పెదవులు కదలుస్తూ, "ఏమిటయ్యా నీకోరిక శరభన్నా ?" అని అడిగినట్లూ. తెల్లబోయి చూచాడు శరభన్న. మళ్లీ అదేమాట అడిగింది దేవి. ఇంతట్లో శరభన్నకు ఎల్లా పుట్టిందో ధైర్యం, రెండుచేతులూ మోడ్చి, తల నేలను బెట్టి "అమ్మా, నేను ఏది కావాలని కోరితే అది వెంటనే కావాలి" అన్నాడు. దేవి ఒక చేతిని ఎత్తి 'జాగ్రత్త' అన్నట్టుగా తర్జని ఊపి, ఒక్క క్షణం వరదముద్ర పట్టి మళ్లీ గోడమీద విగ్రహంలో కలిసిపోయింది. మళ్లీ గ్రుడ్డివెన్నెలా, కొద్దిగా చలీ. దూరంగా ఎక్కడో ఒక ముసిలికుక్క మోర ఎత్తుకొని ఏడుస్తోంది.

అప్పుడు కళ్లు తెరిచాడు శరభన్న. ఆకలి దహించివేస్తోంది అతన్ని. చీకట్లో చేతికి తగిలితే తీసి చూచాడు—కొబ్బరికాయ ముక్కా, కొంత అరటిపండూ. అవి నోట్లో వేసుకుని నమిలేశాడు. ఏం లాభం? పాతికేళ్ల కుర్రవాడు, బ్రహ్మచారి—అతని ఆకలి కవి యేపాటి ? వాటివల్ల శరభన్నకి క్షుద్బాధ యేమీ తగ్గకపోవడమే కాకుండా మరింత ఎక్కువైంది. ఒక్క ఉదుటున లేచి సత్రంవేపు వచ్చాడు. రైలుస్టేషను మాస్టరుగారి గదిలో ఒక దీపం సన్నగా వెలుగుతోంది స్టేషనులో మిఠాయి అమ్ముకునేవాడి దుకాణందగ్గర ఒక చిన్న కిరసనాయిలుబుడ్డి గాలిలో ఎప్పటికప్పుడు ఆరిపోయేదానిలాగ మినుకుమినుకు మంటోంది. ఉన్న నాలుగు ఇళ్లవాళ్లూ అప్పుడే తలుపులు బిగించుకున్నారు.

లోపలికి వెళ్లి శరభన్న తన చిన్న ఆముదందీపం వెలిగించుకుని కూర్చున్నాడు. ఆకలికి తాళలేకపోతున్నాడు. అన్నం వండుకోవాలి, తినాలి. అన్నం వండుకోవడం అంటే మాటలా ? పొయ్యి రాజెయ్యాలి, బియ్యం కడగాలి, ఏదైనా ఒక పచ్చడి నూరాలి. మజ్జిగ లేదు. "శాస్త్ర భోజనం పెట్టు తల్లీ" అని యే అమ్మనైనా యాచిద్దామంటే ఆపట్టెని బ్రాహ్మణగృహం లేదు. మిఠాయి దుకాణంలో ఏమన్నా తినడానికి వాడు గొల్లవాడు, వాడిచేతితిండి...ఛీ—పో:, ఆపద్ధర్మమనుకుందామా, వాడు వేరుశనగనూనెతో చేస్తాడవి. వికారం, వాంతులూ! బకాసురుడి జఠరంలాగ ఉంది ఆకలి. సరే, వంటయింట్లోకి వెళ్లి అక్కడ పొయ్యి రాజేసి బియ్యం పెట్టాడు. పొయ్యి మండడంలేదు. పొయ్యిలో నుంచి పొగ కళ్లల్లోకి పోయింది. శరభన్నకి మహాకోపం వచ్చింది. లేచి నుంచుని

పొయ్యిరాళ్లని ఒక్కతన్ను తన్ని "ఎంతసే పీ వెధవవంట, భోజనం కావాలి నాకు" అన్నాడు గట్టిగా.

చెప్పాను కాదూ, మరుక్షణంలో అక్కడ ఒక అరటిఆకు పరచి ఉందనీ, దాంట్లో షడ్రసోపేతమైన భోజనం ఉందనీ, శరభన్న తన కళ్లని తాను నమ్మలేకపోయాడనిన్నీ. అంతలో జ్ఞప్తికి వచ్చిం దతనికి శ్యామలాదేవి ఒక వర మిచ్చినట్లు తనకు కలిగిన అనుభవం. "అది నిజమేనన్నమాట" అనుకుంటూ, అతను పరీక్షచేయాలని కాబోలు, "పీట ఏదీ" అన్నాడు. ఎక్కడినుంచి వచ్చిందో, నాల్గుమూలలా వెండిపువ్వులతో మిలమిల లాడుతూ, ముద్దులు మూటగట్టే ఒక చక్కని టేకుపీట విస్తరిముందుకు వచ్చింది. శరభన్నకి ఇంకా నమ్మకం కలుగలేదు. "మంచి నీళ్లు" అన్నాడు. తళతళలాడే వెండిచెంబుల జోడాతో వచ్చాయి మంచినీళ్లు శరభన్న ఆశ్చర్యపడుతూ పీటమీద కూర్చున్నాడు. భోజనం దేవికి నివేదనచేయడానికి అభిఘరించాలని చూస్తే నెయ్యిలేదు.

"నెయ్యి?" అన్నాడు.

ఘుమ ఘుమలాడే నేతితో నిండిన వెండి గిన్నె ఒకటి హాజరైంది.

ఆపోశనంపట్టి ప్రాణాహుతులు చేసి విస్తట్లోని అన్నీ నాలుకకు రాచుకొని చూచాడు. కూరలు బాగానే ఉన్నాయి. పచ్చళ్లూ బాగానే ఉన్నాయి. వాళ్ల అమ్మ బ్రతికి ఉన్నప్పుడు ఎప్పుడైనా చింతచిగురూ పప్పూ వండేది. అది తలపుకు వచ్చి అతను "చింతచిగురుపప్పు" అన్నాడు. దోరగా వేగిన మిరపకాయముక్కలతో, కొత్తిమిరి చింతచిగురు వాసనలతో, ఆవిరులు చిమ్ముతూ వచ్చిపడింది చింతచిగురు పప్పు. ఓహోహో! ఏమి రుచి, ఏమి రుచి!!

"పెరుగు?"

పెరుగు వచ్చింది. గట్టిగా కరళ్లు కట్టి, మీగడ జిడ్డుతో, ఏకిన ప్రత్తియొక్క తెలుపుతో, తియదనాలతో వచ్చింది పెరుగు. దానితో మళ్లీ మళ్లీ తిన్నాడు శరభన్న.

పెరుగూ అన్నం తింటూంటూనే వచ్చింది నిద్ర అతనికి. లేచి చేయి కడుక్కోవాలని అవతలికి వెడితే కొంచెంగా చలి వేసింది.

"వేణ్ణీళ్లు" అన్నాడు.

వెంటనే చక్కగా పాళాలుగా తోరిపిన ఒక కాగుడు వేణ్ణీళ్లు వచ్చాయి. వాటిలో చేతులూ, కాళ్లూ కడుక్కొని, అంగవస్త్రంతో తుడుచుకొని, మళ్లీ పీటమీద కూర్చుని విస్తరి దగ్గిర మెతుకులు ఎత్తడం మొదలు పెట్టాడు. నిద్ర వస్తోంది. భోజనం కడుపు నిండా తిన్నతర్వాత విస్తరి యెత్తుకోవడం, శుద్ధి చేసుకోవడం చాలా బరువుగా తోచిం దతనికి. సగంవరకు మెతుకులు యెత్తిన తర్వాత ఉలికిపడి శరభన్న చెయ్యిజాడించి, "యెంగిలి పోవాలి" అన్నాడు. కళ్లు మూసి తెరిచేలోపల విస్తరి పోయింది, యెంగిలి పోయింది. ఆ వెండిచెంబుల జోడా, పీటా, నేతిగిన్నే మాత్రం అక్కడే ఉన్నాయి. "ఇవికూడా పోవాలి" అన్నాడు. తక్షణం అవన్నీకూడా మాయమైపోయాయి.

మళ్లీ సత్రంలోకి రాలేక చింకిచాపకు బదులు తన అంగవస్త్రమే పరుచుకొని పడు

కున్న నిముషంలోనే అతనికి ఒళ్లు తెలియని నిద్ర పట్టింది……………

మళ్లీ ఎందుకు తెలివి వచ్చిందో వచ్చింది. శరభన్న కళ్లు విప్పేసరికి చీకటి దట్టంగా ఉంది. అతని ఆముదందీపం ఆరిపోయింది. లేచి ఇవతలికి వచ్చి చూస్తే అంతా చీకటి. రాత్రి ఇంక వచ్చే రైళ్లు లేకపోబట్టి పడుకున్నాడు కాబోలు స్టేషనుమాస్టరుగారు, ఆయనగదిలోనూ దీపంలేదు మిఠాయి దుకాణంవాడి కిరసనాయిలుచిలక ఎప్పుడో ఆరిపోయింది. తన ఆముదం దీపం చేతితో పట్టుకొని సత్రంలోకి తెచ్చుకుని సిమ్మామీద పెట్టి, అది వెలిగించకుండానే గోడకు చేరబడి కూర్చుని వేళ్లు మెటికలు విరుస్తూ ఆలోచన మొదలు పెట్టాడు. అతని మనస్సులో ఒక విధమైన ఉత్సాహం, శరీరంలో ఒక విధమైన శక్తీ ద్యోతకమవుతున్నాయి అప్పటికి కొన్ని గంటలక్రింద తాను చూచిన అద్భుతవిషయాల్ని తలచుకుంటే అతనికి ఎంతో ఆనందం కలిగింది. అంతలో మళ్లీ సందేహం కలిగింది. అతను మళ్లీ తేరిపార చూచి, "దీపం వెలగాలి" అన్నాడు.

ఎవరూ వెలిగించకుండానే గుప్పున వెలిగింది ప్రమిదలోపలి ఆముదందీపం. అతనికి అంతులేని సంతోషం కలిగింది. మళ్లీ "దీపం వద్దు" అన్నాడు. దీపం టప్పున ఆరిపోయింది.

"దీపం" అన్నాడు తిరిగీ. సన్నజాజి మొగ్గలాగ సన్నగా వెలిగింది దీపం.

ఈ విధంగా ఒక వందపర్యాయములయినా ప్రయోగాలు చేసి చూచాడు శరభన్న పలకలు, పలకపుల్లలు, పెద్దబాలశిక్షలు, పెన్సిళ్లు, సిరాబుడ్లు, వంటగిన్నెలు, ఉప్పులు, పప్పులు, ఎన్నో సృష్టించాడు. వాటిని మళ్లీ నాశనంచేశాడు. మళ్లీ దీపంమీద దృష్టిపడి, "నాకు గ్లాసులైటు కావాలి" అన్నాడు. తక్షణం వచ్చిపడింది గ్యాసులైటు ఆముదందీపంస్థానంలో. పట్టపగలు లాగ తెల్లటి వెలుతురు సత్రంగదిలో, అరుగుమీదా, సత్రంఆవరణలో చాలా దూరం వ్యాపించింది. నిజంగా గ్యాసులైటవునో కాదో అని చూచాడు శరభన్న. నిస్సందేహంగా అది గ్యాసులైటే. జంక్షను దగ్గరా, నూజివీడులోనూ ఉంటాయే, అల్లాటిదే. అవి పొగచూరుతూ ఉంటాయి గాని ఇది చక్కగా ఉంది.

తనశక్తిని చూచుకుంటే కలిగిన ఆనందం వల్ల అతడు పకపక నవ్వాడు. నవ్వి ఆ లైటును పొమ్మన్నాడు. అది పోయింది. "ఇప్పుడు తెల్లవారాలి" అన్నాడు.

[ప్రశేషము]

---

శ్రీ
భమిడిపాటి
కామేశ్వరరావు



# విశ్వామిత్రరావు — తనలో

[హాస్యరచన]

నిజమే! పని వేరు; మాటలు వేరు. పని అంటే మాటలు చెప్పడం కాదు. కాని, మాటలు చెప్పడం పనేగా! అసలు 'మాట' అనేదే పని; అందులోనూ అనేకులు అనేకకాలం నిరంతరంగా చేసిన పనంతా కలిపితేగాని ఒఖ్ఖ మాట అవదు. కాబట్టి మాటలు చెప్పడం మాటలుకాదు, సరిగదా, డబ్బీ పనికూడానూ! ఏమైనేం, మాటలు నావృత్తికర్తకి ఉపయోగించే దినుసు. మాట అనేదాన్లో ఒక విశేషం ఉంది. మాట యొక్క వస్తుతత్వం గమనిస్తే అందులో దొరికేవి వాయువూ ఆకాశమూనూ! ఈరెండూ భూతాలే. భూతం అంటే, వెనకనించీ-ప్రాణికోటి పుట్టకపూర్వంనించీ ఉండేసుకుంటూ వచ్చేస్తూన్న పదార్థం. అందువల్ల, న్యాయంబట్టిచూస్తే, భూతాలు మానవజాతికి—శుద్ధ న్యాయంబట్టి ప్రాణికోటికి—యావత్తుకీ వారసత్వం గల ఉమ్మడి ఆస్తి! అయితేం, గడసర్లు భూమిని పంచేసుకున్నారు. జలాన్నికూడా పంచుకుంటున్నారు. వాయువుమీదకూడా యాజమాన్యాలు బయల్దేరేటట్టుంది. ఖగోళశాస్త్రకారులవాళ్లు—ఓ పాతిక మంది ఉంటారు — ఆకాశానికికూడా వాటాలెట్టి చీటీలువేసుకున్నారు. కాని, వాయ్వాకాశాలు మిశ్రితమైన మాటలు ఉమ్మడివాడకంనిమిత్తం కాకపోతే పుట్టేఉండవుగనక, వ్యక్తులు వాటిని పంచుకోడం అసంభవం. నేను నామాటవ్యవసాయంలో కోస్తాను, కుప్పేస్తాను, నూరుస్తాను, పేరుస్తాను. అల్లా ఊహూ తెగనరుక్కుపోవడమేకాని, ఆమాటలు ఎవరెవరివంటూ, ఎంతెంతవరకూ అంటూ చూచోను; చూచోవలసిన అవసరం లేదు. మాటలమీద స్వంతహక్కు ఏ ఒక బ్రహ్మరుద్రుడికీ లేదు. నేను మాటలతో నా కొంప కట్టుకునేటప్పుడు ఆదినుసు కనపడ్డ ప్రతీచోట్నుంచీ, ప్రతీకొంపదీ అయినకాడికి కట్టలుకట్టి వేసేసుకు రావడమేకాని, అల్లా చెయ్యడంవల్ల ఎవడి కొంప కూల్తోందో, ఎవడి పొట్ట పెల్లగిలుతోందో, ఎవడి జీవం సన్నగిలుతోందో అంటూ చికాకుపడను. ఒక్క మానవజాతికి మాత్రమే భగవంతుడు కటాక్షించిన మాటలే వృత్తిగా పెట్టుకుని నేను మిక్కిలి తమాషాగా శ్రమపడి, రచనలూ, కల్పనలూ, అమరకాలూ, ఎగుమతులూ గుటికాలంలో చేసుకుంటూ, అవి నా పేరు మీదుగా మానవజాతికి దాఖలు చేసుకుంటూ, అందులో ఉండే సృష్టిప్రజ్ఞా, ప్రకటనసామర్థ్యమూ నావేగాని అన్యులవి కావని జనం తమ పనితొందరలో గమనించక పోతారేమో అనే భయంచొప్పున నేనే ఢంకామీద కొట్టి చెప్పుకుంటూ, మన కెందుకని చెప్పేసిచిక్కు సమయాల్లో ఊరుకుంటూ ఉంటూంటే,

నాపనికి నన్ను అధమం ఊరేగించడం లేదు ఏమీ లేదు సరిగదా, నే నేదో అపహరణం చేసినట్టు కొందరుకొందరు నాయెడలే ఎందుకు ఈర్ష్య కక్కుతున్నారో నాకు ఆశ్చర్యం వేస్తుంది! నా మాటలు నేను నా స్వంతచేత్తో ఖాసీరాతో వరసాగ్గా రాసినవి నాహృదయంలోవి కావుట! నాహృదయం వీళ్లు చూశారూ? హృదయం అనేది మిథ్య అని నా నమ్మకం. పైగా, నామాట ఎంగిలిమాటలుట! అసలు ఏదేనా నాదం బాగా ఎంగిలి అయినతరవాతేగా 'మాట' అయి జనించడం! ఎంగిలిలోంచి పుట్టింది మళ్లీ ఎంగిలి అవడం ఏమిటి? అదీకాక, మనిషి విలవనిబట్టి మాటవిలవ ఉంటుందిట! వాళ్ల మొహం! మాటకి విలవ స్థిరమే అని నే నంటాను, దాంతో వాళ్ల ఆట కట్టూ! బతుకుతెరువూ, త్వరగా పని తెముల్చడం, తేలికపనిమీద ప్రేమా, మార్గం ఏదయితేం పని జరపడం లేని ఘటాలతో పడడం కష్టం!

ఎందరికోసమని చెంగ పెట్టగోనూ! ఒకడైతే అనుకోవచ్చు! అబ్బబ్బ! మనస్సు చిట్టంకట్టిపోతోంది. ప్రతీవాడూ నాపదసృష్టిగురించి అనుమానించడమే! తలకిమాసిన ప్రతీవాడూ ఎవరూ లేనట్టు నా దగ్గిరికే వచ్చి తెగవాపోతూండడం! ఏమనీ: తనకి లోపల ఏదో పెద్ద ప్రజ్ఞ ఉందట, ఆ ప్రత్యేక ప్రజ్ఞతో తను ఏదో మాటలపచ్చిపులుసు చేశాట్ట! ఆ ప్రజ్ఞకి తగ్గ రాణింపు లేదుట! ఆ ప్రజ్ఞని గుర్తించడానికి దేశానికి తెలివి లేదుట! పైగా ఆ ప్రజ్ఞని అడ్డమైన వాడూ (ధ్వని నిస్సందేహంగా నన్నుగురించే!) అందినంతవరకు అవుపోసనంపట్టి వాడేసుగోడంట! ఇదీ సొద! ఈసొదంతా నిజమే అయితే జనం అంతా ఘొల్లుమనవలిసిందే! కాని, నే నొక్కణ్ణీ ఇప్పణ్ణించీ ఎంచెయ్యనూ! వాగ్రంథసృష్టిలో విపరీతమైన నేర్పరితనం ఉన్నమాట రూఢీ! నేనే చెబుతాను, భయమా! అది నేనే ఆర్జించుకున్నాను. కొన్నికొన్ని బైరాగీ చట్కాలూ, నేపాళమాత్రలూ, గోటిమీటులూ, అడ్డగీటులూ, ఉత్తరిపులూ, కత్తిరింపులూ ఏవేవో కష్టించి అలవాటుచేసుకుని వాటిఖీసుకించిన కళోపాసనలో ఉన్నాను. అతిరహస్యమైన క్రమశిక్షవల్ల వాటిని నేను అభివృద్ధిలోకికూడా తెచ్చుకున్నాను. ఈ వృత్తిలో పైకి రావడానికి ఇంకాకొందరు పాకులాడేవాళ్లు ఉన్నా, వాళ్లకి నా ఉపాయాలరకంవి పుట్టవు, పట్టవు, కిట్టవు, తెలియవు, ఎక్కవు, నప్పవు అని మధ్యవర్తులు అనేశారు. ఇక, నావిషయంలో ఇటువంటి ఉపాయాలు వంటింటికుంకుళ్లలాగ మన్నికపడి, కామధేనువుల్లాగ కురిసి, కల్పవృక్షాల్లాగ ఫలించి, తామరతంపరగా పాకి, తేగలపాతరలా ఊరి, ఏకోత్తరవృద్ధిగా విజృంభించిపోతాయి. అయినా చెప్పుకుంటే బనాయి అంటూ నిన్ని, నన్ను ధిక్కరించేవాళ్లు నామతంలో బయల్దేరుతారేమో అనే భయంవల్లనున్నా నేను చెప్పను. పుణ్యమా పురుషార్థమా, ఎందుకొచ్చిందయ్యా నీ కీమాటలపరిశ్రమా అని ఎవరేనా అనగల్రు! అవును! నాకు కాలం కలిసిరాదు, సౌమ్యదళులుపడకు, ప్రతిష్ఠ దక్కదు, పలుకుబడి హెచ్చదు, జనవశ్యం చేకూరదు—కాని ఎటొచ్చీ హస్తాంతుళ్యధరణానికి తాత్కాలికంగా పేరుకి కొంచెం ప్రచారలాభంమాత్రం ఉంటుంది. ఆపేరు కాస్తా నాపేరే అయితే తీరిపోతుం దని నాయత్నం. ఈస్వల్పలాభం నిమిత్తం నేను వీలైనంత తక్కువపరిశ్రమమాత్రమే పడాలి అని చెప్పినవాడు మనిషా, కడెంవాడా! స్వల్పమైనాసరే లాభం అనేది స్వలాభం అయేటట్టు చూసుగోకుండా ఎవడేనా ఏమన్నా చేస్తున్నాడా? నేనుమాత్రం ఎందుకు చెయ్యాలి అంటా! మాటకారివృత్తిలో నేను నేర్చిన మహావిద్యలు నేను ఎందుకు వదులుకోవాలి అంటా! ఇంతమంది వాజమ్మలు ఉంటూంటే నేనా వెనకయ్యలాంటి జనానికి కనబడ్డాను మెత్తమెత్తగా! నాశబ్దగాత్రలో నాపుంత నేను తొక్కకుండా మానుకోవలిసిఉంటుందీ అని నాతో చెప్పడానికి తాఖతు ఉన్న వ్యక్తి ఎవడు? లేక ఎవతె? లేక ఏది?—దేవుడా? అదృశ్యుడు గనక ఎక్స్పార్టీ! జనమా? నన్ను మినహాయించి అసలైన జను డేడీ! రాజులా? వాళ్లకి దేనా కావలసిన గోమ! తంత్రులా? దిగ్గజాలయినేం నాబోటి పుత్రులుంటే వాళ్లకి సింహస్వప్నంగా! పెద్దలా? అష్ఖలితమూర్ఖులై పోయి సిద్ధంగా ఉన్నారే! అధికారమా? ఓవ్యక్తి

కోసం ఏడుస్తూ కూచోగలదా! సంఘమా? వెర్రితలలు వేసిన వేపచెట్టాయిది! మతమా? పరిశోధనచేస్తే మనిషి కోమతంగా! సిగ్గా? అది మానవలక్షణం అని నేను అనుకోను! పాపమా? అది నిర్వచనం అయి యేడిసిందా, ఉన్న నిర్వచనం ఏదేనా నాఒప్పుదల లేందే చెల్లుతుందా!!! అందులో అంతో యింతో ఆస్కారం కలవాళ్లుకూడా పచ్చగడ్డి రుచికరమే అని నొక్కి చెప్పేటప్పుడు ఎండుగడ్డియొక్క రుచిభేదం నేను కనిపెట్టడమా నా ద్రోహం! నేకనపరిచే పదసృష్టి చాతుర్యాన్ని నేరం అనడానికి ఎవడికేనా సరే అన్నంతిన్నే నోరెట్లా వస్తుందో నాకు బోధపడదు. అన్నీ అల్లా ఉంచండి. ఇవేం మామూలు రోజులా? స్వాతంత్ర్యం వాల్లాడిపోతూండే రోజులుగదా! నా స్వాతంత్ర్యం నాది! నేను నెగ్గితీరతాను, ఎల్లా నెగ్గితేం?

వారం పదిరోజులైంది. కలంధాటి వెనకయ్య నాదగ్గిరికొచ్చి కాకిగోల! తన అపూర్వకవిట, తన స్వతంత్రకవిట, తన రచన పూర్వంనించీ అచ్చులో ఉందిట, తన బుర్రకాయయొక్క లక్షణాలుమాత్రమే ఆ రచనలోంచి తొంగిచూస్తూ ఉంటాయిట, ఆ రచనలో మాటలన్నీ తన స్వంత తాతయ్యగారి మాటట! తన కష్టార్జితం, స్వార్జితం, నేను తనతో చెప్పకుండా, తంది అని కూడా అనకుండా దోచుకుని (అనే మాట నాచెవిని పడగానే వెనకయ్య ఎడంచరణ మీద నగిషీపని కనపరిచేశాను) — తస్కరించి, కొల్లగొట్టి, మార్చి, పిరాయించి, పచ్చడిచేసి, ధ్వంసంచేసి, పరిశ్రమ నాదే అని జనం దగాపడిపోయి నమ్మగలందులకు నేను పన్లు చేశాంట! ఉనూరు మనడం మొదలెట్టాడు. నాకు ఒళ్లు భగ్గుమనిపోయింది. నేను అసలు దేవాంతక నరాంతకుణ్ణి! వెనక నేను రెండు రోజుల్లో ఒకనాటకం చేసి మర్నాటికి అచ్చువేసేసరికి ఓర్వలేక ఓ బకుర్ధాయి నన్ను విమర్శిస్తూ, అందులో పాత్రలైన దేవుళ్లనీ, మనుష్యుల్నికూడా నేను కూనీ చేశానని తెగరాసి నన్ను తిడుతూన్నట్టు సంతోషించుకుంటూ నా దేవాంతకత్వ నరాంతకత్వాలు ఖాయపరిచి పరిష్కరించిపెట్టాడు. నేను విమర్శాతీతుణ్ణి! నాపరోక్షంలో జనం నన్ను ఏమని చెప్పుకుంటారో కదా అనే జంకు నాకు ఆదినించీ లేదు. ఎవడేనా నన్ను తిట్టినా, తిట్లు గాలిగనకనున్నా, తిట్లన్నీ గాలికి పోయేవి గనకనున్నా, గాలిగాళ్లు బుసులు కాజాలక పోవడంచేతనున్నా అవన్నీ నేను మరిచి పోగల్ను. ఉమ్మేస్తే తుడిచేసుకుని, వాళ్లే దువ్వేసి పడగొట్టగల్ను. కాని, పాలోమని నా మీద పడి తోడుతూ రాగాలు పెడుతూంటే నేను కరుకుగా ఉండలేను. అప్పుడు నేను వెనకయ్యని చూసి, జోరు తగ్గి, జాలి అభినయించి, కళ్లకి కర్పూరం రాసుకుని, వాడి కడుపుబ్బకి నిర్ఘాంతపడి, వాణ్ణి ఈ రీతిగా మందలించాను:

“ఒరీ! అనద్యతన ధూతికవీ! వెనకయ్యా! నీ సిగ్గోయ్యా! నీ వెనకాలకూడా కవులు ఉండేవారోయ్! నువ్వే ఈ శరీరంలో వెనక ఉండి ఉండవు గనక, అపూర్వుడవే! స్వంతానికి ఎన్నో తంత్రాలు పన్ని పదరచన చేశావు గనక స్వ–తంత్రుడవే! నీకు అనర్హమైన గౌరవం, సుప్రసిద్ధకవులతో నామ సమన్వయం సంక్రమిస్తాయని విచారించి నీ వెనకటి డొంకలు కదపకుండా ఇప్పుడు ఆగుతాను. లేకపోతే నువ్వు ఆగుతావా? నిన్ను కవి అనడానికి మరోరికియ్య తరుణం! నీకు నువ్వే అల్లా అనుకోగలిగితే, నేను అయిదారుగురికి కన్నుగీటేసరికి నన్ను ఇల్లా ఎత్తేస్తారే ఆకాశందాకా! నేనుమాత్రం తక్కువ తిన్నానా? నీకు ఉందని నువ్వు భ్రమించే బోడి బొప్పాయికవితాప్రజ్ఞే కాకుండా నీదగ్గిర కలికంలోకికూడా దొరకని సంగ్రహింపునేర్పరితనం ఉందే నాదగ్గిరా! దాన్ని చూసి నువ్వు ఇంత ఏడుపెందుకురా, నీ ఏడుపు టాకీతియ్యా! మాటలు ఏరుకుతిని జీవించే మా సత్కులంలో కొందరు తప్పపుట్టడంవల్ల నాకు తలవంపులు అయిపోతున్నాయి. వాళ్లు నాకుమల్లేనే మొదట్లో మాటల అమరకంలో నేర్పు చూపించినా బెదిరించేసరికి కాళ్లమీద పడడం, క్షమాపణ కోరుకోడం, అజ్ఞానం దాఖలుచేసుకోడంలాంటి ఆడారిపన్లు చేస్తున్నారు. వాళ్లు భయస్థులు. ధనాపహరణానికే దిక్కులేకపోతే, ప్రాణాపహరణానికే అనుపాజ్ఞ లేకపోతే, వస్త్రాపహరణానికే

టికాణా లేకపోతే, ఇక పదాపహరణానికో చిక్కిస్తా! ఇంతమాత్రానికి భూమిని కంపించమన్నావా, లోకచుక్కని లోక ఝూడించమన్నావా! ఛీ! పో! నేను తెగేసి చెబుతున్నాను. జాగర్తగా విను. విని నీదిక్కున్నచోట చెప్పుకో! నాకు నువ్వు పుట్టించావనుకుంటూన్న మాటలభయంగాని, నిన్ను పుట్టించిన బ్రహ్మభయంగాని లేదు. ఎవడు చూడొచ్చాడు పోదూ అని కాదు నేను ఈనేర్పుతో నా కొత్త మాటలపోగు చేసింది! ఎవడు చూసి ఏంచెయ్యగలడో చూస్తాను రమ్మను అనే ధైర్యంతో! నీ పుస్తకట్ల రచనని నేను తెలిసే వాడుకున్నానోయ్, అచ్చుపడ్డంతోటే చచ్చిపోయిన కవరయ్యా! ఇంకోరి రచన మందే అని చెప్పకుని సత్కరించడంఅంత నిశ్చింత పనీ, తేలికపనీ, గొప్పపనీ, ఖర్చులేనిపనీ ఏదీ లేదోయ్! అప్రయోజకుడా! నిన్నెంతో మెచ్చి నిన్ను మిక్కిలి "సత్క"రించడంకోసం నేను దాన్ని ఎత్తుకుంటే, అక్షరజ్ఞానం తడబడే ఘటాలు ఆపనిని "తస్క"రించడం అంటున్నారు! వాళ్ల మాటలు మరికాసిని వింటే నువ్వు ఏడవడానికికూడా పనికిరావు. ఒరేయ్! ఆను. అన్నట్టు నాయిష్టం! నారాజ్యం! నువ్వెవడవ్ నాకు ద్రోహం కట్టడానికి! నువ్వు ఏడిచినంతమాత్రాన్ని నాది నేరం అవుతుందా? నా పని నేరం అని మనలో నూటికి తొంభైమంది నువ్వు చెప్పినా గ్రహించుకోలేరుగా! ఇక తక్కిన పదిమందిలోనూ తెలిసేవాళ్లుంటే వాళ్లకి నన్ను శిక్షించే మార్గం లేదుగా! అదీ, అధికారమూ కూడా ఉన్నవాళ్లకి నాకొంచెం మోర వినపడ్డంత ఖంగున గుండెదురుకుకు వినిపించకపోవచ్చుగా! కవికి సొమ్ము అందదు, అంకదు, అబ్బదు, ఆగదు గనక వాడి ఐశ్వర్యం అంతా వాడి రచన. అది మాటవ్యాపారం. మాటలు ఎదురుగుండా పెట్టినప్పుడు అవి నోటిమాటలో, గుండెమాటలో, ఎవడినోరో తేల్చడం దుర్ఘటం. అందుకని అన్యపదరచన లగాయించి నాదే అనడంఅంత బ్రహ్మవిద్య అదేగాని రెండోది లేదని నువ్వు బొత్తిగా గ్రహించినట్టు కనపడవే! ఓరి చవటా! ఇప్పుడేనా నీకు మతిగాని, ఇంగితజ్ఞానంగాని, నేర్పుగాని, బతుకుతెరువుగాని ఉంటే నీరచన నేను చెపాయించేసి వాపరం చేసుకున్నానని నువ్వు మొత్తుకునేకంటె నానవ్యరచన గడుసుదనంగా మళ్లీ నువ్వు నొట్టో వేసుకుని, దాన్ని నవ్యతరం చేసి, అది నీదే అని చెప్పుకో! నే వద్దన్నానా! కావలిస్తే నీళ్లు పట్రా, ధారపోసేస్తాను! ప్రచురణవల్ల నీకలాభం ఏమిటీ అంటే, పేరు అచ్చులోకి ఎక్కడం, ఆ పేరుకి కించిత్ ప్రచారం, తద్వారా ముందుముందు, అనగా శీలైవంతవరకు వ్యక్తి మరణించేలోపల అసలైన పెద్దలాభం ఉండవచ్చుననే ఆశ—అంతమాత్రానికి అంతస్వల్పానికి నేను నా గొప్ప బుర్ర వ్యయంచేస్తానా? అది కాస్తా ఆర్జించుకోడానికి నేను చెమట ఓడుస్తానా? మరి ఏంచేస్తానూ? లీలగా యత్నించి జోరుగా కొట్టేస్తాను. అన్నీ మార్గాలే! ఇదిగో సాంపిల్ డోసు! బాసుపడు!—

పరికొత్త అన్యభాషాగ్రంథం ఇంకా నావాళ్లెవరూ కొనిఉండరు గనకనున్నా, మిక్కిలిపాత అన్యభాషాగ్రంథం చాలామంది పారేసుకుని ఉంటారు గనకనున్నా అటువంటిది నాభాషలోకి ముక్కకి ముక్క దింపేసి ఆరచన నాస్వంతం అనేస్తాను. దాంతో జనం, ఆరచనలో ఉండే గొప్పతనానికంతకీ మూలకారణం నాబుర్రలో ఉండే గుంజే అనిన్నీ, అదే తమరు తింటూంటూ అనిన్నీ భ్రమించి నానామస్మరణ చేసుకుంటారు. అల్లాగే పాతరచనలు తెచ్చి నాటిల్లో నామవాచకాలూ, పాత్రల పేర్లూ, స్థలాల పేర్లూ, సంస్థల పేర్లూ మార్చేసి తాజాగా రచన తయారుచేసి అది నాపేరట ప్రచురిస్తాను. కొందరు అసమర్థులు ఇల్లాంటి మార్పులు చెయ్యడంలో కొన్నికొన్ని దోషాలుచెయ్యడంవల్ల పట్టుబడిపోతారు కాని, నేను ఆరితేరినవాణ్ణిగనక నాకు లెక్కలేదు. లేకపోతే, పాతరచన పట్టుకుని దాని రూపం మార్చేసి కొత్తస్వరూపం నాస్వంతం అంటాను. పద్యాన్ని గద్యంకింద ముక్కలుకొడతాను, గద్యాన్ని గుండకొట్టి పద్యం చేస్తాను. పురాణప్రబంధశతకాలలోంచి ఏమి ఎప్పుడు ఎంతవరకు ఏరకం ఏరూపంలో కావలిస్తే అట్లా పుచ్చుకుని అది నాదే అని, నన్నొచ్చి అడిగేటంత నీచపుపని పండితులు చెయ్యరుగనక పామరుల్ని

పాడులగొడతాను. నాటకాలూ వాళ్లవంటివీ అన్నీ సంభాషణమాటలేగనక అవి వీథులలోనూ, బజార్లోనూ పడిదొర్లే జాతిగనక మెడమీద తలఉండి, నాకి సరిగ్గా ఉన్న ప్రతీవాడూ అవి పోసుచెయ్యడానికి అర్హుడే గనక, వాళ్లల్లో నేను మొదటివాణ్ణంటాను. నవలని పట్టుకుని కథచేసి, కథని పట్టుకుని నవలగా విస్తరించి స్వంతం చేసుకోడానికి నేను వ్యవహరిస్తానుగనక నాకు ధక్కా లేదు. కథలన్నీ ముసలమ్మలచేత ఉత్పత్తి చెయ్యబడేవిగనక నేనూ మా ముసలమ్మచేత వడికించాను, అది నాదే అనచ్చు, కాని ఆగమ, లోప, ఆదేశ, సంగ్రహణ, విస్తరణాలు పరివర్తనకి మూలసాధనాలు గనక, యాథార్థ్యం దాచడానికి వాటిని ఉచితంగా, అతికాకుండా వాడాలి. ఒక్కొక్కప్పుడు నేను మరీ తొందరలో మరీ జోరుగా రచించేటప్పుడు, ఎవడిదో నీలోటి పాతచచ్చినాడి చవట పద్యం ఎక్కించేసుకోవలసిన అవసరం నాకొస్తుంది. అంతతొందరలోనూకూడా కొత్త పేలు మాసుకుని మార్పు చెయ్యగల్నేమో చూస్తాను. కందం పట్టుకుని గీతమాలికం వచ్చేలాగు చెక్కేస్తాను. చంపకమాల ఉంటే చంపేమాల చేస్తాను. శార్దూలానికి మసిపూసి భల్లూకంగా మారుస్తాను. పాతపద్యాల్లో ఉండే సమాసాలకి పట్టకార్లు పట్టించి, రబ్బరుబనియన్నిగనక తిరగా బోర్లా తిప్పినట్టు తిరగేసి ఆ కొత్తసమాసం నాదే అంటాను. అంతమాత్రం టైమ్ లేనప్పుడు, పాతరచన వెతికి, అది నామనస్సుకి మిక్కిలి ఆనందం కలిగించి నేనుమట్టుకి ఇది ఎందుకు రచించలేనూ, నేను రచించుదాం అని అనుకుంటూంటే నేనే నాకంటె ముందు వీడెవడో రచించి ఇంట్లో దాచుకోక అచ్చుకూడా కొట్టాడే అనికూడా నాకు తోస్తే, ఆరచనని అక్షరాలా లాగేసి నాదే అని ప్రచారంనిమిత్తం పంపుతాను. నీదయవల్ల పత్రికలు బహుళం అయింతరవాత రచనాప్రచారానికి ఇరకాటం తగ్గింది. పత్రికాధిపతుల్ని, వాళ్లకుండే తొందరలో, దగాచెయ్యడం నిమిషం. ఎంచేతంటే తగాదావచ్చేవరకూ పత్రికాధిపతికి నేను నాదే అని పంపిన రచన నాదవునో కాదో, తెలియడానికి బోలెడుండాలి గనక, తెలియదు. పాత రచయిత బతికుండి పేచీగనక పెడితే క్షమాపణలు కోరుకోడానికి పత్రికాధిపతులకి నేను మహోత్తరులు కలగచేస్తూంటానుగనక నేను వాళ్ల పైవాణ్ణి! అదీకాక శవాకారాల్లాగ ఉన్న పాతరచనలు కొన్నిటిని పాతరలోంచి పెల్లగించి అవి నాపేరట అచ్చుకొట్టే సరికి, బహుశ నా నామధేయ సాంగత్యంవల్ల వాటికి ప్రాణప్రతిష్ఠ అయి, వాటిని జనం జుర్రుకోడం మొదలెడితే వచ్చే పుణ్యంలో పోనీ ఆ చచ్చినాడికికూడా ఓ అణావాటా ఇయ్యొచ్చును. ఇంకా, ఎరుగున్న పాతరచనయొక్క పేరుగాని, రచయితయొక్క ఇంటిపేరు అసలు పేర్లుగాని దొరకపుచ్చుకుని వాటిలో భాగాలు ఉంచడంగాని, దించడంగాని, కుదించడంగాని, పెంచడంగాని, నాకు అనుకూలించి నారచన తంతుతీర్థం అయేలాగు కనిపిస్తే అల్లా చేసేసి కావలిసుంటే నేను తరవాత మాట్లాడతాను. ఒకప్పుడు నా పేరునే పరివర్తనం చెయ్యడం వల్ల అది భరతఖండంలో ఇతరభాషల్లో గొప్పవాళ్ల పేర్లల్లో దేనిలాగేనా పలుకుతుందీ అంటే, అల్లా చేసేసి నారచనకి విలవ తేవట్టేస్తాను. ఎవడేనా గనక నన్ను తన స్నేహితుడుగా ఎంచితే, వాడు అప్పట్లో ఏంరచన చెయ్యదల్చుకున్నాడో చాన్లే అడిగి తెలుసుకుని, వాడి రచన పూర్తి అయి ఇంకా ప్రచారం కాకుండానే నేనే అవే సంగతులలో వేడివేడి సరుకు పాకంపట్టి ముందుగానే ప్రచురిస్తాను. వాడు గింజుకున్నా నన్ను చేసేది ఏమీలేదు. ఎవడేనా తన వ్రాతప్రతి నన్ను చూడమనిగాని, నే చూస్తాను నాకు ఓ మాటు ఇయ్యి అని నేను అడిగినప్పుడుగాని, ఇచ్చాడా, చచ్చాడే! ఇహ వాడి రాత అంతే అనుకో! నేను అసలుకి ఫొటో తీసేసుకుని, అసలు వెనక్కి పంపించేస్తూ, "ఇది బాగులేదు, నిజం చెప్పాలంటే చాలా ఏడిసినట్టుంది, దీన్ని పొయ్యిలో దహనం చెయ్యి! నీకు వంట్లో సరిగ్గా లేకపోతే పోనీ సహగమనం వద్దులే! ప్రపంచానికి అల్లా చెయ్యకపోతే నష్టం" అని వాడికి సలహా ఇస్తాను. మరీ వీల్లేకపోస్తే వ్రాతప్రతి నేనే ఉంచేసుకుంటాను. ఉంచేసుకుని, నా వ్రాతప్రతి ఒకటి ఉండాలనిన్నీ, నాకు ఎవడైతే అసలు ఇచ్చాడో వాడికే నేను లోగడ నాది ఇచ్చిఉన్నట్టు జ్ఞాపకం

అనిన్నీ, అది నాకు వాడు తక్షణం పంపకపోతే వాడి మీద నేను చర్య జరుపుతాననిన్నీ కబురుపంపిస్తాను. దాంతోటి వాడూ ఆస్తి నాస్తి అవడమేకాకుండా ఋణసంబంధంకూడా ఏర్పడి నోరుమూసుకుని కాళ్ల బేరానికొస్తే అపరాధం పుచ్చుకుని వదిలిపెడతాను. తూష్ణీరాతల్ని పడమరకి గోకేసి విరుద్ధంగా తయారు చేసి నా వసేస్తాను; ఉత్తరాదిరచనల్ని దాక్షిణ్యంతో లాగేసి నాసొమ్ము చేస్తాను. నేను అసాధ్యుణ్ణోయ్, వెంకయ్యా! నువ్వు కాదాయిరంటే ఇంకా ఖరాగా కూడుని రకరకాలుగా ఏడవాలిగాని ఏం జెయ్య గలవ్? నీవకంటోయ్, నాధరిమేనారావడం, నా క్రియని శంకించడం, నన్ను కాదనడం, నాకృతి అన్యుడి దనడం, అందులో ద్రోహం ఉందనడం ఋజువు...నీబొంద! ... నీతరమా! పైగా, నీనత్తగుల్ల బుర్రకే ఏదో అఖండభావం తోచిందని ఎగురుతున్నావే, నా అంతేవాసికి, నీకే తోచగలిగిన దిక్కుమాలిన కమ్మర్తి అవకతవక బుద్ధిహీనపు ముక్కలు సరిగ్గా ఎందుకు తోచిఉండి ఉండకూడదమా అంటా! ఇల్లాంటి వెర్రిమాట ఇప్పుడంటే పైకి అన్నావ్ గాని, ఇహ నెప్పకా అని చివాట్లు తినకు. ఈమాటతో నీమీద నాకుండే గౌరవం అంతా పోయింది.

అయితేం, నీకు సలహాచెప్పేవాళ్లు లేక పాడయి నావు. నాకు తప్పగుండా, మరి, ఇట్లాంటి సాక్షి! చెబుతా, విను! ఓకీ ఎంగిలిపెద్దన్నా! తెలుగు రాజ భావ.కాదు! మహాధికార్లకి ఇది తెలియదు, రాదు. వచ్చినా రాదంటారు, రాదంటేగాని నువ్వూ గౌరవించవు. నువ్వు గతించినతరవాత నీ కిది జ్ఞాపకం ఉంటే (—నాకు జ్ఞాపకంలేదు పొమ్మనేస్తాను!), దేవుడుతో (—దేవుడంటూ ఉంటే!) చెప్పకుందు గాని లే అమ్మా! ఊరుకో! నీకింత అభిమానంగవక, నాయనోయ్, చూడూ! రచన ప్రచురించడం మానెయ్! నాయెదట ఒట్టెట్టుగో, చూస్తానూ! మానేసి మరోపని చూసుగో! ఒకవేళ ఉండబట్టలేక, అభ్యాసం అయిపోయి, మాటపాకం ఎదేనా చేసే శావా, అది పదిలంగా బుట్టలో పెట్టి అట్టేపెట్టుకుని, నిర్జనప్రదేశంలోకి వెళ్లి, భూమిమీద నువ్వు నుంచో దల్చుకుంటే భూమిని తప్ప కడమభూతాల్ని అక్కణ్ణించి పొగనంపి, నీరచన పైకితీసి నువ్వే గబగబా కంటితో చూసుకుని, నీఅపూర్వత్వానికి నువ్వే మానసికంగా యోగ్యతాపత్రం ఇచ్చుకో! ఇంత నన్ను విసిగెత్తించావ్ గనక మరి దయచెయ్! శీఘ్రంగా! నేను నీకు నిజంగాకూడా ఏదో ద్రోహం చేశానుగావునని జనం అనుకోగల్రు! నడు!"

అని వెంకయ్యని పరామర్శించి, కర్ర తెచ్చి వాడి వీపుయొక్క నిలువు అడ్డం ఐమూలకొలతలు పిస లుగా కొలిచి, అతని తిక్క వదిలిందని అనిపించి, నోరు మూసుకునేటట్టు చేసి, అతణ్ణి వడివడిగా పొలిమేరదాకా దాటించేసి వచ్చి సచేలస్నానం చేసు కున్నాను! ఎల్లా వచ్చిందో!





[ సీరియల్ నాటకము ]

# ★ రాజరాజు ★



శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

## నాలుగో రంగం

జక్కులదీవి రాజోద్యానంలో, ప్రకాశమాన మైన నీరెండ వృక్షాగ్రాలకు బంగరుపూత పూస్తోంది.

ప్రతీలతా, ప్రతీపొదా, ప్రతీచెట్టూ ఆకు రాల్చి చిగిరిస్తూ కొన్నీ, చక్కగా చిగిరించి కొన్నీ, మొగ్గతొడిగి కొన్నీ, విరగపూసి కొన్నీ యెంతో ముచ్చటగా వున్నాయి.

విశాల మైన కొలనిలో, అసంఖ్యా లయిన యెర్రకలవపూల మధ్యనూ, తెల్ల తామరపూల మధ్యనూ అయిదారు రాజహంసలు విలాసంగా విహరిస్తున్నాయి.

ఉత్తరపుగట్టున తెల్లని నెమిలి పురివిప్పి నాట్యం చేస్తోంది.

దక్షిణపుగట్టున, పాతికముప్ఫయి పావురాలు, గుసురుతూ, దుముకుతూ, సబాళిస్తున్నాయి.

ఎడటిగట్టున వొక లేడిపిల్ల, పడుకుని నెమరు వేస్తూ వున్న తల్లి మొగంమీద వొకమాటు మొగం పెడుతూ, వొకమాటు అటూ యిటూ చెంగు చెంగున దూకుతూ, మరోమాటు తల్లి పొదుగులో మూతి పెడుతూ ఆడుకుంటోంది.

కొంచెం దూరాన, ఏదో చెట్టుకొమ్మల్లో నక్కివుండి గండుకోయిల స్వరకల్పన చేస్తోంది.

మన్మథుడు చాటున వుండి రతీదేవికి వింజామర వేస్తున్నట్టు పిల్లగాలి తెరలు తెరలుగా వీస్తోంది.

సంపంగిపువ్వుల పరిమళమూ, పొగడపువ్వుల సువాసనా, గులాబీపువ్వుల సౌరభంతో మిళితం అయి మత్తెక్కిస్తోంది.

ఇలాంటి సమయంలో, యిలాంటిచోట, కొలనిపడమటి గట్టున, అశోకవృక్షం కింద, చిత్రాంగి వుయ్యాలాలో కూచుని వుంది. వెనక నుంచుని ఆమె దాది అయిన చిలక మెల్లిగా వుయ్యాలా వూపుతోంది.

పక్కనే వున్న పాలరాతిస్నెమీద కూచుని, రుక్క అనే చెలికత్తె, అరవిచ్చిన గులాబీమొగ్గలూ, చెట్టుసంపంగిపువ్వులూ మధ్యమధ్య చేరుస్తూ బొడ్డుమల్లె మొగ్గలు దండ గుచ్చుతోంది.

ముగ్గురూ కులాసాగా కభుర్లు చెప్పుకుంటున్నారు.

***

చిలక—అమ్మాయి విడిచిన అర్ధచంద్ర బాణంవల్ల ముందరికా లొకటి యెగిరి

పోయింది. రెండో కాలు సగం తెగి, పులి, కుప్పగా కూలిపోయింది. తరవాత సారంగ ధరులవారి బాణం వచ్చి, గుండెల్లో గుచ్చుకుని ప్రాణాలు తీసింది.

రుక్కు—బాగానే జరిగింది. అయితే, మెకం యెవరి దైనట్టూ ?

చిత్రాంగి— ఎవరి దయినట్టా? అదేం ప్రశ్న చిలకా? (రుక్కుతో) ఇంత స్పష్టమైన విషయంలో కూడా నీకు సందేహం యెలా కలిగిందే ?

చిలక — లోకంలో యిలాంటివాళ్లే యెక్కువ. వాళ్లకి బుద్ధి తక్కువగా వుండదు; కాని నైశిత్యం లేక అది మొద్దుబారి వుంటుంది. వాళ్లేసంగతి స్వయంగా బోధపరుచుకోలేరు. అయితే, యెవరేనా వివరించి చెబితే మాత్రం "వో—హో, అదా ?" అంటూ తల లెగరవేసుకుంటారు. పైపెచ్చు, అంతూ పంతూ లేకుండా విశేషార్థాలు కూడా తీస్తారు.

చిత్రాంగి— బాగా చెప్పావు. వాళ్లలో కొందరు తెలిసివుండిన్నీ అక్రమవాదానికి పూనుకుంటారు. ఆవేళ సుబుద్ధి అయ్యవారిని చూశావు కాదూ, యెంత గడుసు రాకడ వచ్చారోనూ ?

చిలక—అవునవును. అబ్బో! తమ ధర్మశాస్త్ర పాండిత్యం అంతా వొలికించేశారు అయ్యవారు.

రుక్కు—నాకు బుద్ధివుందన్నా సంతోషమే, లేదన్నా సంతోషమే కాని వారే మన్నారేమిటి ?

చిత్రాంగి—ఏమన్నారా ? ఏమన్నా అనగలరు వారు, ఒకటేమిటి ?

చిలక — సారంగధరులవారే పులిని కొట్టారుట. అంచేత అది వారిదేట.

రుక్కు—కాదనడం యెలాగా ?

చిలక—ఇది బాగుంది. కొన్నాళ్లు సుబుద్ధి అయ్యవారి శుశ్రూష చేస్తే నువ్వింకా బుద్ధిమంతురాలి వవుతావు. తప్పకుండా అలా చెయ్యి.

చిత్రాంగి — ( చప్పట్లు కొడుతూ ) సెబాస్ ! సెబాస్ ! మహాబాగా చెప్పావు నువ్వు.

రుక్కు—ఏమమ్మా? నే నన్నదాల్లో తప్పేం వుందీ ?

చిత్రాంగి— అందులో యేమన్నా వుంటే అదంతా తప్పే.

రుక్కు—ఎలాగమ్మా ?

చిలక—ఎలాగా? పులి కదలలేని స్థితిలో వుండడంవల్ల వారు సులువుగా, వొక్క బాణంతో—(అర్ధోక్తి)

రుక్కు— అయితే, బరిమీద ఉండగా వారు పులిని కొట్టలే రంటావా ?

చిలక—ఒక్క బాణంతో కూలగొట్టిన అమ్మాయి మరోబాణంతో దాన్ని చంప లేకపోదు రంటావా ?

చిత్రాంగి—ఒక్క క్షణం దాటిపోయింది కాని లేకపోతే నేను కలియబడే కటారితో దాని గుండెలు తీసివుందును.

చిలక—అవునవును. అదీ నిజమే. సామర్థ్యాని! సాయం సాహసంకూడా వుంటే అదేమంత ఘనకార్యం ?

చిత్రాంగి—సామర్థ్యం అంటూ వుంటే, అలాంటప్పుడు, దానికి దే పుడుతుంది కూడానూ సాహసం.

చిలక—పుట్టకేం? పైగా, వొకవైపున బాబయ్యా, మరొకవైపున నేనూ ధనుస్సులు యెక్కుపెట్టుకుని వుండిన్నీ, అమ్మాయే పూర్తిచేస్తా రని వూరుకున్నాము. ఇంతకీ: సారంగధరులవారేనా, తమ దారిని తాము వచ్చివున్నారు కనక, పడిపోయిన్నీ ఘూర్ణిల్లుతూ వుండిన పులి కనపడడంతోటే, యోధసామాన్యమైన వుత్సాహంతో బాణం విడిచారేమో గాని, జరిగింది తెలుసుకుని వుంటే వా రాపని చేయకుండానే వుందురు.

చిత్రాంగి—తరవాతేనా తమ ప్రభువు అనుగ్రహం సంపాదించుకోడానికి సుబుద్ధి అయ్యవారే పేచీకి సిద్ధపడ్డారు గాని యిదంతా గమనించి వా రూరుకునేవున్నారు కాదుటే?

చిలక — కాకపోతే, "పులి తమదే అని తమ నిశ్చయం అయితే, మేము వెళ్లిపోతాం, తమరే పులిని పట్టించుకువెళ్లండి" అని బాబయ్య అన్నప్పుడు, ఏమాత్రం సందుండినా వారు విడిచి వెళ్లిపోయివుందురా?

చిత్రాంగి — మరే. కాని బాబయ్య అప్పుడలా అంటా రనుకోలేదు సుమా నేను.

చిలక — బాబయ్య కాక మరొకరయితే అలా అనలేకా పోదురు; సారంగధరులవారు కాక మరొకరయితే అలా వెళ్లిపోకా పోదురు.

రుక్కు — ఈ వుత్తిత్తి మాటల కేం గాని, చివరి కేమయిందో చెబుదూ.

చిలక—అప్పుడు కావడానికీ, యిప్పుడు చెప్పడానికీ యేం వుందీ? సారంగధరులవారి బాణం పులిహృదయంలో నాటుకోగా, వారి రూపం అమ్మాయి హృదయంమీద నాటుకుంది. (ఉయ్యాలా ఆపి, ముందుకి వంగి, చిత్రాంగి మొగంమీద మొగం పెట్టి) కాదూ తల్లీ?

చిత్రాంగి—(ముంగోపం నటిస్తూ) ఛో!

రుక్కు—ఆమాట అంటే అంత కోపం యెందుకమ్మా? సారంగధరులవారి విషయంలో మాత్రం అది అలా జరిగివుండ దనుకున్నారా? అబ్బో! అప్పణ్ణుంచీ వా రెంత నలిగిపోతున్నారో పాపం!

చిత్రాంగి—నువ్వెంత నలిగిపోతున్నావో వారి అవస్థ తెలుసుకుంటూనూ? ఈ సంగతి తెలిస్తే యెప్పటికేనా వారు నీకు మంచి బహుమతీ చెయ్యకపోరులే!

రుక్కు—ఎప్పటిదాకానో యెందుకూ? దేవుడు మేలు చేస్తే వొక్క నెలలోనే వారివల్ల బహుమతీ పుచ్చుకుంటాను నేను.

చిలక — నువ్వు చెప్పింది బాగానే వుంది. ఏమంటే? మూడేళ్లకిందట పాపికొండల్లో సంభవించిన సన్నివేశం వారి హృదయం ఆక్రమించుకుని వుంటే, సార్వభౌములు ఎన్ని చిత్రపటాలు తెప్పించినా, అమ్మాయిని తప్ప మరొక రాజపుత్రిని వరించరు వారు. వరించనే లేరు కూడాను.

చిత్రాంగి—కారణాలమీద కారణాలు కల్పించి, సుబుద్ధి అయ్యవారు, ముందరి

కాళ్లకి బందాలు వెయ్యబట్టి కాని లేకపోతే బాబయ్య అంత ప్రేమతో ఆహ్వానించి నందుకు, ఆవేళ, భోజనానికి మన గుడారానికి వచ్చివుండక పోదురా వారు ?

చిలక—తప్పకుండా వచ్చివుందురు. బాబయ్య పిలిచినప్పుడు వారి మొగంమీద యించక్కని కళ కనపడింది. "రాలేను" అని చెప్పడానికి వా రెంతో బాధపడ్డట్టు కన పడింది. బాబయ్యకు అలా చెప్పి, వారు, సుబుద్ధి అయ్యవారిని చూసిన చూపులో ఎంతో అసంతృప్తి కనపడింది. అలా కాక: వారు నిజంగా వచ్చేవుంటేనా ?

రుక్కు—వారు వచ్చేవుండి, నే నప్పు డక్కడ వుండేవుంటేనా? నిమిషంలో రెండు పూలదండలు కట్టి—(లేచివెళ్లి పూలదండ చిత్రాంగిమెడలో వేసి, గడ్డం పుణుకుతూ) ఇప్పు డమ్మాయిగారి కీదండ నేను వెయ్య డానికి వీలుండునా ?

చిత్రాంగి—(నునుసిగ్గుతో తలవంచు కుంటుంది)

చిలక — చూడనిదానికి నీకే యిలా వుంది, చూసినదాన్ని నేనెంత మథనపడి పోయానో అప్పుడు ?

చిత్రాంగి — (చిలకతో) బాబయ్యగా రెంత నొచ్చుకున్నారో చూశావు కాదూ అప్పుడూ ?

చిలక— అవు నమ్మా అవును.

రుక్కు— అయితే, అప్పుడు సుబుద్ధి అయ్యవారు వెంట వుండడం అన్నివిధాలా అసందర్భమే అయిం దన్నమాట.

చిలక—సందేహమేం? నిజంగా, వారే అప్పు డక్కడ వుండివుండకపోతే సారంగ ధరులవారు మన గుడారానికి రావడమూ— (అర్ధోక్తి)

రుక్కు—గాంధర్వవివాహం—(అర్ధోక్తి)

చిత్రాంగి — (రోషం అభినయిస్తూ) ఛో! సిగ్గులేదూ నీకూ ?

చిలక — అలాంటప్పుడు రుక్కమ్మ తప్పకుండా సిగ్గుపడివుండవలసిందే. అలా సిగ్గుపడి వుండకపోతే దాని బుగ్గలు చిదిమి చేతులో పెట్టివుందును నేను. దానికేం గానీ, అప్పు డలాగ్గే జరిగివుంటే, సత్యాకృష్ణుల యమునావిహారంలాగ యిప్పుడు అమ్మాయీ, సారంగధరులవారూ మ హో ల్లా సం తో గోదావరీవిహారం చేస్తూ వుండకపోదురా ?

చిత్రాంగి— నువ్వు గోదావరీవిహారం అంటే జ్ఞాపకం వచ్చింది, యేదీ ఆకథ మళ్లీ చెప్పవే!

రుక్కు— (చిలకతో) అదేం కథే?

చిలక— కథ కాదు; గాని కథ కంటే చమత్కార మైనది. నన్నయభట్టారకులవా రెంచేతో వూరుకున్నారు గాని వారే అది వర్ణించివుంటే భారతంకంటేనూ యెంతో రసవంతం అయి వుండును.

చిత్రాంగి — నిజమే. దాల్లో కవితా వస్తు వెంతేనా వుంది.

రుక్కు—ఇద్దరూ కలిసి న న్నూరించే స్తున్నారు; గాని జరిగిం దేమిటో మాత్రం వొకరూ చెప్పరు.

చిత్రాంగి— చెబుతుంది చెబుతుంది, యిప్పటికే చాలా వూరిపోయావు, చాలించి యిక విను.

చిలక—ఒకనాడు సారంగధరులవారూ, సుబుద్ధి అయ్యవారూ యెందుకో పట్టిసపు కొండకి వెళ్లి వుండి నాలుగ్ఘళ్లపొద్దువేళ తిరిగి వస్తున్నారుట.

రుక్కు—ఊహూ!

చిలక—వారి పడవ వాయువేగమనో వేగాలతో యెగిరి వచ్చేస్తోందిట.

రుక్కు—నరే.

చిలక—సరిగా, ఆసమయంలో, రెండు మూడు వందల డింగీలలో వూరివారనేకు లక్కడ నదీవిహారం చేస్తున్నారుట.

రుక్కు—హాయిహాయి!

చిత్రాంగి— చిన్న డింగీలో కూచుని కులుకుతూ, కెరటాలమీాద పువ్వుల్లా పొంగి పోతూ ఆ డింగీలమధ్య విహరిస్తే— ఏమే చిలకా, ఇక నిద్రాహారా లెందుకే?

చిలక— నిజమే తల్లీ! ఒక డింగీలో నుంచి సంగీతం వినిపిస్తూ వుంటుంది. ఇంకో డింగీలోనుంచి కేరింతాలు వినపడుతూ వుంటాయి. మరో డింగీలోనుంచి—(అర్ధోక్తి)

రుక్కు—చాలించు నీ కేరింతాలు.

చిలక—అదేమే?

రుక్కు—కాకేమే?

చిత్రాంగి—ఏం తక్కువే?

రుక్కు—ఎన్ని వినపడితే యేం లాభమమ్మా?

చిలక—అదేమే అలా అంటావూ?

రుక్కు— అనక యేమమ్మా? నేను కనక సరిపోయింది కాని నీమాటలు మరెవరేనా వింటే నవ్విపోరూ?

చిలక— ఎందుకు నవ్వుతారూ?

రుక్కు— ఎందుకు నవ్వరూ? ఎన్నో డింగీలమధ్య, ఉత్తుంగతరంగాలమీాద వొకడింగీట. ఆడింగీలో వొక్కగా నొక్క పడుచుట.

చిత్రాంగి— వోస్! ఎంత చక్కగా తీశావూ స్వారస్యం?

చిలక — వోసి నీయిల్లు బంగారం గాను! చిత్తచోరు డైన వగలాడు దగ్గిర లేకుండా వొక పడుచుకి నదీవిహారం యేమిటే?

రుక్కు — అదే నేననేది. అమ్మాయిగా రలా చెప్పారా మరీ?

చిత్రాంగి — చాలా గొప్పప్రశ్న. అచ్చంగా సుబుద్ధి అయ్యవారికి తగినదానివే నువ్వు.

చిలక — ఇంకా సందేహమా? అయితే, రుక్కూ! వెంటవుండతగ్గ వగలాడు దొరకందే అమ్మాయి రాజమహేంద్రపురంలో నదీవిహారం చెయ్యడం యెలా తటస్థపడుతుందే?

చిత్రాంగి — అలా నిలవతీసి అడుగు.

రుక్కు — ఎలా అడిగితే మాత్రం నాకేం భయమా? పైగా, నిలవతీసి అడగడం వల్లనే యెవరెవరి ముచ్చట్లూ వెల్లడి అయ్యాయి. మంచిదే కదూ?

చిత్రాంగి — మంచిదే కదా? నీ ముచ్చట తీరింది కదా? నీబహుమతీ నీకు వస్తుంది కదా?

రుక్కు—తప్పకుండానూ.

చిత్రాంగి— రుక్కు మనస్సు కుదుట పడింది, యిక చెప్పవే పాపం!

చిలక— వినవే రుక్కూ!

రుక్కు—పలకవే చిలకా!

చిలక—అ డింగీలమధ్య వొక మదపు ఏనుగు విహరిస్తోందిట. పరధ్యానంగా వున్న మావటివాడు, యువరాజులుంగారి పడవ హఠాత్తుగా గుర్తించి, దారి యివ్వడంకోసం పొడవగా నడగొండవంటి ఆ యేనుగు గభీమని వొక డింగీమీద పడిందిట.

రుక్కు—అ—య్యో!

చిలక—అది చూసి, తక్కిన డింగీలన్నీ నీలాగే అయ్యో అన్నాయిట. వెంటనే కుయ్యో అంటూ ఆడింగీ బోల్తా కొట్టిందిట.

రుక్కు—కవిత్వం కడుతున్నావే ?

చిలక—నువ్వు వ్యాఖ్యానం చేస్తూనే వున్నావుగా ?

చిత్రాంగి—(చప్పట్లు చరుస్తూ) హాయ్‌హాయ్!

చిలక—ఆపాళంగా, ఆ డింగీలో వున్న వొక యువకుడూ, వొక యువతీ, వొక వృద్ధాంగనా—(అర్థోక్తి)

రుక్కు—(చకిత అయి) వృద్ధాంగనా?

చిత్రాంగి—అవును. పళ్లూడిపోయి—తల నెరిసిపోయి— నడుము వంగిపోయి— కాటికి కాళ్లు చాచుకునివున్న వృద్ధాంగన.

రుక్కు—సెబాసు!

చిలక—అయితే, ఆమెకి జంటగా వొక వృద్ధపురుషుడు మాత్రం లేడుసుమా!

[ ముగ్గురూ చప్పట్లు కొడుతూ వొక్క క్షణం కిలకిలా నవ్వుకుంటారు.]

రుక్కు—శనిగాడులాగ వాళ్లకూడా ఆ ముసలిపీను గెందుకో ?

చిత్రాంగి—తానేడుస్తూ వాళ్ల నేడిపించడానికి. (చిలకతో) అవునా ?

చిలక—అవును తల్లీ! సరిగా అందుకే. దేవుడు అదే కట్టికుడిపాడు చివరికి.

చిత్రాంగి — తరవాత చెప్పవే.

చిలక—వెంటనే సారంగధరులవారూ, సుబుద్ధి అయ్యవారూ ఉన్నవా రున్నట్టు గోదావరిలో వురికారుట.

రుక్కు —(ఉలిక్కిపడి) ఏమిటీ?

చిత్రాంగి — దీనికే నువ్వింత ఆశ్చర్య పడుతున్నావు, ఇంకా వింటే—(చిలక కేసి తల పూపుకుంటూ చూస్తూ) ఆవేళా? కడెమ్మ కొండమీదా? అది చెప్పవే.

చిలక— చెబుతాను తల్లీ చెబుతాను. ఒకమాటు సారంగధరులవారు, వేటలో యెండపడి, క్షుధార్తులూ, తృష్ణోపహతులూ అయి, కడెమ్మకొండమీద వొక చెట్టుకిందకి చేరుకున్నారుట.

రుక్కు — ఆఁహా!

చిలక — వెంట సుబుద్ధి అయ్యవారున్నా—(అర్థోక్తి)

రుక్కు— చెప్పే దేమిటి? ఉన్నారుట.

చిత్రాంగి — మహాబాగా అన్నావు. ఎప్పటికైనా శనిగాడయినా విడిచిపెడతాడు కాని—(అర్థోక్తి)

చిలక— వార్తలను పట్టి చూస్తే వారికీ వారికీ అభిప్రాయాలు తరుచు భేదిస్తూనే వుంటాయిట. అయినా యెలాంటప్పుడున్నా

వారికి పారవహ్యాలు రావుట. వా రెన్నడూ విడిపోరుట.

రుక్కు— అయ్యవారు విడిచిపెట్టరుట. అలా చెప్పు.

చిలక—ఆమాటే. మహామంత్రి కుమారులు గదా వారు, మహారాజు కుమారులను విడిచివుండడం ధర్మమా? కాని—(అర్ధోక్తి)

చిత్రాంగి — "కాని" అన్నావుకదా? సరే యిక కానియ్యి.

చిలక— ఇద్దరూ కూచుని వున్నారుట. సారంగధరులవారి వేటజట్టులో చేరాలని యెన్నాళ్లనుంచో వొక కోయదొర కనిపెట్టుకుని వున్నాడుట. అతగాడు, సమయం దొరక్కపోతుందా అని కూడకూడా తిరుగుతూ వుండి, స్థితిగతు లన్నీ కనిపెట్టి వారు కూచునీ కూచోడంతోటే కమలాఫలాలూ, నారింజపళ్లూ, పుట్టతేనే, సారపప్పూ—(అర్ధోక్తి)

రుక్కు—భలే కోయదొర. వాటివల్ల ఆకలీ తీరుతుంది, దాహమూ కడుతుంది. నేదా— (అర్ధోక్తి)

చిత్రాంగి— పుష్టీ బలమూ యేర్పడి, మళ్లీ వేటాడ్డానికి వుత్సాహోల్లాసాలూ కలుగుతాయి.

చిలక — ఇంకా సందేహమూ తల్లీ? అప్పుడు యువరాజులుంగారు, కోయదొరని కటాక్షించి, కమలాఫలం వొలిచి వొక్క తొన నోట వుంచుకునేటప్పటికి—(అర్ధోక్తి)

రుక్కు— (చకిత అయి) ఒక్క తొన నోట వుంచుకునేటప్పటికి! ఏమిటే తరవాతా?

చిత్రాంగి — (కళ్లు మూసుకుని పారవశ్యంతో) కళ్లకి కట్టినట్టు కనపడుతోంది ఆ సన్నివేశం. వివరంగా చెప్పవే.

చిలక — ఒక్క తొన నోట వుంచుకునేటప్పటికి, నాలుగేళ్ల కోయపిల్ల వొకతె బెదురుతూ బెదురుతూ పక్కకి వచ్చి నుంచుని, పళ్లు విడిచి ప్రభువునీ, ప్రభువుని విడిచి పళ్లనూ మిడుతూ మిడుతూ చూస్తూ నుంచుందిట.

రుక్కు — నుంచుని?

చిత్రాంగి — ఊరికే నుంచుందిట. అంతే.

చిలక— అది చూసి, వా రుబ్బెత్తుగా లేచి వెళ్లి, బుజ్జగిస్తూ తీసుకువచ్చి పక్కని కూచోపెట్టుకుని, తృప్తిపడేదాకా తేనే, తొనలూ యిచ్చి—(అర్ధోక్తి)

రుక్కు — ఏమి ధర్మాత్ములు తల్లీ వారు? వారి మొగం చూస్తే పాపాలు పోతాయి మాఅమ్మా!

చిత్రాంగి — (మొగం చిట్లించుకుని) సుబుద్ధి అయ్యవారి మొగం చూస్తేనో?

రుక్కు—వా రేం చేశారే చిలకా?

చిలక— మురిసిపోతూ కూచుని — (అర్ధోక్తి)

చిత్రాంగి — ఎవరో సత్రాలమీద రాళ్లు వేస్తారుట? ఇచ్చేవాళ్ల మనస్సు విరిచేస్తారుట? అంతే కాదుటే?

చిలక—అవును తల్లీ! అంతే. (రుక్కుతో) మురిసిపోతూ కూచుని, ప్రభు విచ్చిన తొనలు ఆరగిస్తూ వున్న కోయపిల్లని, వొక

నాసిపండు చేతిలో పెట్టి "పో పో" అంటూ అదిలించారుట అయ్యవారు.

రుక్కు — శివశివా!

చిలక — అప్పుడు యువరాజులుంగారు వారిని వారించి, తృప్తిపడేదాకా దానికి తొనలూ, తేనే అందించి, చివరి కొక నారింజ పండూ, వొక కమలాఫలమూ ఆ చిన్ని చేతుల్లో వుంచి, అది యెగురుతూ దుముకుతూ గుడిసె కేసి వెళ్లిపోయాక, సావకాశంగా కూచుని తాము ఆరగించారుట.

రుక్కు — అప్పటిదాకా కంఠం ఆరిపోతూ వుండినా—(అర్థోక్తి)

చిత్రాంగి — అలాంటప్పుడు బాధ కనపడుతుందిటే వెర్రిదానా? చిన్నారిబొజ్జమీద తేనెచినుకులూ, ఫలరసమూ చిందించుకుంటూ ఆపిల్ల అవి ఆరగిస్తూ వుంటే వారికెంత ఆప్యాయంగా వుందో? అలాంటి దివ్యానుభూతే కలక్కపోతే మనస్ఫూర్తిగా యెవరేనా దానధర్మాలు చెయ్యగలరుటే?

చిలక — సుబుద్ధి అయ్యవారు—(అర్థోక్తి)

చిత్రాంగి — (విసుక్కుంటూ) కాస్త నేపటిదాకా ఆపే రెత్తకే.

[ముగ్గురూ వొక్క క్షణం మౌనంగా వుంటారు.]

చిత్రాంగి — ఇక ఆకథ చెప్పు.

చిలక — (చిత్రాంగితో) మంచిదమ్మా! (రుక్కుతో) ఎందాకా చెప్పానే?

రుక్కు — ఆపళంగా, సారంగధరులవారూ, సుబుద్ధిఅయ్యవారూ ఉన్నవారున్నట్టుగా నదిలో వురికారుట.

చిలక — ఉరికారుట. మరే, అలా వురికి పెద్దపెద్ద బారలు వేసుకుంటూ వెళ్లడంలో, ఆపిల్ల సారంగధరులవారి చేతికి—(అర్థోక్తి)

రుక్కు — భేష్!

చిత్రాంగి — అప్పుడే అంటావేం ఆ మాట? ఇంకా విను.

రుక్కు — (చిలకతో) ఇంకేమిటే?

చిలక — ఆముసలమ్మ—(అర్థోక్తి)

రుక్కు — ఆకోతి—(అర్థోక్తి)

చిలక — అవునవును. ఆకోతిపిల్ల—(అర్థోక్తి)

[ముగ్గురూ కిలకిలా నవ్వుతారు.]

రుక్కు — ఆకోతిపిల్ల సుబుద్ధిఅయ్యవారిని పట్టుకుందిట. అంతేనా?

చిలక — పట్టుకోలేదుట. వారిచేతులూ కాళ్లూ ఆడకుండా తూటికాడలాగ అల్లుకుపోయిందిట.

రుక్కు — భేష్ భేష్! చాలా బాగా జరిగింది.

చిలక — (చిత్రాంగితో) రుక్కమ్మ గురుభక్తి చూశారా అమ్మా?

చిత్రాంగి — (చప్పట్లు కొడుతూ) హోయిహోయి!

[చిలకా, రుక్కు కిలకిల్లాడతారు.]

చిత్రాంగి — (చిలకతో, ఆగిఆగి) ఆ పిల్లా—?... వారిచేతికి?... తరవాత చెప్పవే.

రుక్కు — (చిలకతో) అవునవును. ఆ పిల్ల వారిచేతికి దొరికిం దన్నావు. అయితే, తనని పట్టుకున్నవారు యువరాజులుంగారని ఆపిల్ల గుర్తించిందా?

చిలక—గుర్తించకేం? ఇంచక్క గుర్తించింది. కనకనే వారి సందిట నిలువునా కరిగిపోయిందిట.

రుక్కు— "కంఠాశ్లేషప్రణయిని"— (అర్థోక్తి)

చిత్రాంగి—(మందహాసం చేస్తుంది)

చిలక—కాలేదు. కాని కలవ కాడలాగ జారిపోతుం దేమో అని వారే ఆమెని అదిమి పట్టుకున్నారుట. దాంతో ఆమె మరీ యిదయిపోయిందిట పాపం.

చిత్రాంగి — పూర్వజన్మలో యేదో గొప్ప నోము నోచుకుం దది. లేకపోతే తానెక్కడ, వారినందిట—(అర్థోక్తి)

రుక్కు—(చిత్రాంగితో) అంటే ఆమె కులం యేమిటీ?

చిత్రాంగి—అది వేశ్య.

[చిలకా, రుక్కు మొగమొగాలు చూసుకుంటారు]

చిలక—ఇంతలో మావటివాడు యేనుగుని తీసుకువచ్చాడుట. వెంటనే వారామెని యేనుగుమీద కూచోపెట్టారుట. కాని గడగడలాడిపోతూ ఆమె మళ్లీ నదిలో పడిపోయేటట్టుండగా తాముకూడా యేనుగెక్కారుట వారు.

రుక్కు — సెబాస్! యువరాజులుంగారితో కలిసి గజారోహణం. ఎంత అదృష్టవంతురాలే అదీ?

చిత్రాంగి — అదృష్టవంతురాలేం? పాపం! తరవాత యేం జరిగిందో యెరుగుదువా? (చిలకతో) చెప్పవే.

చిలక—తనకి వచ్చిన విపత్తు తలుచుకునో, యువరాజులుంగారి సాన్నిధ్యం భరించలేకో ఆమె గడగడలాడిపోయిందిట. అది చూసి వారు "భయపడకమ్మా చెలీ— (అర్థోక్తి)

రుక్కు — (రెండుచేతులూ పైకెత్తి నమస్కరిస్తూ) గోవిందా—గోః—విందా"

చిత్రాంగి — (కళ్లుతిప్పుకుంటూ) లేకపోతే యేమనుకున్నావుమరీ? వయసు వచ్చిన ఆడపిల్లని వారు కన్నెత్తి చూడరుట. ప్రాణాపాయం వస్తుం దేమో అని ఆమెని పట్టుకుని వుంటారు గాని, తరవాత, అలా చేసినందుకు వారెంత యిదయిపోయారో పాపం!

రుక్కు—రాజపుత్రులలో అంతటి శీల నైశిత్యం వుండడం అరుదు. సారంగధరుల వారి చరిత్ర అతిలోకరమణీయంగా వుంది.

చిత్రాంగి — నిజంగా, ఆడదానికి, ఎంతటి పుణ్యం చేసుకుంటే అలాంటి పెనిమిటి దొరకనూ? అలాంటి పురుషుణ్ణి చెట్టపట్టని స్త్రీ చచ్చేం, బతికేం? ఏమే చిలకా?

చిలక—ఇంకా సందేహమా తల్లీ?

రుక్కు— వారికి కాబోయే యిల్లాలు —(అర్థోక్తి)

చిత్రాంగి — వారికోసం ప్రాణాలు ధారపోసేది కాకపోతే అదీ వొక ఆడదే అవుతుందా?

చిలక—అవును తల్లీ అవును.

రుక్కు—అయితే, తరవాత యేం జరిగిందే చిలకా?

చిత్రాంగి—ఏంచేశారా? (కళ్లు మూసుకుని పారవశ్యం నటిస్తూ) వారికి తోడబుట్టుపడుచులు లేరుట. వుంటేనా?

చిలక — లేకపోతే మాత్రం వచ్చిన లోటేమిటీ? వారి కా చేశ్శే తోడబుట్టుపడుచయిపోయింది కాదూ?

రుక్కు—ఇంకా యేంచేశారే వారు?

చిలక—తరవాత, వా రామెని కోటకి తీసుకువెళ్లి, మహారాణీకి చూపించి, పసుపూ కుంకుమా, చీరా రైకా—(అర్ధోక్తి)

రుక్కు—(చేతులు జోడించుకుని) మా తండ్రే! మానాయనే! మంచిముహూర్తాన కొమాళ్ల తండ్రివై, కూతుళ్ల తండ్రివై—(అర్ధోక్తి)

[రుక్కు యిలా అంటూ వుండగా వొక దాసి వస్తుంది. "ఎందుకూ" అన్న ట్టందరూ ఆమెకేసి చూస్తారు.]

దాసి—అమ్మా! అమ్మా, బాబయ్యా చంద్రకాంతమండపంలో వున్నారు. రమ్మని ఆజ్ఞ అయింది.

చిత్రాంగి — (ఉయ్యాలా దిగి) ఏం చేస్తున్నారూ?

దాసి—(దిక్కులు చూస్తూ వూరుకుంటుంది)

చిలక—మాట్టాడ వేమే?

దాసి—ఏదో దిగాలుపడి వున్నటు—(అర్ధోక్తి)

చిత్రాంగి—(ఆత్రంతో) ఆ!

దాసి — రాజమహేంద్రపురంనుంచి చక్రవర్తిగారి మంత్రి వచ్చారుట. వారేదో అప్రియవార్త తెచ్చినట్టుం దమ్మా!

చిత్రాంగి — (బెంబేలుపడి చిలకతో) అదేమిటే? (అంటూ వెనకవాటుగా చిలక మీద వాలుతుంది.)

చిలక—(చిత్రాంగిని పొదివిపట్టుకుని) లేదమ్మా లేదు. నిన్నగాక మొన్న చిత్రపటం పట్టించుకువెళ్లిన సార్వభౌములు ఇవాళ పనిపట్టి మంత్రినే పంపా రంటే ప్రియవార్తే అయివుంటుంది కాని అప్రియవార్త యెలా అవుతుందీ? ఇది యేదో చూసి, యేమో అనుకుని, మనతో యేదో చెప్పబోయి యిలా నోరుజారివుంటుం దంతే. అమ్మా బాబయ్యా యెందుకు దిగులుపడతారూ? మెల్లిగా వెడదాం, అడుగు లెయ్యండి తల్లీ!

[దాసి ముందు బయలుదేరుతుంది. తరవాత చిలక చిత్రాంగిని పట్టుకుని నడిపిస్తుంది. చిత్రాంగి చీరకొంగు నేలమీద జీరాడుతూ వుండగా అది పట్టుకుని, రుక్కు, వెనకాల బయలుదేరుతుంది.]

## అయిదో రంగం

జక్కులదీవి నగరంలో మహారుద్రయ్య విడిది.

రాత్రి, భోజనానంతరం, చిత్రాంగి సురువు పేరుభట్టూ, మహారుద్రయ్యా అభిముఖులై కూచుని వుంటారు.

వారి పక్కగా, నాలుగు గజాల దూరాన చిలక నుంచుని వుంటుంది.

***

పేరుభట్టు — ఈవ్రతం, మాప్రభువుల వంశంలో, అనుశ్రుతంగా వస్తూ వున్నదీ; కాని కొత్తది కాదు.

మహారుద్రయ్య — అనుశ్రుతంగానా? అయితే, ప్రతీతరంలోనూ, స్త్రీ లందరూ—(అర్ధోక్తి)

పేరుభట్టు — కాదుకాదు. వృద్ధులను పెళ్లి చేసుకోవలసివచ్చినప్పుడు ఆడబడుచులకు మాత్రమే మా ప్రభువంశంలో యిది ఆచరణీయం. తక్కినవారికి పనిలేదు.

మహారుద్రయ్య—తమ ప్రభువంశంలో వృద్ధపురుషులు— (అర్ధోక్తి)

పేరుభట్టు—"వార్ధకే మునివృత్తీనాం" అని కాళిదాసుగారన్నట్టు, వయస్సు మళ్లగానే మా ప్రభువంశీయులు వానప్రస్థాశ్రమం స్వీకరిస్తారు. కనక నేటివరకూ అలాంటిది సంభవించలేదు.

మహారుద్రయ్య — పోనీ, యిటీవలి ఆడబడుచులెవరేనా ఆచరించి వున్నారా యిది ?

పేరుభట్టు — మూలపురుషుల పెద్ద కోమార్తెగారిది ఆచరించి, వంశానికంతకీ యిది సంప్రదాయంగా వుండవలసిందని శాసించారు.

మహారుద్రయ్య — అలాగా ?

పేరుభట్టు—చిత్తం.....పదహారు తరాలకు తరవాత, మళ్లీ మా ప్రభువు పితామహులవారి మేనత్తగారు, ఇలాగే పద్దెనిమిది సంవత్సరాల వయస్సున, యాభయ్యేళ్ల రేనాటిప్రభువును పెళ్లి చేసుకోవలసి వచ్చింది. అప్పుడు వారున్నూ యీవ్రతం ఆచరించి,దీని ప్రభావంవల్ల కడుపెడు పిల్లలను కనుక్కొని, ముప్ఫయినాలుగేళ్లు సకలవైభవాలూ అనుభవించి, భర్తగారియెడల వుండిన భక్తివల్లా, ముఖ్యంగా యీవ్రతం నియమంవల్లా చివరికి సహగమనం— (అర్ధోక్తి)

మహారుద్రయ్య—వద్దు వద్దు, ఆమాట యిప్పుడెందుకు లెండి. అయితే, దీనికి నియమాలు ?

పేరుభట్టు—ప్రతీదినమూ, సాయంత్రం నాలుగ్గళ్ల పొద్దువేళ పూజాప్రయత్నాలకు ప్రారంభం. జామున్నర రాత్రిదాకా పూజా, అప్పుడు శ్రీ. రాన్నం మహానైవేద్యమూనూ.

మహారుద్రయ్య— ఆహా.

పేరుభట్టు—మళ్లీ అరుణోదయాత్పూర్వమే పూజ ప్రారంభం అయివుండాలి. జామున్నర పొద్దెక్కాక అతిరసాలతో మహానైవేద్యం. తరవాత మరో రెండు గడియలసేపు—అంటే వ్రతకల్పంలో మూడధ్యాయాలు పారాయణ చేసుకోవాలి.

మహారుద్రయ్య—ఆహా.

పేరుభట్టు—సాయంత్రం సూర్యాస్తమయానికి పూర్వమూ, పగలు — అంటే ఉదయం సూర్యోదయానంతరమూ తామర పువ్వులతోటీ, ఉభయవేళలా చీకటిలో కలవపువ్వులతోటీ పూజ.

మహారుద్రయ్య—కాలనియమం చాలా నిక్కచ్చిగా వుంది.

పేరుభట్టు—చిత్తం అలాగే. అయితే, కుంకుమకు మాత్రం కాలనియమం లేదు. ఇక వున్నదల్లా యేమిటంటే ? ఉభయవేళలా సహస్రనామపూజ చెయ్యాలి. అందులో అయిదువందలు కుంకుమపూజా, అయిదువందలు పుష్పపూజానూ.

మహారుద్రయ్య—బాగుంది.

పేరుభట్టు— ఈవ్రతం అవిచ్ఛిన్నంగా ఆరుమాసాలు ఆచరించాలి.

మహారుద్రయ్య—ఆరుమాసాలా?

పేరుభట్టు—ఆరుమాసా లన్నది స్థూల నియమం. చిత్తగించారూ? పూజాదినాలు నూటయెనభై కావాలి.

మహారుద్రయ్య—రమారమీ యేడు మాసా లని సెలవిప్పించండి.

పేరుభట్టు—అన్నమాటే.........ఇక పూజాదినాలలో, రాత్రి, నివేదిత క్షీరాన్నం మాత్రమే ఆహారం. పగలు సుష్టుగా భోజనం చెయ్యవచ్చు.

మహారుద్రయ్య — ఏకభుక్తం అన్న మాట.

పేరుభట్టు—అవును. పూజ చేసుకో డానికి వీలులేని దినాలలో రాత్రిళ్లు నిరాహారం, పగలేమో క్షారలవణవర్జ్యం.

మహారుద్రయ్య—అబ్బా!

పేరుభట్టు—రాత్రీ, పగలూ కూడా స్థండిలశయనమే కాని చాపమీద కూడా శయనించరాదు. శీతోదకమే కాని స్నానానికి వుష్ణోదకం పనికిరాదు.

మహారుద్రయ్య—ఇది మరీ దారుణంగా వుంది.

పేరుభట్టు—మరి వుద్దిష్టఫలం?

మహారుద్రయ్య—(తల పంకిస్తూ) సరే లెండి.

పేరుభట్టు—తరవాత, అంటే కడపటి దినాన, సాయంత్రం వధూవరు లిద్దరూ మంగళస్నానాలు చేసుకుని, ముందుగా—వేరు వేరుగా—ఒకరి మెదట వొకరు తులాభారం తూగాలి.

మహారుద్రయ్య—ఓహో!

పేరుభట్టు—అవును...తూగి, ఆ ద్రవ్యం, వారి పురోహితులవారికి వీరూ, వీరి పురోహితులవారికి వారూ వాయనదాన దక్షిణగా—(అర్థోక్తి)

మహారుద్రయ్య— మరి వాయనం?

పేరుభట్టు — పూజాదినా లెన్నో వధువు అన్ని గుమ్మిడిపళ్లూ, వరు డన్ని నారికేళఫలాలున్నూ.

మహారుద్రయ్య— బాగుంది.

పేరుభట్టు—సూర్యాస్తమయానికి పూర్వమే మళ్లీ శాస్త్రీయంగా వివాహం—(అర్థోక్తి)

మహారుద్రయ్య — మళ్లీనా? అదెందుకూ?

పేరుభట్టు—అవును, మొదట జరిగే పెళ్లి కత్తికి కనక.

మహారుద్రయ్య— సరే.

పేరుభట్టు — తరవాత, ఆరాత్రే—(నానుస్తాడు)

మహారుద్రయ్య— ఆవేళేనా?

పేరుభట్టు—అవు, నదిస్నీ వుద్యాపనాంగమే. చిత్తగించారూ?

మహారుద్రయ్య — అయితే, ఆరుమాసాల పైచిలుకూ తప్పదూ? గడువు తగ్గితే యేం?

పేరుభట్టు — ఊహూ, పనికిరాదు. (వొత్తుసొదులు స్ఫుటంగా పలుకుతూ వుపదేశముద్రతో) "షాణ్మాసికస్థండిలసావిత్రీగౌరీవ్రతం" అని పేరే కదా దీనికి?

మహారుద్రయ్య— (పక్కకి చూస్తూ ఆలోచించి తల పంకిస్తూ) తరవాయి సెలవిప్పించండి.

పేరుభట్టు — చిత్తంచిత్తం. ఈ ఆరు మాసాలూ, ఉద్యాపన ముగిసేదాకా భర్తగా రామెని తాకరాదు. సన్నిధికే—(అర్థోక్తి)

మహారుద్రయ్య—(నిర్విణ్ణుడై) ఆ!

చిలక — (ఓరకంట చూస్తూ తల పంకిస్తుంది)

పేరుభట్టు— మరొక్కటి. సాయంత్రం, పూజాప్రయత్నాలు ప్రారంభం అయింది మొదలు, మళ్లీ ఉదయం పారణ చేసేదాకా మా అమ్మగారిని పోతుటీగ అయినా చూడ గూడదు.

మహారుద్రయ్య—(వులిక్కిపడి) ఆ! ఆ!

చిలక — ("మ రే మ ను కు న్నా వయ్యోయ్" అన్నట్టు మళ్లీ తల పంకిస్తుంది)

మహారుద్రయ్య — (ఆలోచించి) మరి భర్తగారు?

పేరుభట్టు— (మహారుద్రయ్య కళ్లల్లోకి గంభీరంగా చూస్తూ) పురుషులే కాదూ?

చిలక—(ఫక్కున నవ్వబోయి, నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని, మొగం పక్కకి తిప్పే సుకుంటుంది)

మహారుద్రయ్య— (ప్రత్యుత్తరం చెప్ప లేక మొగం పక్కకి తిప్పుకుంటాడు)

పేరుభట్టు—కనక, వారున్నూ చూడ కూడదు.

మహారుద్రయ్య — పోనీ, పగలు మా ట్లాడవచ్చునా?

పేరుభట్టు— ఇంకా అభ్యంతరమా? అయితే, చిత్తగించారూ? తాకకూడ దన్న నిషేధం......? జ్ఞాపకం......?

మహారుద్రయ్య—ఉందివుంది.

పేరుభట్టు—గడపకి అవతల వొకరూ, యివతల వొకరూగా వుండి— దాంపత్య సల్లాపా లెంతమాత్రమూ రాకుండా—చిత్త గించారూ? సావకాశంగానే లోకాభిరామా యణం మాట్లాడుకోవచ్చు.

మహారుద్రయ్య — పెళ్లి చేసుకున్నం దుకు మొదటి ఆరుమాసాలూ యిదొక్కటే ఫలితం.

పేరుభట్టు—అదే మహాప్రసాదం. కుల దేవతలు ఆమాత్రం అయినా అవకాశం వుండనిచ్చినందుకు సంతోషించవలసిందే.

మహారుద్రయ్య-అలాగే మరీ. అయితే యింకేమిటీ?

పేరుభట్టు—(చిలకకేసి చూస్తాడు)

చిలక—(చేతులు జోడించుకుని నమ్రత కనపరుస్తూ మహారుద్రయ్యతో) నామనవి— (అర్థోక్తి)

మహారుద్రయ్య— (చిలకకేసీ, పేరు భట్టుకేసీ చూస్తాడు)

పేరుభట్టు—దీనిపేరు చిలక. నాలు గేళ్ల వయస్సు వచ్చింది మొదలు, మా రాజ పుత్రిని, అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసిన దాది యిది. ఆమెకి నృత్యమూ, విలువిద్యా హరిఃఓం మొదలు యితి(శ్రీ)గా నేర్పిం దిదే.

మహారుద్రయ్య— చాలా గొప్ప సంగతి.

పేరుభట్టు—ఇక దాని మనవి చిత్త గించండి.

మహారుద్రయ్య—అవశ్యమూనూ.

చిలక—(చేతులు జోడించుకుని) మా అమ్మ చళుక్యసార్వభౌముల వంశానికి దివ్య జ్యోతి కాబోతున్నందుకు పరమసంతోషం.

మహారుద్రయ్య—మాకున్నూ.

చిలక—తమ రాయబారం తెలిసి మా అమ్మ వుప్పొంగిపోతున్నారు.

మహారుద్రయ్య—నేను ధన్యుణ్ణి.

చిలక— వ్రతోద్దేశమూ, వ్రతనియమాలూ, విధినిషేధాలూ తమరు సాకల్యంగా చిత్తగించారు.

మహారుద్రయ్య—అవును. ఇక తెలుసుకోవలసింది లేదు.

చిలక—సకలమూ సార్వభౌములతో విన్నవించి, యీవ్యవహారం పొక్తపరచడం తమ చేతిలో వుంది.

మహారుద్రయ్య— సార్వభౌములతో సకలమూ మనవిచేస్తాను. ఇక తరవాతి సంగతా? (చేతులు జోడించుకొని) ఆ మార్కండేయులవారి అనుగ్రహం.

పేరుభట్టు—చిత్తంచిత్తం. ఏరి మాకు సెలవు.

[పేరుభట్టూ, మహారుద్రయ్యా లేస్తారు]

మహారుద్రయ్య— నాకున్నూ సెల విప్పించండి. నేను రేపు ఉదయమే కన్యాదాతలను... (అర్ధోక్తి)

పేరుభట్టు—తథాస్తు.

చిలక—ముమ్మాటికీని.

మహారుద్రయ్య— తమ ఉభయుల ధోరణీ నా ప్రయత్నాలను సులభం చేస్తున్నాయి. చాలా సంతోషం.

పేరుభట్టు—నమో మహద్భ్యః.

మహారుద్రయ్య—నమో గురుభ్యః.

[చిలక, మహారుద్రయ్యని వుద్దేశించి వంగి చేతులతో భూమి తాకి కళ్లకద్దుకుంటుంది.

అందరూ వెళ్లిపోతారు.]

## ఆరో రంగం

రత్నాంగి నగరిలో వొక హాలు.

రత్నాంగీ, విజయాదిత్యుడూ, మహామంత్రి చిట్టిపీరన్నా కూచుని వుంటారు.

రత్నాంగి పక్కన, రెండు గజాలలో గౌరి.

* * *

చిట్టిపీరన్న—నేను సాహసించి అడిగితేనే ప్రభువు నాతో యీవిషయం ప్రస్తావిస్తున్నారు. ఈవిషయమై నేను దూరంగా వుండడమే వారి అభీష్టం అని తోస్తోంది.

రత్నాంగి—అవును, మీరు ప్రోత్సహించరు కాదూ? ధర్మం కాదని వారి కోరికను పూర్వపక్షం చెయ్యడానికే చూస్తారు కాదూ?

చిట్టిపీరన్న — దీనికి సాయం, మహారుద్రయ్యగారు స్వయంగా జక్కులదీవి వెళ్లి వున్నారు.

విజయాదిత్యుడు—అయితే, యీసందర్భంలో అన్నగారి ముచ్చట బలీయం అంటారా మీరు, మహారుద్రయ్యగారి ప్రోద్బలం యెక్కువ అంటారా?

చిట్టిపీరన్న—రెండూనూ.

రత్నాంగి— కనకనే యింతపట్టుదల.

విజయాదిత్యుడు — (ఒక్కమాటు రత్నాంగి కేసి చూసి, చిట్టిపీరన్నతో, ఆవేశంతో) మనమేనా పట్టు పట్టలేము? ధర్మ పక్షం మనది కదా, మన మెందుకు జంకాలి? (చేత్తో నిషేధిస్తూ దృఢస్వరంతో) ఈ వివాహం జరగడానికి వల్లకాదు.

రత్నాంగి— ఫలితం?

విజయాదిత్యుడు— (చిట్టి పీరన్న కేసి చూస్తాడు)

రత్నాంగి—పోనీ, ఏకారణంవల్లనేనా మహారాజు మానుకుంటా రనుకోండి. మరి అబ్బాయి ఆమెని స్వీకరిస్తాడా?

చిట్టిపీరన్న— (విజయాదిత్యుడితో) చిత్తగించారా? నా అనుమానం కూడా అదే.

విజయాదిత్యుడు— తండ్రిగా రామెని కోరివుండడమేనా కారణం?

చిట్టిపీరన్న — చిత్తం, అంతే.

విజయాదిత్యుడు— కొడుకు కోరుకున్న ఆమెని అన్నగారు... (అర్ధోక్తి)

రత్నాంగి—తమరు మళ్లీ మొదటికి వస్తున్నారు.

విజయాదిత్యుడు—అది నిజమే వదినా! అయితే, నాసంకల్పం యేమిటంటే? జక్కుల ద్వీవి రాజపుత్రికను అబ్బాయి వొక్కడే కాదు, అన్నయ్యగారు కూడా వదులుకో వలసిందే. ఆమె యేమయినా అయిపో నివ్వండి. ఇది మాత్రం జరిగితీరాలి.

చిట్టిపీరన్న— భట్టారకులవారి పట్టుదల కూడా యిదే.

రత్నాంగి—మనం పట్టుపట్టి అది సాధిస్తా మనే అనుకోండి. అయితే, అందువల్ల కుటుంబంలో కల్లోలాలు పుట్టవూ?

విజయాదిత్యుడు—పుట్టనివ్వండి. ఇంత కంటె అదే నయం. (చిట్టిపీరన్న కేసి చూస్తాడు)

చిట్టిపీరన్న— "నందో రాజా భవిష్యతి." అడ్డుకోడమే నావుద్దేశమున్నూ.

రత్నాంగి—(విసుగుతో) ఏమో యేం చేస్తారో చివరికి. ఏది యెలా జరిగినా యిక నా నాయన వుల్లాసంగా వుండడం తటస్థపడదు. నాబతుకెలాగా చట్టుబండలే అయిపోయింది.

చిట్టిపీరన్న — అమ్మా, తమ రంత మాట సెలవివ్వవద్దు.

విజయాదిత్యుడు — ఎలాంటి వదిన గారికి యెలాంటి యాతన సంభవించిందో చూశారా? వారికి రావలసినదేనా యిది?

రత్నాంగి—ఒక్క కొడుకు. అతని అభ్యుదయం చూడకం పెట్టిపుట్టందే తండ్రీ. (కళ్లల్లో నీళ్లు పెట్టుకుంటుంది)

గౌరి— (తటాలున వచ్చి రత్నాంగి కళ్లు తుడుస్తూ) వద్దు తల్లీ వద్దు.

చిట్టిపీరన్న—అమ్మా, తమరే యిలా అయితే, యిక మేమేం చెయ్యగలం?

విజయాదిత్యుడు—తమ రిక లోపలికి దయచెయ్యండి వదినా! గౌరీ!

గౌరి—చిత్తం మహాప్రభూ! (చెయ్యి పట్టుకుని రత్నాంగిని గదికేసి తిప్పి) అమ్మా! (నడిపిస్తుంది)

రత్నాంగి — (నాలుగడుగులు వేసి, మొగం వెనక్కి-తిప్పుకుని) మరిదిగారూ! చిట్టి వీరన్నగారూ! భారం అంతా—

[దుఃఖం ముంచుకురావడంవల్ల, రత్నాంగి, మరి మాట్లాడలేక తన కళ్లు తానే తుడుచుకుంటూ గారి ఆవరాతో లోపలికి వెళ్లిపోతుంది. విజయాదిత్యుడూ, చిట్టివీరన్నా గుమ్మందాటి వెళ్లేదాకా ఆమెకేసి చూస్తారు.]

విజయాదిత్యుడు — ఇది అన్నయ్యగారికి శ్రేయస్కరమా? ఆ మహాయిల్లాలలా కుమిలిపోతూ వుండగా, వారు, తమ సహోదతో సుఖాన వుండగలరా?

చిట్టివీరన్న—అది సరే కాని, ప్రభూ! మహారాణికి నేనేమి సేవ చేసినట్టూ? తప్పుదారి మళ్లించలేని నేను ప్రభువుకి చేసిన సేవమాత్రం యేమిటి?

విజయాదిత్యుడు—(పక్కగా చూస్తూ సాలోచనగా) అవును. అన్నయ్యగారి మనస్సు మళ్లించగలిగితేనే మన ప్రశ్న. నిజానికి, మీవల్ల ప్రయత్నలోపం లేదు; కానీ— (మెరుపుకొట్టినట్టయి చిట్టి వీరన్నతో) పోనీ, యిక్కడి ప్రయత్నాలిలా వుండగా మనం జక్కులదేవి రామభద్ర రాజుగారితో మంతనాలు సాగిస్తే?

చిట్టివీరన్న—(ఆలోచనలో పడతాడు)

విజయాదిత్యుడు — ఉన్నట్టుండగా అబ్బాయిని జక్కులదేవి పంపించేస్తే?

చిట్టివీరన్న—(నిరాశగా) వారిని పంపగలమా మనం?

విజయాదిత్యుడు—(మిడుతూమిడుతూ చూస్తాడు)

చిట్టివీరన్న — రామభద్రరాజుగారు అన్నయ్యగారితోనే కూడితే?

విజయాదిత్యుడు — (నిరుత్సాహపడిపోయి) సరే పదండి. భట్టారకుల వారితో ఆలోచింతాం.

[ఇద్దరూ బయలుదేరుతారు.]

చిట్టివీరన్న — భట్టారకులవారు, ఇది, చావుబతుకుల సమస్యగా భావిస్తున్నారు.

విజయాదిత్యుడు — అవును. ధర్మాన్ని పురస్కరించుకుని మాట్లాడుతున్నారు, కనక, వారి పట్టుదల అలా వుండడమే వుచితంగా వుంది.

చిట్టివీరన్న — సామ్రాజ్యం అంతటిలోనూ వొక్క భట్టారకులవారి యెడల మాత్రమే అన్నయ్యగారు పరమవిధేయులు. ఇదొక్కటే మనకి వుండుకున్న ఆశాలేశం. కనక దయచెయ్యండి.

[వెళ్లిపోతారు]



# ❀ తెనాలి రామకృష్ణుఁడు ❀

## అతని సమకాలికులు

శ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్య

### 3

రామకృష్ణునిగూర్చి లోకమునఁ బ్రఖ్యాతిలో నున్న యైతిహ్యములను బట్టి చూడ నాతనికి కృష్ణరాయల కాలమందుండిన పెక్కుమంది కవులతోడను, విద్వాంసులతోడను సంపర్కము గలదని తెలియుచున్నది. ఇచ్చట వారిలోని ముఖ్యులను పేర్కొని, వారితో నాతనికిఁ గల సంబంధము వాస్తవమో, లేక యర్వాచీనులచేఁ గల్పితమో విచారించెదను.

### తాతాచార్యులు

రామకృష్ణుని సమకాలికులలోఁ దాతాచార్యుల వారగ్రగణ్యులు. వీరిరువురినిగూర్చిన కథలు పెక్కు నేఁటికిని ఆంధ్రలోకమునఁ బ్రచారములో నున్నవి. కథలలో వచ్చు తాతాచార్యులు శ్రీకృష్ణరాయల మతగురువు. రాయలు వైష్ణవుఁ డని యందఱు నంగీకరించినను, తాతాచార్యులవారు రామరాజు కాలమున లేరని వాదించువారనేకులు కలరు. ఇట్టివారిలో నాంధ్రకవులచరిత్రకారులు మొదట నెన్నఁదగినవారు. వీరు తమ యభిప్రాయము నిట్లు విశదముచేసి యున్నారు: "రామకృష్ణునికి తాతాచార్యులవారితో సంబంధించిన కథ లనేకములు చెప్పుచున్నారు... ఈ తాతాచార్యులు మొట్టమొదట రామరాజు యొక్క రాజ్యాంత్యదశలోఁ దలయెత్తి, వైష్ణవమతమునం దత్యంతాభినివేశము గలవాఁ డయి తన శిష్యులయిన రాజుల చేత బలవంతముగా జనులను బట్టి చక్రాంకనాదులు చేయుచువచ్చెను." "రామకృష్ణకవి యప్పయదీక్షితుల వారితోను, తిరుమలతాతాచార్యులవారితోను సమకాలికుఁడయి చంద్రగిరిరాజగు వెంకటపతిరాయల ప్రభుత్వ కాలములో నుండినవాఁ డయినట్లు కొన్ని నిదర్శనము లున్నవి. ఈ వెంకటపతిరాయలు వసుచరిత్రమును కృతినందిన తిరుమలదేవరాయల యనంతరము తన రాజధానిని విజయనగరమునుండి చంద్రగిరికి మార్చుకొని క్రీ. శ. ౧౫౮౬-వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪-వ సంవత్సరమువఱకు రాజ్యముచేసినవాఁడు."*

కవిచరిత్రకారులు తాతాచార్యులను వేరొక వ్యక్తికి చెల్లు ననియు, నాతఁడు రామరాజు కాలమునను, అటుపిమ్మటను బ్రఖ్యాతివడసె ననియు భ్రమ జెందిన ట్లున్నది. అట్టి యభిప్రాయమునకు వారికాలమున నెడమున్నను, ఇప్పటి వాఙ్మయచరిత్ర పరిశోధకుల కెల్లరకును నది బిరుదనామ మనుట కరతలామలకమే. ఎందఱు లేని తాతాచార్యులఁ బేర్కొనవచ్చును; కాని యది పనిలేనిపని. కథల యందుఁ జెప్పునట్లు కృష్ణరాయల కాలమున నెవ్వరేనియు తాతాచార్యనామధారులు గలరేమో విచారించవలసినదే ప్రస్తుతకర్తవ్యము. తాతాచార్యుల నన్వేషించుచు నుదూరము పోనక్కఱలేదు. కృష్ణదేవాచ్యుతదేవరాయల కాలమున వారి యాస్థానమున నుండిన లీలావతీగ్రంథకర్త వల్లభాచార్య కవిదేవేంద్రుఁ డిట్లు పల్కియున్నాఁడు:

ఉ. "శ్రీనరసింహనందను న
రిందమవిక్రముఁ గృష్ణరాయభూ
జానిని వెండియుం దదను
జన్ముని నచ్యుతదేవరాయనిన్
దా నధికాప్తుఁడై కొలిచి
తద్దయు మన్ననఁగాంచి మించు వి

* ఆంధ్రకవుల చరిత్ర, పుటలు ౨౬౭-౬౮

ద్యానిధి బొమ్మలాటవిరు
పాధిపు కాళని ప్రార్థనంబునన్.

* * *

క. అని పొగడ గణకు తాతా
నన సంస్కృతభావ భాస్కరాచార్యులు చె
ప్పినపాటిగ లీలావతి
యొనర్తుఁ దెనుఁగున............

సీ. వరనరేంద్రనందనుఁడైన యచ్యుత
దేవరాయల కృపాదృష్టిఁ జేసి
ఆందోళికారూఢుఁడగు......బొమ్మ
లాటకాళుఁడు కేట్క వర్థరాశి
లో నాత్మగురునాథుఁడైన కుమార తా
తాచార్యవరుఁడైన కర్థ మిచ్చె
ద్విజులకు శేషతృతీయము ద్రెంచిడి
శేషపాదము కవిశ్రేణి కొసఁగె

గీ. స్నేహమునఁ దన చెలులకు శేషనవమ
భాగపంచక మంతయుఁ బంచిపెట్టెఁ
గవిమహేంద్రున కర్పించె మిగిలినట్టి
వేయునూటపదా ఱెంత విత్తరాశి." *

కావున నచ్యుతదేవరాయని కాలమున కుమార తాతాచార్యులను వైష్ణవగురు వుండెనని నిశ్చయమగుచున్నదికదా, నిజశిష్యుఁడగు బొమ్మలాట కాళనివలె నాతఁడును కృష్ణరాయని కాలమున సహితము నుండెననుటకు సందేహింపఁబనిలేదు. వైష్ణవశిఖామణులైన యా రాజసహోదరులకుఁ దాతాచార్యుఁడు గురువై యుండినను నుండవచ్చును.

## అప్పయ్య దీక్షితులు

తాతాచార్యులతోఁ గూడఁ బేర్కొనఁబడు నప్పయ్యదీక్షితులవారును రామకృష్ణుని సమకాలీనులని కొన్ని కథలు సూచించుచున్నవి. వైష్ణవులు తాతాచార్యుని గీర్తించుచు రాయనికడ కేఁగి యాచార్యులవారిని దీక్షితులకు పూర్వమే యర్చించవలయు నని కోరుచు

"అప్పయ్యదీక్షితా త్పూర్వం
తాతః పూజ్యో న సంశయః"

అని పల్కఁగా, రామకృష్ణుఁడు,

"ముఖప్రక్షాళనా త్పూర్వం
గుదప్రక్షాళనం యథా"

అని వారిని పరిహాసించెనని యొక గాథ కలదు. ఇది యసంభవము. అప్పయ్యదీక్షితుల ప్రత్యర్థి యగు తాతాచార్యుఁడు వేఱు. అతఁడు కోటికన్యాదానం లక్ష్మీకుమార తాతాచార్యుఁడు; ఆరవీటిరాజుల కుల గురువు. రామకృష్ణుని సమకాలీనుఁడు అచ్యుతరాయల కాలమున నుండిన కుమార తాతాచార్యుఁ డని పైన తెల్పియున్నాను. ఈకథ తాతాచార్యభేదము నెఱుఁగని యర్వాచీనులచేఁ గల్పితమైనట్లు తోఁచెడిని. ఇంతకంటె విశ్వసనీయమైన సాక్ష్యము లభ్యపడువఱకును అప్పయ్యదీక్షితులు రామకృష్ణుని సమకాలీనుఁడని తలఁచుట యుక్తము కాదు.

## అప్పళాచార్యులు

ఈ యాచార్యులవారు మహాపండితుఁడు; మహాప్రాజ్ఞుఁడు. శిష్యులు వీరి పాండిత్యప్రకర్షమును వెల్లడిచేయుచు,

"అపశబ్దభయం నాస్తి
అప్పళాచార్యసన్నిధౌ"

అని పల్క, దానిని సహించక రామకృష్ణుఁడు,

"అనాచారభయం నాస్తి
తిప్పనామాత్రస్య సన్నిధౌ"

అని వారిని తిరస్కరించెనని యొకకథను పెద్దలు చెప్పెదరు. ఈ కథయం దెంతసత్యమున్నదో నిర్ధారించుటకు వీలులేదు. కాని యప్పళాచార్యులు రామకృష్ణుని సమకాలీనుఁ డనుట యథార్థము. పాండురంగ కృతిపతియగు విరూరివేదాద్రిమంత్రి కీయాచార్యులవారు మతగురువు. ఈవిషయ మీ క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది:

"సీ. వేదమార్గప్రతిష్ఠాదైవతశ్రేష్ఠుఁ
డభ్యస్తమద్దర్శనార్థరాశి

* *Sources of Vijayanagar History*, P. 157.

* * *

* * *

వాధూలమునిచంద్రవంశవర్ధనమూర్తి
సకలదేశాచార్యనికరగురువు

తే. పట్టమేనుంగు శ్రీరంగపతికి నణ్ణ
గారిగర్భాంబురాశినీహారరశ్మి
పారసాహిత్యసర్వస్వశాస్త్ర చేటి
యాళవందారుకందాళయప్పగారు.

శా. తత్తాదృక్పృథివప్రభావనిధిఁ గం
దాళప్పగారిన్ దయా
యత్తస్వాంతు నితాంతశాంతియుతు లో
కాచార్యవర్యున్ సుధీ
చిత్తాంభోరుహభానుఁ గొల్చుచుఁ దదా
శీర్వాదలబ్ధోన్నతిన్
హత్తెన్ దాను విరూరిమంత్రిమణి వే
దాద్రీశుఁ డూర్వ్యక్రుదిన్." *

కందాళ అప్పలాచార్యులవారు సారంగతమ్మ కవికిఁగూడ గురువని తద్రచితమైన వైజయంతీవిలాసమునఁ జెప్పియున్నాఁడు:

క. "వందారుదాసజనతా
మందారు శ్వేదశాస్త్రమహితప్రజ్ఞా
బృందారకగురు మద్గురుఁ
గందాళాప్పలగురున్ జగద్ధితుఁ గొలుతున్"

తమ్మకవి గోలకొండసులతానగు మహమ్మదు శాహికి సమకాలీనుఁడు.

చ. "ఇనసమతేజులౌ నృపుల
నెల్ల మహమ్మదుశాహి యేలు నీ
యనుబడివాల్గు దుర్గముల
నేలిన యేలిక గోలకొండ త
ద్ఘనవగరస్థలిం గరిణి
కం బొనరించును దమ్మమంత్రి యా
జనపతి రమ్మ పొమ్మనఁ బ్ర
జల్లయవిట్ట గృహస్థు లౌనవన్" †

మహమ్మదుశాహి క్రీ. శ. ౧౫౮౧-వ సం. మొదలుకొని ౧౬౧౧-వ సం. వఱకును ప్రజాపాలన మొనరించెను. కావున తమ్మకవియు, వానిని గురువు కందాళాప్పలాచార్యులును, దక్షిణకాలీనులగు విరూరివేదాద్రి తెనాలి రామకృష్ణకవులును మహమ్మదుశాహి రాజ్యకాలమున నుండిరని కందుకూరి వీరేశలింగంపంతులుగారనియున్నారు. ‡

మఱియుఁ గందాళయప్పలాచార్యులవారే యేకశిలానగరప్రభువగు చిత్తాంబుఖానునియొద్ద నమాత్యుఁడుగ నుండిన యెనుముల పెద్దామాత్యుని తండ్రికిని పెదతండ్రికిని సహితము గురువు లని చరిగొండ ధర్మన్న తన చిత్రభారతమునఁ జెప్పియున్నాఁడు:

శా. "వందారువ్రజదోష మేఘపవనున్
వారాశిగంభీరు నా
నందాత్మున్ హరిపాదభక్తు నిఖిలా
మ్నాయజ్ఞు విశ్వంభరా
మందారక్షితిజాతమున్ నిగమస
న్మార్గప్రతిష్ఠాపరున్
గందాళప్పగురున్ వివేకనిధి లో
కఖ్యాతు వర్ణించుచున్.

క. ఆదేశికపదకమలము
లాదరమున హృదయమునిధి ననవరతంబున్
మోదమున నిల్పి శ్రీలల
నాధవునిఁ గొలుతురు నారనయు మాదనయున్." ¶

వీరేశలింగంపంతులుగారు చరిగొండ ధర్మన్న కాలము నిట్లు నిశ్చయించియున్నారు:

"ఎనిమిదవ యాశ్వాసాదియందలి యీక్రింది కృతిపతిసంబోధనపద్యమువలన నతఁడు (చిత్తాంబుఖానుఁడు) శ్రీరంగరాయని రాజ్యకాలములోని యొక మండలేశ్వరుఁ డని యూహింపఁదగియున్నది.

* పాండు. ౧-౨౭,౨౮

† వైజ. ఆ. ౧

‡ ఆంధ్ర కవులచరిత్ర, పుట ౨౬౯.

¶ చిత్ర. ౧: ౩౬-౩౭.

క. శ్రీరంగరాజసేవా
పారంగతహృదయ! కమలభవవంశపయః
పారావారసుధాకర!
మారసమానావతార మాదయపెద్దా!

మొదటి శ్రీరంగరాజు విజయనగరసంస్థానమును ౧౫౭౪-వ సం. మొదలుకొని ౧౫౮౫-వ సం. వఱకును పాలించెను. రెండవ శ్రీరంగరాజు ౧౬౧౪-వ సం.కు తరువాత రాజ్యమునకు వచ్చెను. ఈకవి యీ యిరువురు రాజులలో నొకరికాలమం దుండినందున పదునారవశతాబ్దముయొక్క యంతమునందో, పదునేడవ శతాబ్దముయొక్క యాదియందో యుండియుండె ననుటకు సందేహము లేదు. ఇదిగాక కవియొక్క కాలమును నిర్ణయించుటకు గ్రంథమునందే యింకొక యాధారము కనఁబడుచున్నది. కృతినాయకుని వంశమును వర్ణించుచు కందాళప్పళాచార్యులు కృతిపతియొక్క తండ్రికిని పెదతండ్రికిని గురువైనట్లు ...చెప్పియున్నాఁడు.

... ... ...

...ఈ చిత్రభారతకృతిపతియు పాండురంగమాహాత్మ్యకృతిపతికాలములోనివాఁ డయిన ఏకగురుశిష్యత్వమువలనఁ దేటపడుచున్నందున ఈగ్రంథకవి యించుమించుగా తెనాలిరామకృష్ణుని కాలపువాఁడే."*

వీరేశలింగంపంతులుగారిచే నిట్లు నిర్ణీతమైన చరిగొండ ధర్మన్న కాలము నెల్ల రంగీకరించిరి. మానవల్లి రామకృష్ణకవిగారు తమచే నిర్ణయింపఁబడిన తెనాలిరామకృష్ణుని కాలమునకు పైసిద్ధాంతము విరోధించుటచేత పరస్పరవిరుద్ధములైన కాలనిర్ణయసిద్ధాంతముల నిట్లు సమన్వయించుటకుఁ బ్రయత్నము సల్పిరి.

"మఱియుఁ, క్రీ. శ. ౧౫౪౬ పరాభవసంవత్సరమున గండికోటప్రభువు కందాళయప్పళాచార్యునకు భూదాన మిచ్చినట్లు భూదానశాసనము గలదు...వైష్ణవాచార్యులయొద్ద ముద్రాధారణమును గైకొనువా రెల్లరు వారలకు శిష్యులే. ఈ వ్యాసమునఁ జూపిన శిష్యులెల్లరు ముద్రాంకనశిష్యులు కాని విద్యాశిష్యులు కారు. కావున బాలగురువులయొద్ద వృద్ధశిష్యు లుండవచ్చును" †

అప్పళాచార్య నామధారియగు వైష్ణవగురు వొకఁడేయని తలఁచి కవిచరిత్రకారులు తెనాలి రామకృష్ణుఁడు, సారంగుతమ్మయ, చరిగొండధర్మన మొదలగువారి నెల్లరను సమకాలికులని వాదించిరి. వీరి యభిప్రాయమే సరియైన దని యందఱు నంగీకరించిరి. కాని, అప్పళాచార్యనామ మన్ని నామములవలెనే యొక్కరి కాణాచి కాదు. భిన్నకాలములం దప్పళాచార్యులను భిన్నపురుషు లుండియుండవచ్చును. వారు మతగురువులు కావచ్చును. ఈయూహ నిరాధారము కాదు. దీనిని నిరూపించుటకుఁ బూర్వము చిత్రభారత కృతిపతి పెద్దామాత్యుని కాలమును నిర్ధారించుట యావశ్యకము. ఇతఁడును, నితని నేలిన దొర చిత్తాంబుఖానుఁడును క్రీ.శ.౧౬-వ శతాబ్దాంతముననో, లేక పదునేడవ శతాబ్దారంభముననో యుండిరను సిద్ధాంత మంగీకరింపఁదగినది కాదు. 'శ్రీరంగరాజసేవా పారంగతహృదయ' అను పద్యమునఁ జేర్కొనఁబడిన శ్రీరంగరాజు విజయనగరరాజనియు, చిత్తాంబుఖానుఁ డాతనిక్రింది మాండలికుఁడనియు వీరేశలింగముగారు నుడివిరి. ఇది యొప్పిదము కాదు. చిత్తాంబుఖానుని రాజధాని యేకశిలాపుర మను నోరుగల్లు. ఇది యిప్పటి నైజాము రాష్ట్రమున నున్నది. విజయనగర రాజుల యధికార మీప్రాంతముల నెప్పుడును చెల్లియుండలేదు. కావున నేకశిలాపురప్రభువగు చిత్తాంబుఖానుఁడు శ్రీరంగరాయలకు లొంగియుండిన మండలేశ్వరుఁ డనుట తప్పు. మఱియు 'శ్రీరంగరాజసేవా పారంగతహృదయుఁ'డు కృతిపతియగు పెద్దామాత్యుఁడు గాని యతని నేలిన రాజగు చిత్తాంబుఖానుఁడు గాఁడు. మఱియుఁ జిత్రభారతమున షష్ఠాశ్వాసాదులయందు విష్ణుదేవుఁడు పేర్కొనఁబడియున్నాఁడు. అట్లే అష్టమాశ్వాసారంభపద్యములోని శ్రీరంగరాజును దేవుఁ డనియే తలఁచెదను. కావున చరిగొండధర్మనకాలమును నిర్ణయించుటకుఁ బంతులవా రవలంబించిన మార్గము సరియైనది కాదు.

---

* ఆంధ్రకవులచరిత్రము, పుట ౨౮౦

† ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1914) పుట ౧౦౨.

శా. శ. ౧౪౨౬ నకు సరియైన క్రీ. శ. ౧౫౦౪-వ సం. నాఁటి శాసనము ఓరంగల్లుకోటయం దొకటి కలదు.* ఇందు చిత్తాప, లేక సిత్తాపఖానుఁ డనునొక రాజుయొక్క వంశమును, దిగ్విజయములను వర్ణింపఁ బడినవి. మఱియుఁ గృష్ణదేవరాయలవారు కొండవీడు కొండపల్లి దుర్గముల నాక్రమించి, తెలింగాణమార్గమునఁ గళింగముపై నెత్తిపోవునపుడు మార్గమధ్యమున చిత్తాపఖానుఁడు సైన్యసమేతుఁడై వచ్చి కనుముల నరికట్టఁగా రాయ లాతని నిర్జించి పాఱఁదోలె నని రాయవాచకమునం దున్నది. † ఈ చిత్తాపఖానుఁడు కంబంమెట్ట యోరుగల్లు మొదలగు పట్టణముల కధిపతి యనియు, కళింగగజపతులకు మిత్రుఁ డనియు, నాతని క్రీ. శ. ౧౫౦౪-వ సం. ప్రాంతమున గోలకొండసురకరాజ్యదీయచరిత్రకారులు వ్రాసియున్నారు. ‡ కావున క్రీ. శ. ౧౬-వ శతాబ్ద ప్రథమపాదమునం దోరుగల్లునం దొక చిత్తాపఖానుఁడు రాజ్యము సేయుచుండె నని నిశ్చయముగ చున్నది.

ఇఁక ఈచిత్తాపఖానుఁడే చిత్రభారతకృతిపతి యైన ప్రభువగు చిత్తాంబుఖానుఁ డగునేమో విచారించ వలసియున్నది. ఈ విషయము ఓరుగంటి శాసనమునందును, చిత్రభారతమునను జెప్పఁబడిన చిత్తాప-చిత్తాంబుఖానుల వృత్తాంతములను బోల్చిచూచిన దేలఁగలదు.

చిత్తాపఖానుని వలెనే చిత్తాంబుఖానుఁడును భోగివంశజుఁడు; మానవపతితనూజుఁడు; ఏకశిలాపురాధినాథుఁడు. పాంచాలరాయస్వామియందలి భక్తి ఇద్ద

| | శాసనము | చిత్రభారతము |
|---|---|---|
| 1. వంశము | భోగివంశము ... | భోగివంశము |
| 2. రాజధాని | ఏకోపల, లేక ఏకశిలాపురి ... | ఏకశిలాపురి |
| 3. తండ్రిపేరు | మానయ, లేక మానవపతి ... | మానవభూపాలుఁడు |
| 4. పేరు | చిత్తాపఖాన, సిత్తాపఖాన ... | చిత్తాంబుఖానుఁడు |
| 5. ఇష్టదైవము | పాంచాలరాయస్వామిని పునరుద్ధారణము గావించెను ... | పాంచాలివిభుఁడు (విష్ణువు) సంతసమున నేకశిలాపురమున వెలయుచుండెను. చిత్తాంబుఖానుఁడు ఆ జగన్నాథునికృపచే లబ్ధమైన మధ్యదేశముపై రాజ్యము సల్పుచుండెను. |

స్థాపకుఁడగు కుర్లీకుతుబుషాదుషా పరాభూతునిఁ గావించి పైపట్టణముల నొడిచికొనె ననియు మహమ్మతీయులకు సమానమే. కావున చిత్తాప, లేక సిత్తాపఖానుఁడే చిత్తాంబుఖానుఁ డనుట సంగతముగును. పై యోరుగంటిశాసనము క్రీ. శ. ౧౫౦౪ నాఁటిది కావున చిత్తాంబుఖానుని యమాత్యుఁడగు రెమ్ములపల్లి పెద్దనయు నప్పటివాఁడే కావలయును. ఈపెద్దనయొక్క తండ్రికిని, పెదతండ్రికిని గురువైన కందాళ అప్పలాచార్యులవా రంతకుపూర్వమున, ననఁగా క్రీ. శ. ౧౫-వ శతాబ్దాంతిమవర్షములయం దుండె నని దృఢముగఁ జెప్పవచ్చును.

* *Memoires of the Hyderabad Archaeological Department No. 9.*

† రాయవాచకము ఆం. ప. ప్రకటన పుట ౯౪.

‡ బ్రిగ్సు-ఫెరిష్టా, సం. 3, పుట 3౬౦-3౬౪

పైఁజెప్పిన విషయముల నన్నిటిని సమకూర్చి యోచించఁగాఁ గందాళెఅప్పళాచార్యు లను పేరు గల వైష్ణవగురువు క్రీ. శ. ౧౫ వ శతాబ్దాంతమున ఎనుముల పల్లి నారనమాదనలకును, దరువాత ౧౬-వ శతాబ్ద పూర్వార్ధమున విరూరి వేదాద్రిమంత్రికిని, కడపటఁ దచ్ఛతాబ్దాంతమున గోలకొండకరణము సారంగుతమ్మయకును రామానుజమతతత్త్వమును బోధించుచుండె నని తేలుచున్నది. భిన్న దేశజులును, భిన్న కాలికులును నగు వీరందఱకిని వైష్ణవమతమును బోధించుచుండిన యప్పళాచార్యుఁ డేకవ్యక్తియా, కాక ఏకనామ ధారులగు భిన్నపురుషులా అను విషయములు విచారణీయములు. దాదాపు నూఱేండ్లకు మించిన కాలమున ననిమెలయందును, నోరుగల్లు గోలకొండలలోను మత ప్రచారము గావించుచుండిన యప్పలగురు వేక పురుషుఁ డని నమ్ముటకు సాధ్యము గాకయున్నది. క్రీ. శ. ౧౫-వ శతాబ్దాంతమున నుండిన యప్పళాచార్యుఁ డొకఁడు; ౧౬-వ శతాబ్దపూర్వార్ధమున నుండినవాఁడు మఱియొకఁడు; తచ్ఛతాబ్దాంతిమవర్షంబుల నున్న యాతఁ డింకొకఁడు. ఇట్లు అప్పళాచార్యనామాంకితులు ముగ్గురు గురువు లుండియుందు రని తోఁచుచున్నది. ఈతలఁపు కేవలము నిరాధారము కాదు. దీనిని స్థిరపఱచుటకు శాసనరూపమైన సాక్ష్యము కొంత కలదు. శా. శ. ౧౪౧౬ ఆనందనామసంవత్సరమునకు సరియైన క్రీ.శ.౧౪౯౪-వ సం.నఁ దిరుమలదేవాలయస్థానంవారు పంకయచ్చెల్లి-తిరునందన వనమునకు నధికారియగు కేల్వి రామానుజజియ్యరువారి పేరఁ జెక్కించిన శాసనమున నదరుజియ్యరువారి ఆచార్యులవారు కందాడై అప్పన్ గారు పేర్కొనఁబడి యున్నారు*

ఈ శాసనమూలమున క్రీ. శ. ౧౫-వ శతాబ్దాంతమున, ననఁగా నెనుములపల్లి పెద్దామాత్యునియొక్క తండ్రి పెదతండ్రుల కాలమున కందాళాప్పళాచారుఁలను ఆచార్యపురుషు లుండిరని నిశ్చయమగుచున్నది. ఈ యప్పళాచార్యులవారే పెద్దామాత్యుని తండ్రి పెదతండ్రుల గురువైనను కావచ్చును.

మఱియు మానవల్లి రామకృష్ణకవిగారు గండికోట ప్రభువులలో నెవ్వరో యొకరొక కందాళాప్పళాచార్యులకు క్రీ. శ. ౧౫౪౨-వ సం. న పేదోదానము చేసినట్లు వ్రాసియున్నట్లు ఇంతకుఁ బూర్వము తెల్పియున్నాను. ఈశాసన మెచ్చటిదో వారు చెప్పలేదు; కాని యాకాలమునఁగూడ అప్పళాచార్యులనుగురు వొకరుండిరాయను సందేహమున కెడములేదు. పైఁజెప్పిన తిరుమల దేవస్థానశాసనములందే శా. శ. ౧౪౩౮ ధాతు నామ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౫౧౬ సం॰ నాఁడు తిరుమలస్థానమువారు తిరువెంకటనాథుని పూలతోఁటకధికారియగు కేల్వితిరువెంకటనాథ జీయరు పేర గోవిందరాజస్వామిగుడియందుఁ జెక్కించిన శిలాశాసనమున నొక కందాడై అప్పన్ పేర్కొనఁబడియున్నాఁడు. † ఇంతకంటె ముఖ్యమైన శాసనము మఱియొకటి తిరుమల దేవస్థానం మూఁడవ ప్రాకారపు పడమటిప్రక్కగోడమీఁదఁ జెక్కఁబడియున్నది. ఇది శా. శ. ౧౪౪౧ వికారినామ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౫౧౯-వ సం. న అప్పాగారి శిష్యుఁడును, మహైకునియునిస్థాన్ పూఁదోఁటపై నధికారియు నగు తిరువెంకటయ్య పేరఁ దిరుమలదేవస్థాన ధర్మకర్తలచేత తిరుమలదేవాలయపు మూఁడవప్రాకారపు పడమటిగోడమీఁదఁ జెక్కఁబడినది. ఇందు "మీయాచార్యులవారైన కందాడై అప్పాఅయ్యగారి జన్మనక్షత్రమగు ఆవణిమాసమందలి భరణినక్షత్రమున పెద్దపెరుమాళ్లకు ౨ పరుప్పోడియలులను ౧ మనోహరపడిని నివేదనసేయుటకును..." అనువాక్య మీసందర్భమున గమనించఁదగినది.‡ ఇదిగాక గోవిందరాజస్వామియాలయములోని శా. శ. ౧౪౬౬ క్రోధినామసంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౫౪౪-వ సం.నాఁటి యొక శాసనమున, ప్రసాదగ్రహీతలయందు కందాడై అప్పయ్యంగారొకరుఁ డైనట్లు చెప్పియున్నది‖ ఇందువల్ల క్రీ. శ. ౧౫౪౪-వ సం.న నొక అప్పళా

---

* తిరు. దే. శా. సం. ౨, పుట ౨౬౩.

† తిరు. దే. శా. సం ౩, పుట ౨౨౪.

‡ తిరు. దే.శా.సం. ౪, పు. ౨౪౫-౬.

‖ తిరు. దే. శాసననివేదిక, పుట౩౦౪.

చార్యు లుండిరనుట నిశ్చయము. ఈకందాళైఅప్పయే విరూరివేదాద్రిమంత్రియొక్క గురు వని శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రులుగారనుచున్నారు. కావచ్చును. ఈ యాచార్యులవారే గురువరాజు పెదసంగరాజు యొక్క కడగొట్టు మేనల్లుఁడైన కొండ్రాజు చినతిమ్మయ రాజునకు గురువు. శా. శ. ౧౪౬౮ పరాభవనామ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౫౪౬-వ సంవత్సరమున నీతిమ్మరాజు తన గురువుగారికి చెన్నూరు సీమలోనికి యణకువయైన తూగుట్లపల్లెను దానము చేసినట్లు కడపజిల్లా జమ్మలమడుగుతాలూకా దేవిగుడి గ్రామములోని తల్లకంచేశ్వరీదేవి యాలయమున కెదుట నున్న యొక శిలాశాసనమందుఁ జెప్పియున్నది.* శా. శ. ౧౪౬౯ ప్లవంగనామసంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౫౪౭ వ సం. నాఁటిశాసనమునం దొక దానియందు వాధూలగోత్రజుఁడును, యజుశ్శాఖాధ్యాయియు, నాపస్తంబసూత్రుఁడును నగు కందాళై అప్పలాగారి పుత్రుఁడైన యప్పగారు శ్రీ వేంకటేశ్వరుల అమృతపడికి నగరిసీమలోని పుణ్యం గ్రామమున నర్ధభాగమును దానముచేసినట్లు చెప్పియున్నది.† ఈశాసనము, కందాళైఅప్పళాచార్య నామధారులు ఆచార్యపురుషు లిద్ద రుండిరనియు, వారు పితాపుత్రు లనియు స్పష్టముచేయుచున్నది. వీరి యందు తండ్రి యెనుములపల్లి నారయమాదయలకును, కుమారుఁడు విరూరివేదాద్రికిని గురువులై యుండురని తలఁచుచున్నాను. ఇఁక సారంగుతమ్మయ్యగారి గురువగు కందాళైఅప్పళాచార్యు లొకరు మిగిలియున్నారు. వీ రెవ్వరో కనఁగొనుటకుఁ దగిన సాధనము లింకను దొరకలేదు; కాని వారు పైఁజెప్పఁబడిన ఇద్దరు అప్పళాచార్యులకంటె భిన్నులని నా యభిప్రాయము. భావిపరిశోధనవల్లఁగాని నిజము బైటఁబడదు.

## భట్టరు చిక్కాచార్యులు

ఈయాచార్యులవారు రామకృష్ణునికి వైష్ణవ మతమును ప్రసాదించిన గురువు. తన గురుమూర్తియైన యీ యాచార్యులవారిని రామకృష్ణుఁ డిట్లు కొనియాడియున్నాఁడు:

క. "వాక్కాంతాశ్రయభట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్యకళాకలాప మీడేరుటకున్." ‡

రెట్టమతకామందకములఁ గృతిగొన్న కొండ్రాజు వెంకటరాజును చిక్కాచార్యుల శిష్యుఁడే.

క. "శ్రీ చంచద్భట్టరుచి
క్కాచార్యవరశిష్య యతులితశౌర్య
ప్రాచుర్యవర్యగుణర
త్నాచల జయలలితధైర్య నయతత్త్వనిధీ" ¶

తెనాలి రామకృష్ణుఁడును, గొండ్రాజు వెంకటరాజును నొక్క చిక్కాచార్యుల శిష్యులనుకొనరా యను విషయము విచారణీయము. భట్టపరాశరుని వంశమున చిక్కాచార్యనామధేయము లిరువురు గలరు. "తంజాపురీ నాథుఁడగు విజయరాఘవుని సభలో నుండిన శేషము తిమ్మకవి తన యంబరీషచరిత్రమున భట్టపరాశరుని పుత్రుఁడు చిక్కభట్టరనియు, నతని పుత్రుఁడు రంగనాథదేశికుఁ డనియు, నతని కుమారుఁడు చిక్కభట్టరనియు, మరల నతని పుత్రుఁడు రంగనాథుఁడు తన గురు వనియు వ్రాసికొనిరి" § అని తమ 'తెనాలికవుల' వ్యాసమున రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. తంజావూరు సరస్వతీ పుస్తకభాండాగారమువారిచేఁ బ్రకటింపఁబడిన 'తెలుఁగు పుస్తకముల డిస్క్రిప్టివ్ క్యాటలాగు'నందీ యంబరీషోపాఖ్యాన ప్రతికలోఁ జాలభాగము ముద్రితమైయున్నది. అందు శేషము తిమ్మకవి తంజావూరి విజయరాఘవుని యాస్థానమున నుండెననుట కేయాధారమును గానరాదు. మఱియు రామకృష్ణకవిగారిచే నుటంకిత

* *Mac. Mss.* 15-3-60

† తిరు. దే. శాసననివేదిక, పుట ౨౯౫.

‡ పాండు. ౧-౧౭.

¶ కామందకము, కృతిపతిసంబోధనము.

§ ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1914), పుట ౧౦౦.

మైన భట్టపరాశరుని వంశవర్ణనయుఁ గన్పట్టును. శేషము తిమ్మన యొకచోట 'పరాశరభట్టరాఖ్యఘనకులచ్ఛాత్రుఁడ' ననియు, నింకొకచోట 'పరాశరకుల భట్టజలధి రాకాశశాంక చిక్కయాచార్యనందన రఘునాథదేశిక పాదారవిందేందిందిరాయమానమానసుఁ'డ ననియుఁ దెల్పియున్నాఁడు. రామకృష్ణకవిగారు పీఠికను సంపూర్ణముగఁ దిలకించి పైయంశముల నందుండి సంగ్రహించియుండవచ్చును. వా రిచ్చిన వంశావళిలోనే చిక్కాచార్యులకుఁ దెనాలి రామకృష్ణుఁడును, కొండ్రాజు వెంకట్రాజును శిష్యులయ్యుండురేమో కనుఁగొనవలసియున్నది. ఇందు కొక సాధన మగపడుచున్నది. చరిగొండధర్మన ౧౬-వ శతాబ్దారంభమున నుండిన చిత్రాపఖానునిసమకాలికుఁ డని తెల్పియున్నాను. ఇతఁడు తాను 'శ్రీ రంగధామసదృశ భట్టపరాశరప్రభు రంగగురు పాదనీరజబంభర నిర్మలాత్ముఁ'డ నని చెప్పుకొనియున్నాఁడు. * ఈ రంగగురువు రామకృష్ణకవిగా రిచ్చిన వంశవృక్షములోని ప్రథమ చిక్కాచార్యుల పుత్రుఁడును, ద్వితీయ చిక్కాచార్యుల తండ్రియు నై యుండవలయును. చిత్రాపఖానుని యోరుగంటి శాసనమును, చరిగొండధర్మన చిత్రభారతమును నీరంగగురువు క్రీ. శ. ౧౫౦౪-వ సం. ప్రాంతమున నుండెనని రుజువుచేయుచున్నవి. ఇతని పుత్రుఁడు ద్వితీయ చిక్కాచార్యులు క్రీ. శ. ౧౫౩౦-౪౦ల ప్రాంతమున నుండె నని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. కామందక కృతిపతియగు కొండరాజు వెంకటాద్రిరా జీచిక్కాచార్యునకే శిష్యుఁ డగుట నిక్కమేని యయ్యాచార్యుఁడు చిరకాలము జీవించియుండె నని యూహించవలసి యున్నది.

## ౪

ఇంతవఱకును రామకృష్ణుని సమకాలికులగు మతగురువుల కాలము నించుక చర్చించితిని. అప్పయ్య దీక్షితులవారు రామకృష్ణుని కాలమువా రనుటకుఁ దగిన యాధారములు లేవని తెల్పితిని. తక్కిన ముప్వురును క్రీ. శ. ౧౫౩౦,౧౫౪౦ ప్రాంతమున వెలసిరని నిరూపించితిని. కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౩౦-వ సం. పర్యంతము రాజ్యముచేసియుండుటచేత వా రా రాయలకాలమున నుండిరనుట వాస్తవమునకు దూరము గాఁజాల దనియు, వారితో రామకృష్ణుని సమకాలికత యా రాయలతోడి యాతని సమకాలికతకు విరుద్ధము కాదనియుఁ దెలియపఱచితిని. ఇఁక రామకృష్ణుని బంధువులును, సహచరులును, ప్రత్యర్థులును నగు కవీంద్రులు కొందఱి విషయమై చర్చించవలసియున్నది.

### తెనాలి అన్నయ్య

ఇందు మొదటివాఁడు తెనాలి అన్నయ్య. ఇతఁడు రామకృష్ణుని కడపటితమ్ముఁడు. స్వవిరచిత కావ్యములలో నీయన్నదమ్ములు దమ బంధుత్వమును జెప్పుకొనకపోయినను దీనిని నిర్ధారణచేయుటకుఁ దగిన సాక్ష్యము కొంత వానియందే కానవచ్చుచున్నది. మఱియు వీరితోఁబుట్టువైన శ్రీగిరికవియొక్క మనుమఁడగు తెనాలిరామభద్రకవి తన ఇందుమతీపరిణయమున నీవిషయమును విశదపఱచియున్నాఁడు. తెనాలికవుల పరస్పరబాంధవ్యమును దెల్పు వంశముల నన్నిటినిఁ గ్రోడీకరించి మానవల్లి రామకృష్ణకవిగారును, వేటూరి ప్రభాకరశాస్త్రిగారును జక్కఁగఁ జర్చించియున్నారు. ఆచర్చ నిచట మరల సాగించుట యనవసరము; కాని అన్నయకాలమునుగూర్చి ఇంకను గొంత విచారణ కవకాశము కలదు.

అన్నయ తాను రచించిన సుదక్షిణాపరిణయమనుకావ్యమును ఆరవీటికోనేటితిమ్మరాజుకొడుకగు రామరాజునకు మంత్రియైన పులిజాలరామవిభుసోమామాత్యున కంకితమిచ్చెను. కృత్యాద్యవతారికయందు వర్ణింపఁబడిన యారవీటివంశావళి ననుసరించి కందుకూరి వీరేశలింగంపంతులుగా రిట్లు వ్రాసియున్నారు:

"ఆర్వీటిబుక్కరాజుకొడుకు రామరాజయినట్టును, రామరాజుకొడుకు తిమ్మరాజయినట్టును, తిమ్మరాజుకొడుకు చినకొండరాజయినట్టును, చినకొండరాజుకొడుకు కోనేటి తిమ్మరాజయినట్టును చెప్పఁబడెను. ఈకోనేటి తిమ్మరాజుకొడుకైన రామరాజువద్దనే కృతిపతియైన సోమనామాత్యుఁడు

* చిత్ర. ౧-౧౭.

మంత్రిగా నుండెను. పైని జెప్పిన వంశావళినిబట్టి విచారించఁగాఁ గృష్ణదేవరాయల యల్లుఁడైన రామరాజున కీరామరాజు పెదతండ్రికొడుకునకు మనుమఁడైనట్లుస్పష్టమగుచున్నది. అళియరామరాజు ౧౫౬౫-వ సంవత్సరమువఱకు జీవించి యాకాలమునకే మనుమల నెత్తినవాఁ డగుటచేత వారని పెదతండ్రికొడుకునప్పటికే యెదిగిన మనుమలు గలవాఁడయి యుండవచ్చును. కాఁబట్టి విమర్శించి చూడఁగా సుదక్షిణాపరిణయకృతీశ్వరుని ప్రభువు పదిసంవత్సరముల కీవలావలగా ౧౫౭౦ వ సంవత్సర ప్రాంతమున నుండె నని తేలుచున్నది. ఇదియే కవికాలము."*

పంతులుగారు కవులచరిత్రము వ్రాయునప్పుడు వలయు సాధనములు లభ్యపడకుండుటచే నీ డొంక తిరుగుడుపద్ధతి నవలంబించిరి. ఇప్పుడు ఆరవీటిరాజుల శాసనము లనేకములు బయలుపడినవి. వానిమూలమున సుదక్షిణాపరిణయకృతిపతియొక్క కాలమును,తన్మూలమున కవియొక్క కాలమును కనుఁగొనుట కవకాశము కలిగినది. కృతిపతి నేలిన ప్రభువుయొక్క తండ్రియగు కోనేటితిమ్మరాజు క్రీస్తుశకము ౧౬-వ శతాబ్ద మధ్యకాలమున నుండెనని శాసనములవల్ల తెలియవచ్చుచున్నది. శా. శ. ౧౪౬౬ క్రోధిసంవత్సరమునాటి శాసన మొకటి హంపివిఠ్ఠలేశ్వరాలయమునఁ గానవచ్చుచున్నది.† మఱియొకటి శా. శ. ౧౪౭౧-వ సంవత్సరమునకు సరియైననలసంవత్సరమునాఁటిది నెల్లూరుజిల్లాయందలి యాత్మకూరునందుఁ గాన్పించుచున్నది.‡ వీని మూలమునఁ గోనేటి తిమ్మరాజు సదాశివరాయల రాజ్యారంభకాలమున నుండెనని నిశ్చయమగుచున్నది. అతని కుమారుఁడు రామరాజుగూడ క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతముల నుండియుండు ననుమాట పొసఁగుచున్నది.

ఈసందర్భమునఁ జింతించఁదగినయంశ మింకొక్కటి కలదు. అన్నయ్య తన విద్యాగురువు కందాళ భావనాచార్యుల కుమారుఁడగు శ్రీ రంగాచార్యుల వా రని చెప్పికొనియున్నాఁడు. ఈ శ్రీరంగాచార్యులవారే నారసింహపురాణకృతిపతియగు ప్రోలుగంటి రంగనకును సైతము గురువు. ఈ విషయము నారసింహపురాణకృత్యాదియందలి యీక్రిందిపద్యమువలన విశదమగుచున్నది:

సీ. "గురుతర వాధూలగోత్రాన్వయాంభోధి
 పూర్ణిమాచంద్రుఁడై పొలుపుమీఱె
వైష్ణవాచార్యకోటి సకలదుర్మదఘోర
 గహనధూమాంకుఁడై కణఁకమించె
శిష్యకదంబక చిరతరసంపత్తి
 వితరణఖ్యాతిచే వృద్ధిఁబొందె
శ్రీవేంకటాచలశిఖరమందిర దేవ
 తా పరమూర్తియై యవతరించె
జగతిఁ గందాళ భావనాచార్యవర్య
తనయుఁ డయ్యె గురుస్వామి ఘనత కెక్క
నట్టి శ్రీరంగగురునాథుఁ డాత్మగురుఁడు
గాఁగ సన్నుతిఁ బడసె రంగప్రభుండు." §

ఈప్రోలుగంటి రంగన క్రీ. శ. ౧౫౪౦-౧౫౫౦ల ప్రాంతమువాఁడగుటచేత అతనిగురువైన రంగాచార్యులవారును నప్పటివాఁడై యుండవలయును. ఈయూహ సరియైనదని తిరుమలదేవస్థానమునందలి శా. శ. ౧౪౬౭ విశ్వావసునామ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౫౪౫-వ సం. నాఁటి శిలాశాసనము తెల్పుచున్నది. ఇందు కందాడై అప్పావణ్ణనుయొక్కయు, వారి కుమారుఁడగు అప్పకొయొక్కయు జన్మనక్షత్రములయందు శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నైవేద్యము నొసఁగుటకుఁగాను వీరి జ్ఞాతులైన కందాడై భావనాచార్యుల పుత్రులగు శ్రీ రంగాచార్యులవా రొనర్చిన యేర్పాటులు ప్రకటింపఁబడియున్నవి. ఈ శాసనమువల్ల తెనాలియన్నయకు గురువైన కందాళ శ్రీరంగాచార్యులవారు క్రీ. శ. ౧౫౪౫ ప్రాంతముల నుండెనని స్థిరమగుచున్నది. అన్నయ్యయు నప్పటివాఁడని నిశ్చయముగఁ బల్కవచ్చును. అన్నయరే ౧౫౪౫-వ సం.

* ఆంధ్రకవులచరిత్ర, పుట ౩౨౨.

† MER 12 of 1904.

‡ Nellore Inscriptions I. A. 16.

§ నార. ౧-౫౯.

\$ భారతి సం. ౧౮, పుటలు ౧౭-౨౮.

ప్రాంతమువాఁడైన నాతని పెద్దన్నయగు రామకృష్ణుఁ డప్పటికి ప్రఖ్యాతికెక్కినవాఁడై తన పాండురంగ మాహాత్మ్య మును క్రీ. శ. ౧౫౪౩-౪ వ సం. ప్రాంతమున నుండిన మంగయగురువరాజు తొమ్మండుగురు పుత్రులలో జ్యేష్ఠుఁడగు పెదసంగభూపాలుని ప్రాయపువాఁడైన విరూరివేదాద్రి కంకితముసేఁగా ననుట యసంగతము గాఁజాలదు.

## రాఘవమనీషి.

రెండవవాఁడు రాఘవమనీషి. ఇతఁడు హరిభట్టు కుమారుఁడు; తండ్రిచే విరచితమైన నారసింహపురాణ మును అతని మరణానంతరము నంబెల నరసింహరాజు పుత్రుఁడగు కొండవీటి దినయాబళేరాజుయొక్క మంత్రి యైన రంగమంత్రి కంకితముసేఁగెను. ప్రోలుగంటి రంగన క్రీ. శ. ౧౫౪౦, ౧౫౫౦ సం. ల మధ్యకాలమున పై కొండవీటియాబళేరాజుకడ మంత్రిగ నుండెనని స్థలాంతరమున నిశ్చయించియున్నాను. * రాఘవమనీషి రచియించిన నారసింహపురాణ కృత్యాద్యవతారిక యందు రంగమంత్రి కీర్తిని వర్ణించు నీక్రిందిపద్యము గానవచ్చుచున్నది:

"ఉ. రంగనివాసనిర్మలన
రం గని పంకజనాభపుత్రుఁడా
రం గని యభ్రవాహినిరె
రం గని పాండ్రలసత్సుధాసుధా
రం గని సత్ప్రభాసురుచి
రం బగు శ్వేతవరాహమూర్తితో
రం గని ప్రోలుగంటిపురి
రంగనికీర్తి హసించు నిమ్మహిన్."

దీనిఁ గాంచినవెంటనే తెనాలిరామలింగని దని ప్రఖ్యాతిపడసిన యీక్రిందిచాటు వెల్లరకును స్మరణకు రాఁగలదు.

"ఉ. లింగనిసిద్ధుఁ గల్వలచె
లిం గని మేచకకంధరుం డ్రిశా
లిం గని సంగశాలి లవ
లిం గని కర్దమమూషిత నృత్యణా
లిం గని కృష్ణచేలుని హ
లిం గని నీలకచాళి విధాతృనా
లిం గని రామలింగకవి
లింగనికీర్తి హసించు దిక్కులన్."

ఈపద్యములయం దొకదానిని మేలుబంతిగాఁ గొని మఱియొకదానిని రచించిన ట్లున్నది. ఇందు మేలుబంతి యెద్ది, యనుకరణ మెద్ది యను విషయము విచారణీయము. రాఘవమనీషి నారసింహపురాణ పీఠికఁదప్ప యన్యగ్రంథములను రచించిన ట్లగపడదు. ఇతఁడు గ్రంథకర్త యన్న ప్రతీతియు లేదు. కావున రామకృష్ణుని చాటువును మాదిరి యటువంటి పద్యమునే రచించి స్వవిరచిత నారసింహపురాణపీఠిక యందు గూర్చుకొనె ననునూహ పొడముచున్నది. మఱియు నారసింహపురాణమునకును, పాండురంగ మాహాత్మ్యమునకును కొన్నియెడల పోలిక లగపడుచున్నవి. పాండురంగమాహాత్మ్యము చతుర్థాశ్వాసమున వర్షారంభమును వర్ణించు నొక సీసపద్యము గలదు:

సీ. "ధళధళదుదుక్కున నింగిఁ దాటించెఁ బలుమారు
నీరాళ్ల గొందిఁ గన్నియ మెఱుంగు
హాల స్తప్రపవనసంపాతజాతశ్రీతి
నివిరిన మ్రాఁకుల కెలమి వచ్చెఁ
బ్రథమౌదబిందుసంభారంబు మందుమా
నిత యయ్యెఁ బగిలిన నేలమేని
కులుకు మంకురపాళియును బోలెఁ గనుపించెఁ
దోరంపుమణుల విదూరభూమి " †

ఈ పద్యమును వర్షోదయమునే తెల్పు నీక్రింది నారసింహ పురాణపద్యములతోఁ బోల్చి చూడుఁడు:

సీ. "ప్రోసుపైచిన పద్మరాగఖండంబుల
గతి నింద్రగోపసంఘములు దనరె
గరుడపచ్చలడాలు గన్నగిటఁగఁజాలు
లేఁతపచ్చిక పిసాళించి మించె
నీశానదిగ్వ్యాసముకోశంబు లొకకొన్ని
భంజళిగతుల విభ్రమము చూపె

---

* భారతి సం. ౧౮. సం. ౨. పుట ౨౪

† పాండు. ౪-౨౧.

ప్రథమోదబిందుసంపర్కంబు పృథివిపైఁ
బొక్కలాపఁగఁ గైలపూరమయ్యె *
ఢణుఢణుక్కన నింగిఁ దాటించెఁ బలుమాఱు
లలితవిద్యున్నటీలాస్యకేళి
ఘుమఘుమ నురిమె దిక్కులు పిక్కటిల్లంగ
భూధరస్థలుల నంభోధరములు
జలజల శిల లెత్తి చాలేరుపడియె వి
దూరభూస్థలుల వైడూర్యశిలలు
నకనకలిచ్చు మానసఖేదదశ డించి
పురివిచ్చి యాడె నయ్యురగభోజి."

ఇందు 'ఢణుఢణుక్కన', 'ప్రథమోదబిందు', 'పౌలస్త్యపవన', 'ఈశానదిగ్వ్యాగము' అనుపాదములను తిలకింపుఁడు. ఘనవర్షారంభవర్ణన లొండొంటికిఁ గల సన్నిహితబాంధవ్యము తెల్లము గాఁగలదు. రామకృష్ణుని గ్రంథమును జూచి హరిభట్టో, లేక హరిభట్టుఁ గాంచి రామకృష్ణుఁడో వ్రాసియుండె నని స్పష్టము గును. వీరిరువురును సమకాలమువారు. ఎవ రెవ్వరి ననుకరించిరో కనుఁగొనుట సాధ్యము కాకున్నను, పాండురంగ మాహాత్మ్యములోని పద్యము నారసింహ పురాణమునందు రెండగుటఁ జూడఁగా ననుకరించిన వాఁడు హరిభట్టేమో యను సంశయమున కవకాశము గల్గుచున్నది. ఇందలి సత్యాసత్యము లెట్లున్నను క్రీ. శ. ౧౫౮౩-౧౫౯౦ సం. ల మధ్య రాఘవమనీషి నిజ జనకకృత నారసింహపురాణమునకుఁ గృత్యాదికము రచియించి ప్రోలుగంటి రంగమంత్రి కంకిత మొసఁగు నాఁటికిఁ దెనాలిరామకృష్ణుఁడు ప్రఖ్యాతకవియై బాలకవుల కాదర్శపాత్రుఁడై యుండె ననుట నిశ్చయము.

## రామరాజభూషణుఁడు

పాండురంగమాహాత్మ్యరచనా కాలనిర్ణయ సందర్భమునఁ బేర్కొనవలసినవాఁడు మరియొక కవి కలఁడు. అతఁడు రామరాజభూషణుఁడు. ఇది యతని బిరుదు. వాస్తవమైన పేరెద్దియో యాతఁడు తెల్పకున్నను, కడు ప్రాచీన కాలమునుండియు పరంపరగ వచ్చు గాథవల్ల నతని పేరు మూర్తి యని తెలియుచున్నది.†

* నార. ౪:3.

† తెనాలి రామకృష్ణుఁ డొకచాటువునం దీతనిని మూర్తి యని పేర్కొనియున్నాఁడు — 'ఇతిశ్లేషశబ్ద వాగాడంబరం బొప్పఁ బన ఘటించెను మూర్తి వసుచరిత్ర'; 'కవికిఁ దరువాత నల్పకాలములోనే వసుచరిత్రమునకు వ్యాఖ్యానము చేసినవారు కొందఱు బట్టుమూర్తి తాను రచియించిన నానారసభాసురమగు ప్రబంధమునందలి వివిధాలంకారములుగ నుండునట్లు నరసభూపాలీయము మను నలంకారగ్రంథమును రచియించె నని వ్రాసియున్నా' రని వీరేశలింగం పంతులుగారు చెప్పియున్నారు (ఆంధ్రకవుల చరిత్రము, పుటలు ౨౫౨-3). కాని యీ వ్యాఖ్యాతలు చెప్పినట్లు నరసభూపాలీయ కర్తయే వసుచరిత్రను రచియించె నని యంగీకరించుటకు వీలు కాదు. వసుచరిత్రను రచించిన మూర్తి వేఱు, నరసభూపాలీయకర్త వేఱు. ఆకాలమున 'మూర్తి' సర్వసామాన్యమైన నామధేయముగ వాడఁబడుచుండెను. ఒక కుటుంబముననే యేకకాలమున నిద్దఱు 'మూర్తు' లుండి రనుట కుదాహరణములు లేకపోలేదు. కావున వసుచరిత్రకారుని వాస్తవ నామధేయము 'మూర్తి' యనుటయం దేవైపరీత్యమును లేదు. ఇట్లు ప్రబంధాంకముహారింట సమకాలికు లగు మూర్తు లిరువురు గ్రంథకర్త లుండుటచేతనే తరువాతి కాలమువారు పురుషద్వయ భేదము నెఱుఁగక యొక్క మూర్తియే వసుచరిత్ర, నరసభూపాలీయములను రచించెనని వ్రాసియుండురు.

దీనిని విశ్వసించక పోవుటకుఁ దగు కారణము కానరాదు. 'అతిశ్లేషశబ్ద వాగాడంబర' మని వసుచరిత్రను పరామర్శించినను రామకృష్ణున కా కావ్యమం దాదరము లేకపోలేదు. పాండురంగమాహాత్మ్యమున

"క. గిరికానుమ క్తబుద్ధిని
పరిచరునింబోలె నొక్క పన్నగ మొకనాఁ
డురవడి నెచ్చటినుండియొ
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్."*

అనుపద్యమున రామకృష్ణుఁడు వసుచరిత్రను జేర్కొనుటయే యిందుకుఁ దార్కాణ. ఇందువల్ల రామరాజభూషణుని కవిత్వముపై రామకృష్ణునకుఁ గల యభిమానము తెలియుట యటుండ, వసుచరిత్ర పాండురంగమాహాత్మ్యమునకుఁ బూర్వము రచియింపఁబడె నని విశద మగుచున్నది.

వసుచరిత్ర రచనాకాలము క్రీ. శ. ౧౫౭౦-వ సంవత్సర మని ఇంతకుపూర్వ మొకచోట వ్రాసియున్నాను.† దీని కృతిపతియగు రామరాజు - శ్రీరంగరాజు-తిరుమలరాజు. క్రీ. శ. ౧౫౬౫-వ సంవత్సరమున రక్కసి తంగడి యుద్ధమున నీతని జ్యేష్ఠ భ్రాత యగు అళియ రామరాజు గతించిన పిమ్మట ఇతఁడు సదాశివ రాయలకడ కార్యదక్షుఁడై నిలిచి జీర్ణమైన కర్ణాటక రాజ్యపునరుద్ధారణము గావించి స్వయము రాజ్యాభిషేకము గావించుకొని ౧౫౭౦-వ సంవత్సరమున గద్దెనెక్కెను. వసుచరిత్ర పీఠికయందు కర్ణాటరాజ్య పునరుద్ధారణమును, తిరుమలరాజ రాజ్యాభిషేకమును వర్ణింపఁబడి యుండుటచేతను, మఱియు నతఁడు రాజ్యపాలన ౧౧ మాసములే చేయుటచేతను, ౧౫౭౦-వ సంవత్సరమునందే వసుచరిత్ర రచియింపఁబడె నని తలఁచి యట్లు వ్రాసితిని. కాని ౧౫౭౦-వ సంవత్సరము వసుచరిత్రరచనాకాల మనుటకంటె తత్కృతిసమర్పణకాల మని చెప్పుటయే యుచితముగఁ దోఁచుచున్నది. అట్టి నవరసభాసురంబగు శ్లేషకావ్యమును అల్పకాలమున రచించుటకు సాధ్యముగాదు. ప్రతి పద్యమును దిద్ది తీర్చి చిరకాలము శ్రమపడి రచించినది గాని యాసువుగాఁ జెప్పినది కాదు. పదముల మార్పును, పద్య పద్యమునను దేహమును నీడవలె ననుసరించు శ్లేషయుఁ, ద్రవిడ తంత్రములుఁగ వెల్లినిక్కియు నలంకారములును జూడ వసుచరిత్ర పెక్కేండ్లు యోచించి యోచించి వ్రాసిన పద్యములను దికిలీలుచేసి మెఱుగియునట్లుగాఁ దిరుగ వ్రాయుచుఁ గ్రమక్రమముగా రచించిన కావ్యముగనే కన్పట్టుచున్నది. అట్లనుట రామరాజభూషణుని శిల్పమునకు న్యూనత నారోపించుట కాదు. గొప్ప శిల్పులందఱకును నిది యనతివైకవేద్యమే.

పై యభిప్రాయము కేవల మూహాకల్పితము కాదు. వసుచరిత్ర తిరుమలరాయల కంకిత మిచ్చుటకుఁ బూర్వమే ప్రకటితమై యుండె ననుటకుఁ గొంత యాధారము కలదు. హరిశ్చంద్ర నలోపాఖ్యానమున రామరాజభూషణుఁడు త న్నిట్లు ప్రశంసించుకొని యున్నాఁడు:

"సీ. వనధిలంఘనకృపావార్ధితోఁ దయకవి
తా కళారత్నరత్నాకరుండ
సకల కర్ణాటరక్షాధురంధర రామ
విభుదత్త శుభచిహ్న విభవయుతుఁడ
వసుచరిత్రాదికావ్యప్రీతబహునృప
ప్రాపితానేకరత్నప్లవుండ
శాశ్వతశ్రీ వెంక టేశ్వరానుగ్రహ
నిరుపాధికైశ్వర్యనిత్యయుతుఁడ."

ఈ పద్యము రచించినప్పటికి రామరాజు సజీవుఁడై యుండెనని తోఁచుచున్నది. సకల కర్ణాట రక్షాధురంధరుఁడను బిరుదు రామరాజునకు రక్కసితంగడి సంగరమునకుఁ బూర్వమే చెల్లును. తురకలచే రామరాజు యుద్ధమున నిహతుఁ డగుటయే కాక కర్ణాటక క్షితి యవనజలనిధియందు మునిఁగెను. వరాహమూర్తిం బోలి తిరుమలరాయఁడు దాని నుద్ధరించెను. అయినను పై పద్యముయొక్క మూఁడవపాదమున వసుచరిత్రమును జేర్కొనియుఁ దత్కృతిపాత్రుఁడగు తిరుమలరాయనిఁ జెప్పకుండుటను జూడఁగా నప్పటికి రామరాజింకను సజీవుఁడై కర్ణాటకమును సంరక్షించుచుండె ననియు, వసుచరిత్ర నింకఁ దిరుమలరాయల కిచ్చి

* పాండు. ౪-౨౪౨.

† భారతి సం. ౭, పుటలు ౬౨౮-౬౩౧.

యుండలే దనియు స్పష్టమగుచున్నది. వసుచరిత్రకృతి సమర్పణ మప్పటికి జరిగియే యుండిన, రామరాజువలె సకల కర్ణాటసామ్రాజ్యరక్షకుఁడే కాక, చావనున్న యా సామ్రాజ్యమును పునరుజ్జీవితమును గావించి పట్టబద్ధుఁడును, చక్రవర్తియు నగు కృతిపతినిఁ జేర్కొనకపోవుట యసంభవము. కావున వసుచరిత్ర సంపూర్ణముగ రచింపఁబడినను నెవ్వరికిని నంకితమియ్యక రామరాజభూషణుఁ డట్లే యుంచె నని తెలియవచ్చుచున్నది. తత్కారణమువలనే క్రీ. శ. ౧౫౩౫-౮౦ సం.ల ప్రాంతమున రచించిన పాండురంగమాహాత్మ్యమున గిరికా ఉపరిచరవసువుల వృత్తాంతమును రామకృష్ణుఁడు ప్రస్తావించఁగల్గెను.

౫

తెనాలిరామకృష్ణుని కథలును, చాటువులును పెక్కు నేఁటికిని ప్రచారమున నున్నవి. ఇవి సత్యములని కొందఱును, కల్పనలని యాధునికవాఙ్మయచరిత్రకారులును నభిప్రాయపడుచున్నారు. ఈ కథలనుగూర్చి శ్రీవేటూరిప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు:

"తెనాలిరామలింగని కథలని దక్షిణహిందూదేశ మెల్లఁ బ్రఖ్యాతి కెక్కిన పెక్కుకథ లున్నవి. వానిఁగూర్చి మన మేమియుఁ జెప్పఁజాలము. అతఁడు హాస్యచతురుఁడై యుండవచ్చును. నిజముగా కొన్ని కథ లాతనికి సంబంధించినవే కావచ్చును. లోకులు మఱియు ననేకాద్భుతకథ లాతనితలకుఁ దగిలించి యుందురు. పెక్కుకథలు శ్రీకృష్ణరాయల గోష్ఠిలో జరిగినవిగా వినవచ్చును."*

ఈ యభిప్రాయము కడుసమంజసము. ఈ కథలన్నియు కేవల కల్పనలు కావనియు, అన్నియుఁ గాకపోయినను కొన్నియైనను చరిత్రాంశములపై నాధారపడియున్నవనియుఁ జెప్పి తార్కాణగ గుఱ్ఱపుపిల్ల, నల్లకుక్క, ధూర్జటికథలను గొని యవి చరిత్రాత్మకము లని నేను నిరూపించియున్నాను.† ఇచ్చట మఱి రెండు కథలను పరామర్శించుచున్నాము. ఇవి రామకృష్ణుఁ డిద్దఱుకవులను బరిహసించినట్లు తెలియఁజేయుచున్నవి. వాస్తవముగ నీకవులు రామకృష్ణునకు సమకాలికు లగుదురో, లేక తరువాతికాలమువారు రామకృష్ణునకు వారితో లంకెవైచిరో కనుఁగొనవలసియున్నది.

౧. పాతివ్రత్య దర్శనీ తిరస్కారము:—ఈ పేరిటి గ్రంథమును రచించి యొకకవి కృష్ణరాయల సభకుఁ దెచ్చి యందలి "పతికి మాఱాడక పలుమఱు సేవ్యక యలయక మిగుల గయ్యాళి గాక" యను పద్యమును చదువఁగా రామకృష్ణుఁడు దానికి విపరీతార్థమును గల్పించి యాతనిఁ బరిహసించెనఁట. 'పాతివ్రత్యదర్శనీ' యను పేరిటి గ్రంథ ముండెనో లేదో కాని పైపద్యము తాళ్లపాక తిరుమలాచార్య విరచిత నీతిశతకమునందుఁ గాన్పించుచున్నది.

"సీ. పతికి మాఱాడక పలుమాఱు సేవ్యక
యలుగక మిగుల గయ్యాళి గాక
తనుఁ దిట్టికొనక కాంతాళించి గొణగక
ముచ్చిలింపక పాపమునకుఁ జొరక
పొరుగింటి కేఁగక పరు నాత్మఁ దలఁపక
కుపిత గాక పరాఙ్ముఖ గాక
యదుకదాపక మర్మ మవ్వలఁ జెప్పక
బొంకక నిద్దురపోతు గాక
కాపురము సేయు కామిని గలిగెనేని
బలుకు లేటికి పురుషుని భాగ్యమహిమ
కలిత లక్ష్మీశ సర్వజగన్నివేశ
విమలరవికోటిసంకాశ వెంకటేశ."

తాళ్లపాకవారిని గూర్చి రామకృష్ణుఁడు చెప్పిన చాటు వొకటి కలదు.

"క. చిన్నన్న ద్విపద కెరఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెరఁగున్
మిన్నంది మెఱసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్."

నరసింగన్నయు, పెదతిరుమలయ్యయు సోదరులు; తాళ్లపాక అన్నమయ్యంగారి పుత్రులు. చిన్నన్న పెదతిరుమలయ్య కుమారుఁడు. వీరందఱును కవులు.

* భారతి సం. ౨, పుట ౮౮.

† ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక (193.)

తాళ్లపాక యన్నమయ్యంగారు క్రీ.శ. ౧౫౦౩-వ సం. న మృతినందెను. చిన్నన్న యనఁబడు తాళ్లపాక తిరు వేంగళనాథకవి యచ్యుతరాయలవల్లను, సదాశివరాయల వల్లను పెక్కు గ్రహారములను బడసినట్లు శాసనములు తెల్పుచున్నవి. కావున నరసింగన్నయుఁ పెద తిరుమలయ్యయుఁ గృష్ణరాయల కాలమువా రనియు, వీరందఱును రామకృష్ణుని సమకాలికు లనియు నిశ్చయ మగుచున్నది. రామకృష్ణుని విపరీతవ్యాఖ్యకు గురియైన దని చెప్పఁబడు 'పతికిఁ బూటాడక' యను పద్యము పెద తిరుమలయ్య నీతిశతకమునఁ గానవచ్చుచుండుటచేత ఈకథ సత్యమైనచో, రామకృష్ణునిచేఁ బరిహసింపఁ బడినవాఁ డా పెద తిరుమలయ్యయే కావలయును. హాస్యప్రియుఁ డగు రామకృష్ణుఁడు పైకథయందుఁ జెప్పిన రీతిని పరిహసించినను బరిహసించి యుండ వచ్చును. ఇం దసంగత మేమియుఁ గానరాదు.

౨. భైరవరాజు వెంకటనాథుఁడు:—ఇతఁ డొక దొడ్డకవి. క్షత్రియుఁడు. ఆంధ్రవాఙ్మయమున రస వత్తర కావ్యములయం దొకటి యగు పంచతంత్రమును రచియించెను. ఇతనిఁ గూర్చి యీ కథను చెప్పుదురు. పంచతంత్రము సంపూర్తియైనవెంటనే రాయలచే నను జ్ఞాతుఁడై సభయందు గ్రంథపఠనాపూర్వము దాని యం దెవ్వరేని తప్పుఁ జూపినఁ దన నాలుకఁ గోసి కొనెద ననియు, లేనితప్పు లన్నట్లెవ్వరైనఁ జెప్పిన వారి నాలుకఁ గోతు ననియుఁ బ్రతిజ్ఞఁ జేసెనఁట. రామకృష్ణుఁ డది విని "ఈ రాచకవిత్వ బాధ పడ రాదు కదా యెటువంటివానికిని" అని సభనుండి లేచిపోఁగాఁ దక్కిన పండితులును వెంటనే పోయి రఁట. రాయ లంతట సభ చాలించెనఁట. ఈకథయం దెంత సత్య మున్నదో తెలియదు. కాని పంచతంత్ర పీఠికం జదివిన వెంకటనాథునికిఁ దన కాలపు కవిపండి తులయెడఁ గొంత యసంతృప్తి యుండినట్లు తోఁచును.

సీ. "ఒకఁ డలంకారంబునకు వేడుక వహించు
నొకఁడు వార్తాసమృద్ధికిఁ జెలంగు
నొకఁడు శబ్దస్ఫూర్తులకు మాయుకే యను
నొకఁ డర్థసృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకు మత్తముఁ గదల్చు
నొకఁ డుపమానచర్చికకు నలరు
నొకఁడు రసప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు
నొకఁడు జాతిశ్లాఘ కుబ్బుచుండుఁ
తే. గామిచందానఁ దలవరికరణి బధిరు
వలె దరిద్రునిగతి వాదిపక్షిఁ గనక
కారుచాతుర్వఁ బంగునై ఖరిఁ గుజాతి
జూడ నిందఱి నదలింపఁ జాలు టెట్లు.
క. ఒప్పుఁగల కృతిలో నొక
తప్పున్నను గడము గాదు దానికిఁ గళలం
జొప్పడు శశికిఁ గళంకము
కప్పెక్కువ నేమి నింద గావించెనొకో."

మఱియు, రాజుల నిట్లు దూఱినాఁడు:

ఆ. "అతికుటుంబరక్షణాపేక్షఁ బ్రాల్మాలి
కృతులు దుష్టభూమిపతుల కిచ్చి
చచ్చి నిరయమునకుఁ జనుకంటె హాలికా
ర్తృణముఁ జేసి సుగతిఁ బడయరాదె *"

కడపటి పద్యము అల్లసాని పెద్దన్నగారి "ధర నైతోఁచు కుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మాలి" యను కుకవినిందకు జవా బనియు, "అతికుటుంబరక్షణాపే క్షఁ బ్రాల్మాలి"యని కొంచె మించుమించుగా పెద్దన గారి మాటలనే యిందు వాడుట దీనిఁ దెల్పుచున్న దనియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవా రెచ్చట నో వ్రాసినట్లు స్మరణయం దున్నది. ఇదే సత్యమేని వెంకటనాథునకు రాయలసభలోఁ దన మన్నన కలుగ లేదనియుఁ, దత్కారణముననే కాఁబోలు 'అతికుటుంబ రక్షణాపేక్ష' యన్న పద్యమున దుష్టనరపతులఁ దూలనాడె ననియుఁ దలఁచవలసియున్నది.

కాని, వెంకటనాథుఁడు కృష్ణరాయల కాల మున నుండినఁగదా యివి యన్నియు సమకూడును. కవి చరిత్రకారులకు వేంకటనాథుని కాలమును నిర్ణయించు టకుఁ దగిన యాధారము లేవియు దొరకకపోవుటచేత తాత్కాలికముగ బ్రౌణ్ దొరగారి సిద్ధాంతము నంగీక

---

*పంచ. ౧—౧౮. ౧౭, ౨౭.

రించి యతఁడు క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతముల నుండె నని వ్రాసియున్నారు. మఱియును శ్రీనాథుని కవిస్తుతి యందు పేర్కొనుటచే నాతఁడు క్రీ. శ. ౧౪౫౦ సం. కు పూర్వుఁడు కాఁడనియు, జ్యేష్ఠపితృవ్యుఁడను "లింగ క్షోణిపాలుండు యవనసైంధవకానవానలుం" డను టచే నాతఁడు "మహమ్మదీయులకును, హిందువులకును దక్షిణ హిందూస్థానములో యుద్ధములు జరుగుచున్న కాలమున నుండియుండవలె" నని యు వ్రాసియున్నారు. * దీనిఁబట్టి చూడ వెంకటనాథుఁడు క్రీ. శ. ౧౪౫౦ - ౧౫౦౦ ల మధ్యకాలమున నుండె నని వీరి యభిప్రాయ మని తోఁచుచున్నది. వీరు పలుమా రుదాహరించుచు వచ్చిన స్థానిక చరిత్రలఁ జక్కఁగాఁ బరిశోధించియుండిన వెంకటనాథుని కాలము వీరి కెఱుకపడి యుండును.

స్వవిరచిత పంచతంత్ర పీఠికయందు వెంకట నాథుఁడు తనవంశము నిట్లు వర్ణించియున్నాఁడు: చంద్రవంశమున సాళ్వశైచరా జుద్భవించెను. అతని కుమారుఁడు తిరుమలరాజు; ఇతనికిఁ దిప్పాంబిక యందు వీరభద్రుఁ డను పుత్రుఁడు కలిగెను. అతఁడు తుంకుట్ల శ్రీపతిరాజుకుమార్తె యను లింగమక్కను పెండ్లియాడెను. వీరికిఁ గుమారలింగరాజు, పర్వతరాజు నను నిర్వురు కుమారులు పుట్టిరి. పర్వతరాజు పోలెపల్లి తిమ్మరాజుకూఁతురగు అన్నమాంబికను వరించెను. ఈ దంపతులకు వెంకటనాథుఁడు, రంగరాజు, శేషాద్రిరాజు లను పుత్రులు మువ్వురు పుట్టిరి. వెంకట నాథుఁ 'డసహాయ పరసకవితారసికుఁడు.' ఇతఁడే పంచతంత్రకర్త.

వెంకటనాథుని ముత్తాతయగు శైచరాజు తిరుమలరాజు క్రీ. శ. ౧౫-వ శతాబ్దాంతమున నుండెను. ఇతఁడు శా. శ. ౧౪౧౩ విరోధికృతు నామసంవత్సర మిథునమాసబహుళ ౮ సోమవారమునాఁడు ఉత్తరాభాద్రనక్షత్రమున తిరువెంగళనాథుని దేవాలయము నకుఁ జేసిన దాన మొకటి తిరుమల దేవస్థానము రెండవ ప్రాకారము దక్షిణపు గోడమీఁదఁ జెక్కఁబడి యున్నది. † మఱియు నీ తిరుమలరాజే శా. శ. ౧౪౧౪ పరీధావినామసంవత్సర ధనుర్మాస శు. ౨ లు శుక్రవారము శ్రవణనక్షత్రమునఁ జేసిన దానమును దెల్పు శాసన మింకొకటి దిగువతిరుపతి గోవిందరాజస్వామి యాలయమున ప్రథమ ప్రాకారము తూర్పు గోడ లోపలిప్రక్కఁ జెక్కఁబడి యున్నది. ‡ మఱియు వెంకటనాథుని మాతామహుఁడైన పోలెపల్లి తిమ్మరాజు అచ్యుత దేవరాయల రాజ్యకాలమునందు శ్రీశైల ప్రాంత మండలమున కందుకూరు సీమకుఁ జెల్లుచుండిన చింతకొమ్మదిన్నె, ఆయలూ రను రెండు గ్రామములను రాయలవారిచే నాయంకరముగఁ బడసి యేలుచుండెను. ఇతనివి శా. శ. ౧౪౫౫,౧౪౫౮ సంవత్సరములనాఁటివి రెండుశాసనము లీగ్రామములయం దున్నవి. ‖ పై శాసనము లీ తిమ్మరాజు పోలెపల్లి బుక్కరాజుకుమారుఁ డని తెల్పుచున్నవి. సదరు బుక్కరాజు క్రీ. శ. ౧౫-వ శతాబ్దాంతమున కడప జిల్లా జమ్మలమడుగు ప్రాంతమున రాజ్యము సేయుచుండెనని, శా. శ. ౧౪౦౪ శుభకృతునామసంవత్సర శ్రావణ బ. ౫ ఆదివారమునాఁడు అతని పాలనకు లోఁబడిన చినకొమెర్ల గ్రామరైతు లీతనికి పుణ్యము కలుగుటకై త్రవ్వించిన బావిరొద్ది శాసనమువలనఁ దెలియుచున్నది. § ఇందువల్ల పోలెపల్లి బుక్కరాజు క్రీ. శ. ౧౪౭౨-వ సం. మునను, నతని కుమారుఁడు క్రీ. శ ౧౫౩౩-౩౫ సంవత్సరములయందును దొరతనమును నల్పుచుండిరని విశదమగుచున్నది. ఇట్లు పితాపుత్రుల రాజ్యకాలమునకు ౫౧ సంవత్సరములయెడ మగపడుచుండుటచేత క్రీ. శ. ౧౫౩౫-వ సంవత్సరమునాఁటికి

---

* ఆంధ్రకవుల చరిత్ర, పుట ౩౩౪.

† తిరుపతి దేవస్థానశాసనములు సం. ౨, నెం ౯౪, పుటలు ౧౮౬-౧౯౩.

‡ ,, నెం ౧౦౦, పుటలు ౨౦౬-౨౦౯.

‖ స్థానికచరిత్రలు, నం. ౧౬, పుటలు ౪౪౪-౪౪౬.

§ మద్రాసు ఎపిగ్రఫీ రిపోర్టు 1932-33 356 of 1932-33.

పోలెపల్లి తిమ్మరాజు గతవయస్కుఁడై యుండెనని తోఁచుచున్నది. ఒకవేళ అతని మనుమఁడైన వెంకటనాథుఁ డప్పటికే పెద్దవాఁడై కవియై యుండిన నుండవచ్చును; కాని కృష్ణరాయని సభయం దాతఁడు స్వవిరచితపంచతంత్రముఁ జదువ నుద్యమించె నని చిరకాలము నుండి పరంపరాగతమగు గాథ తెల్పుచున్నను, దీనినమ్ముటకుఁ దగిన సాక్ష్యము కానరాదు. కథయందు వచించినట్లు పంచతంత్రమును రాయలసభయందుఁ జదువుట నిక్కమేని, అది అచ్యుతరాయల కాలముననో, సదాశివరాయల రాజ్యారంభదశయందో నడచియుండును. అచ్యుతరాయలును, సదాశివరాయల సర్వకార్యవహుఁడైన యళియ రామరాజును కృష్ణరాయనివలె కవితాకేళీలోలురే కావునను, రామకృష్ణుఁ డారాయలసభ నలంకరించిన కవిరత్నములయం దొక్కఁడగుటచేతను పైగాథయం దుక్తమైన కవితాగోష్ఠి యారాయలసభ యందు నడచియుండినను నుండును. దీనియందలి సత్యాసత్యము లెట్లున్నను రామకృష్ణుఁడును, వెంకటనాథుఁడును సమకాలమువా రని నిశ్చయించి చెప్ప వచ్చును.





# పళ్ల పండగ

[ కథానిక ]

## శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

ఎప్పటిలాగే ఎరుకయ్య రోజల్లా పచ్చజొన్న చేలో ఆలోచనలతోటే పనిచేశాడు. సాయంత్రం ఆలోచనలతో నిండి చింతలగూడానికి వచ్చాడు. కాళ్లూ, చేతులూ కడుక్కున్నాడు. గుడి వెనకాల రావిచెట్టుచుట్టూ ఉన్న దిమ్మమీద కూచున్నాడు. ఆలోచనలో మునిగిపోయాడు. కొంతసేపటికి నెమ్మదిగా "మా కిక్కడేమీ పులులబాధ లేదు, ఎలుగొడ్ల బాధా లేదు, చేలకి అడివిపందుల బాధకూడా కనబడదు. మాపశువులు సుఖంగా పడుక్కుని నెమరు వేస్తున్నాయి. పాతికేళ్లకిందటే కొండల్లో ఉన్న గూడేన్నీ, దానితో మా బాధల్నీ విడిచిపెట్టి వెల్లకి ప్రదేశం వచ్చిచేరుకున్నాం. పాలగడ్డ జీవనది. మాకు నీళ్లకి లోటు లేదు; మాపంటల కేమీ లోటు లేదు. ఇన్ని సౌఖ్యాలు ఉన్నా మా అడివిజాతిని—కాదు, అడవులూ, కొండలూ విడిచిపెట్టేశాముకదా!— మా వెల్లడిజాతిని తలుచుకొంటూంటే నామనస్సులో చదరంత కారుమబ్బు బయలుదేరి లోపలంతా ఆవరించి మెరుపులతోటీ, ఉరుములతోటీ నోటికి వచ్చి బ్రహ్మాండమంతా బద్దలుచేసి, నన్ను బాధపెడుతుంది. మావాళ్లు చేసే పనులు ఏమని తలుచుకోను! ఆడవాళ్లకి అందం కోసమని పళ్లు ఊడకొడతారు. దాన్ని 'పళ్లపండగ' అంటారు. ఆవిషయం తలుచుకొంటూంటే నాకు ఏడుపు వస్తుంది. ఏడుపేకాదు నవ్వుకూడా వస్తుంది. ఎంత అజ్ఞానం! ఎటువంటి జాతిరా దేవుడా! మాకు ఎటువంటిపండగ కల్పించావు గంగమ్మతల్లీ!" అని విచారంతో అనుకున్నాడు. కొంతసేపటికి చటాలున జాగ్రత్తపొంది "మాతమ్ముణ్ణి అడిగి చూస్తాను. వాడు ఏమంటాడో" అనుకొని కొంత ఉత్సాహం పొందాడు.

గుడిసెలోంచి చంద్రయ్యరాకకోసం ఎరుకయ్య చూశాడు. కొంతసేపటికి, చంద్రయ్య, చేత్తో పూరిడిపిట్టపంజరం పట్టుకుని ఇవతలికి వచ్చాడు. ఎరుకయ్య "చంద్రయ్యా!" అన్నాడు.

"అన్నయ్యా!" అంటూ చంద్రయ్య దగ్గరికి వచ్చాడు. పంజరం కింద పెట్టాడు.

ఎరుకయ్య పూరిడిపిట్టనిగురించి రెండుమూడు ప్రశ్నలు వేశాడు. తర్వాత చంద్రయ్యయోగక్షేమాలు ప్రత్యేకంగా అడిగాడు. పిమ్మట "ఒరే తమ్ముడూ! పళ్లపండగనిగురించి నీ అభిప్రాయ మేమిటి, అది మంచిదా చెడ్డదా?" అన్నాడు జంకుని కనపరచక.

చంద్రయ్య "అది మన ఆచారం. పెద్దలదగ్గిర నుంచీ వస్తూంది. పెద్దలు ఎంతో ఆలోచించి చేసిన పని. అద్భుతమైనది, అందమైనది, అవసరమైనది. దాంట్లో ఇంకా ఎన్నెన్నో సుగుణాలు ఉన్నాయి" అన్నాడు, వేరే ఆలోచన లేకుండా.

ఎరుకయ్య దిగ్భ్రమ చెందిపోయాడు. తాను నిలుచున్నాడో, కూచున్నాడో, ఏమిటి చేస్తున్నాడో అతనికి తెలియలేదు. తర్వాత తనలో "ఈరకం ఆలోచనలు వీడికి ఎవరు నేర్పారు ............ అసలు పళ్లపండగలో ఆలోచన ఏదీ? ఆలోచన లేకపోవడమే అందులో ఉన్న విశేషం. పెద్దల దగ్గరనుంచీ ఈ ఆచారం వస్తూంది. నిజమే! ఆలోచన లేకుండా అనుసరిస్తున్నాం. ఇలాగ ఇలాగని దానిని గురించి ఆలోచించినవాడెవడు? తర్కించినవాడెవడు? ఎవడైనా దాని విషయమై తర్కించి దాని మంచిచెడ్డలు చెబితే మండిపడతారు" అని అనుకొని చంద్రయ్యతో "అబ్బాయీ! నువ్వు దాని మంచి చెడ్డలు ఆలోచించు. బాగా ఆలోచించు. నాకు ఎల్లుండి చెప్పు, తొందర లేదు. నేను అడిగిన ప్రశ్నకి ఉన్న పాటున జవాబు చెప్పవలసిన జరూరు లేదు. నువ్వు నిష్పక్షపాతంగా ఎలాగ చెప్తే అలాగ నడుచుకుంటాను. విన్నావా?" అన్నాడు ప్రశాంతంగా. అందుకు చంద్రయ్య "ఆలోచించకుండా చెప్పాననుకున్నావేమిటి?" అని కుండబద్దలయినట్టు నవ్వాడు. ఎరుకయ్య తనలో "వీడు చెయ్యనిపని చేసినట్టుగా ప్రశంసించుకుంటున్నాడు" అనుకుని, విరుచుకువచ్చే చిరునవ్వు ఆపుకొని "అలాగ కాదు, ఎల్లుండివరకూ అక్కర్లేదు. నువ్వు రాత్రల్లా ఆలోచించి రేపు నాకు చెప్పు. అంతేనే నడగడం. ఇంక నాకు మారు చెప్పవద్దు" అన్నాడు ఖచ్చితంగా. చంద్రయ్య చిరునవ్వు ఆపుకొని, మరి కాస్సేపటికి పంజరం తీసుకొని వెళ్లిపోయాడు.

ఎరుకయ్యమనస్సు చాలా కలతగా ఉంది. అతను ఏపనిచేసినా ధ్యానం మరొకచోట ఉంచుకునే చేస్తున్నాడు. తన భార్యతో కాని, లేక అంతకంటే ప్రియమైన తమ్ముని కొడుకుతో కాని మాట్లాడేటప్పుడు కూడా అతను అనవలసిన మాట ఒకటే, అనేమాట ఇంకొకటిగా ప్రవర్తిస్తున్నాడు. అతను తెల్లారకుండానే ఉట్టినే పొలంవైపు వెళ్లి, మబ్బుతో నిండిన ఆకాశంకింద చిరు చీకటిలో నిద్రిస్తూన్న చేలవైపు చూసి, చప్పుడుచేస్తూన్న పంటకాలువన్నీ, రివ్వున ఎగిరిపోతూన్న కొంగల చప్పుడూ వినికూడా మనస్సు మారక తిరిగివస్తూ "భగవంతుడు ఇచ్చిన పళ్లని, అందమైనపళ్లని, నమలడానికి అవసరమైనపళ్లని లేనిపోని మంత్రాలు, పూజలు చేసి, ఏడుస్తూంటే, ఆడదానికి పెళ్లిముందర, అనగా పదహారేళ్లప్పుడు — విలవిల తన్నుకుంటూంటే, కాళ్లూ, చేతులూ పట్టుకుని, ఉలిరాళ్లతో ఊడకొడతారు. పాపం! పళ్లు పూర్తిగా ఊడక సగం విరిగిపోయినవాళ్లు కొందరు, పక్కపళ్లు కదిలి జన్మంతా బాధపడేవాళ్లు కొందరు. ఏమి అందం చెప్మా ఇది! బోసినవ్వు అందమూ! మేము మునిపళ్లతో కొరికేది వాళ్లు కుక్కలలాగ, పందులలాగు, పిల్లులలాగు దంతాలతో నములుతూవుంటే అందమూ! మా మొగాళ్లు నవ్వుతూంటే, నల్లని మబ్బులో మెరుపులాగ, మల్లెపువ్వుల తీగలాగ, ముత్యాల సరంలాగ మెరిసిపోతాయి పళ్లు. ఆడవాళ్లు నవ్వుతూంటే వికారపు రాక్షసినవ్వులాగ నాకంటికి కనపడుతుంది. అందరి కళ్లూ భగవంతుడెలాగు చేశాడో కాని! భగవంతుడు చేసిన కళ్లో, ఆచారం చేసిన కళ్లో వాళ్లవి!" అని తీవ్రంగా ఆలోచన సాగించాడు. మరికొంతసేపటికి బాగా తెల్లారింది. తూర్పున మబ్బు చెదిరిపోయింది. నీరెండ ప్రపంచాన్ని తేజోవంతం చేస్తూంది. మంచుకి తడిసిపోయిన గుడిసెలమీద సూర్యుని శ్వేతకిరణాలు పడగా గుడిసెలు తెల్ల మేఘాలలాగ మెరుస్తున్నాయి. ఎరుకయ్య గుడిసెకి వస్తూ ఆందోళనగా "తమ్ముడు ఏమిటి చెప్తాడో ఏమిటో!" అని గాబరాపడుతున్నాడు. అతని తల వేడిగా ఉంది. రాత్రింబగళ్లూ ఆలోచనలతో నిండి ఉండడంవల్లా, రాత్రిళ్లు తిన్నగా నిద్రలేకపోవడం చేతా, అతను నడుస్తూంటే కాళ్లూ, చేతులూ, మొహం చెమటలు పోస్తున్నాయి.

చంద్రయ్య కాలకృత్యాలు తీర్చుకుని, చెవుల్లో మందారపువ్వులు పెట్టుకొని, వెదురు పేళ్లపళ్లెంలో

గన్నేరుపువ్వులు, పారిజాతాలు, మందారపువ్వులు, బంతిపువ్వులు తెస్తున్నాడు. ఎరుకయ్య చంద్రయ్యని చూసి హఠాత్తుగా ఆగిపోయాడు. ఎరుకయ్య రావడం చూసి చంద్రయ్య నిలబడ్డాడు. ఎరుకయ్య కంగారుగా బయలుదేరాడు. చంద్రయ్యదగ్గరికి వచ్చి పళ్లెంలో పువ్వులు తీసుకుని చెవుల్ని ధరించి ప్రశాంతమైన మొహం కనబరిచి "ఏమంటావు?" అన్నాడు.

చంద్రయ్య ఊరుకున్నాడు.

మెరుపులాంటి ధైర్యం పుట్టి మాయమయింది ఎరుకయ్యలో. అతను "మనస్సుకి తోచిన విషయమే నాకు కావాలి" అన్నాడు ప్రయత్నంలేక.

చంద్రయ్య ఊరుకోగా ఎరుకయ్యకి ధైర్యం కలిగింది. "ఆలోచిస్తే ఆలాగే ఉంటుంది అబ్బాయీ!" అన్నాడు.

చంద్రయ్య మళ్లీ ఊరుకున్నాడు.

తన తమ్ముడికి కూడా తనకి తోచినట్టే తోచిం దనే ఉత్సాహం మనస్సుని ఊపివెయ్యగా ఎరుకయ్య "జాతి అంతా ఇలాగ ఉండడం ఆశ్చర్యంవేస్తూంది." అన్నాడు గంభీరంగా.

చంద్రయ్యధ్యానం ఎరుకయ్యమాటలమీద ఉన్నా, రంగురంగుల పువ్వులమీద దృష్టి మారు తూంది.

"ఎవరికి వాళ్లు ఆలోచించుకుంటే చూశావా?" అని చంద్రయ్య ఆత్మస్తుతి కలిగేటట్లు అని, ఉత్సాహం పట్టలేక "మనం కొండయ్యని అడుగుదాం పద" అని అడుగువేశాడు ఎరుకయ్య.

"భోజనం చేశాక" అన్నాడు చంద్రయ్య.

ఇద్దరూ చల్దన్నం తిన్నారు. తింటూన్నంత సేపూ మనస్సులు అక్కడ లేవు. ప్రపంచ మంతా దిగ్విజయం చేసివచ్చినట్టుగా ఎరుకయ్యమనస్సు ఉత్సాహపడుతూంది. కాని పైటికి అతను కనపరచడం లేదు. చంద్రయ్య పరధ్యానంగా భోంచేసి, లేవడం మాటే మరిచిపోయి కూచున్నాడు. ఎరుకయ్య లేచి తమ్ముణ్ణి లెమ్మన్నాడు.

* * *

కొండయ్య గుడిసెవసారల ఊరికే చల్లగాలికి నిలుచున్నాడు.

"కొండయ్యా!"

"ఏం ఎరుకయ్యా! తమ్ముణ్ణి వెంటపెట్టుకు వచ్చావు?"

"చల్దన్నం తిన్నావా?"

"అయింది. పొలంమీదికి వెళ్లబోతున్నా."

"మేముకూడా వస్తాం పద"

"పని అట్టే లేదు,మరెందుకు?" అని కొండయ్య వెనక్కి తగ్గబోయాడు.

"సరదాగా పోదాం" అన్నాడు ఎరుకయ్య.

కొండయ్య గుడిసెలోకి వెళ్లి కర్ర చేత్తో పట్టు కొని, జోడు తొడుక్కొని పైమీద గుడ్డ వేసుకొని వచ్చాడు. అంతా నడుస్తున్నారు.

"కొండయ్యా!" అన్నాడు ఎరుకయ్య.

"ఓయ్!"

"కొండయ్యా! నీ పళ్లు ఎలాగ మెరుస్తు న్నాయో ఆ లేత సూర్యుడి కిరణాలకి. అలాగే చూడాలని ఉంది సుమా!"

చంద్రయ్య మాట్లాడకుండా వింటున్నాడు.

"ముత్యాల పేరులాగ ఉంటాయి నాపళ్లు, ఇంకా ఇప్పుడు వన్నె తగ్గిపోయాయి కాని"

"తళతళ మంటున్నాయి నక్షత్రాలలాగ"

"పళ్ల కుండే అందం దేని కుంది?"

"పళ్లే అందమంటావు?"

"కాకపోతే!"

"పళ్లు ఊడకొట్టుకుంటేనో?"

"అందంలేదు గిందంలేదు, పిల్లకాకి నోరులాగ"

"అయితే, కొండయ్యా! ఆడవాళ్ల పళ్లు ఊడకొట్టిస్తావేం?"

"ఆడవాళ్లకి అలాగ ఉంటేనే అందం!"

ఎరుకయ్య నవ్వూ, కోపం ఆపుకొని "అదేమి టయ్యా, అలాగ మాట్లాడతావు? ఇప్పుడేకాదూ

అన్నావు, పళ్లుంటే అందమని, పళ్లు ఊడగొడితే అసహ్యమని?"

"ఔను, మొగాళ్ల సంగతి చెప్పాను. ఆడవాళ్ల సంగతి చెప్పలేదు."

"పళ్లు లేకపోతే ఆడవాళ్లకి మట్టుకు అందం ఎలాగయ్యా?" అన్నాడు ఎరుకయ్య.

"అబ్బెబ్బె! ఎంతమాట! అందమంటే అదే! ఆ విషయం తెలిసే మనపూర్వులు ఆడవాళ్లకి పళ్లు ఊడకొట్టారు. వాళ్లు తెలివితక్కువవాళ్లు కారు మనలాగ"

"అయితే పళ్లుంటే అందం అనే మనమే తెలివితక్కువవాళ్లం. ఏమంటావు?"

"నిస్సందేహంగా! వాళ్లెంత ఆలోచించి ఏర్పాటుచేశారో ఆ ఆచారం"

"అయినా ఆలోచిద్దాం!"

"ఆలోచించినా తేలేదంతే."

చంద్రయ్య అందుకున్నాడు: "ఆలోచించి చూదాం."

"అయితే ఇప్పటివరకూ ఆలోచించనేలేదంటావేమిట్రా" అన్నాడు కొండయ్య.

"నేను ఏమీ అనను. నేను అనేది ఒకటే. ఆలోచించి చూడమన్నాను" అన్నాడు ఎరుకయ్య

"నేను అనేదీ అంతే" అన్నాడు చంద్రయ్య.

"ఆలోచిస్తే మరింత అవుననిపిస్తుంది. ఆసంగతి ఎరిగే మొట్టమొదటే చెప్తున్నా" అన్నాడు కొండయ్య తన తెలివితేటలు గ్రహిస్తూ.

"నే నడిగేది నిన్ను మరేం లేదు. నాకు ఏవిషయమైనా రేపు చెప్పు. నేను నీకు నచ్చచెప్తున్నాననుకుంటున్నావేమో? నాకు చేతకాదు. నేను అడిగేది ఇంతే. నువ్వు ఆలోచించుకో. నీమనస్సు వదులు. ఏది న్యాయమో అది తేల్చుకో. తేలిన విషయం రేపు నాకు చెప్పు" అన్నాడు ఎరుకయ్య. కొండయ్య ఏదో చెప్పబోయేడు కాని చంద్రయ్యకూడా "రేపు చెప్పు. ఇవాళ ఏమీ అనవద్దు. అనుభవంమీద నేను చెప్తున్న మాటలు ఇవి. నామాట విను" అన్నాడు.

ఎరుకయ్య అనేకసార్లు ఎంతమందికో నచ్చచెప్పబోయి విసిగిపోయాడు. మనుష్యులు వాదనకి ఒప్పుకోరనీ, తమంతట తాము ఆవిషయమై ఆలోచించినప్పుడే వారు దారికి వస్తారనీ ఎరుకయ్య అనుభవం.

ఎరుకయ్య కొండయ్యదాపుకి వచ్చాడు. కొండయ్య తన మనస్సులో ఉండే అభిప్రాయం రహస్యంగా చెప్పాడు. కాని ఆచారం, పెద్దలఆచారం, పూర్వులు గొప్పవారు, మన సంప్రదాయం, మన మతం అని ఏమేమిటో దానికి అడ్డుగా చేర్చబోయాడు. ఎరుకయ్య అన్నాడు: "నాకు కావలసింది నీమనస్సు చెప్పే న్యాయంకాని మరేమీ కాదు. నీమనస్సు నువ్వు విప్పిచెప్పినందుకు సంతోషిస్తున్నాను" అతను మనస్సులో ఎంతో ఆనందపడ్డాడు.

ఎరుకయ్యా, చంద్రయ్యా తిరిగి ఇళ్లకి వస్తూండగా చలమయ్య ఎదురయాడు. పళ్లపండుగని గురించి ఎరుకయ్య చలమయ్యని అడిగాడు. అందుకు అతను నేను ఆలోచించ నన్నాడు. ఎరుకయ్య ఏమీ చెయ్యలేకపోయాడు. చలమయ్యతో మాట్లాడుతూన్నప్పుడు దగ్గర చింతయ్యకూడా ఉన్నాడు. చింతయ్య గూడెంలోని పెద్దమనుష్యులలో లెక్క. అతనంటే ఎరుకయ్యకి ఇష్టం. చింతయ్య ఎరుకయ్య చెప్పిన విషయాలు మనస్సుకి పట్టించుకున్నాడు.

ఎరుకయ్య యోచిస్తున్నాడు: "ఊరిమొత్తంగా ప్రతివాడికీ బోధపరచడం సాధ్యమా? ప్రతివాడికీ బోధపడుతుందా? బోధపడనివాడివల్ల సంఘానికి అపకారం జరగవలసిందేనా? అందరికీ బోధపడేవరకూ మనం ఆగితే ఎన్ని పురుషాంతరాలు పడుతుంది, ఎన్ని శతాబ్దాలు పడుతుంది? అన్ని శతాబ్దాలకైనా ఈపని జరుగుతుందనే నిర్ధారణ ఏమిటి? క్రమేపీ ఈ విషయమై ప్రజ ఆలోచన మానెయ్యకూడదా? ఇందరికీ నచ్చచెప్పి వారిచేత పనిచేయించడానికి పూనుకోడం సబబైన పనా?"

చింతలగూడెంలో చిన్నా పెద్దా వెయ్యమంది ఉన్నారు. కులపెద్ద ఉన్నాడు. అతని పేరు జాలయ్య.

జాలయ్యమాటే గూడెమంతటికీ శాసనం. అతనే రాజు. అతనే మతాధికారి. అతను చెప్పిందే వేదం.

జాలయ్యకిముందు మేలయ్య కులపెద్దగా ఉండేవాడు. అతనికాలంలో జాతి కంతా బోలెడంత ఉపకారం జరిగింది. గూడెంమీదికి ఒక అడివిజాతి వారు దండెత్తి వచ్చారు. మేలయ్య వారిని ఓడించి తరిమివేశాడు. జాలయ్యకి అటువంటి బాధ లేమీ లేవు. దేవతలకి జాతరలు చెయ్యడం, గూడెంలో వచ్చిన తగవులు తీర్చడం, పంటల విషయంలో శ్రద్ధ కనపరచడం— ఇవే అతను చేస్తూన్న పనులు.

ఎరుకయ్య అనేకమందికి తన ఊహాలు తెలియపరుస్తున్నాడు. ఆలోచించ మంటున్నాడు.

ఎరుకయ్యకి పిల్లలు లేరు. చంద్రయ్యకిమాత్రం ఒక కొడుకు. తన ఇంట్లో తన అభిప్రాయాలు ఆచరించే అవకాశమే లేకపోయింది. కొండయ్యకి కూతుళ్లున్నారు. ఇద్దరు పెళ్లీడుపిల్లలు.

ఒకరోజు సాయంత్రం ఎరుకయ్య కొండయ్య గుడిసెకి వెళ్లాడు.

"తమ్ముడా! విశేషా లేమిటి?"

"ఉంటే నువ్వు చెప్పు."

"పిల్లల పెళ్లిళ్లమాటేమిటి?"

"చెయ్యకపోతే ఎలాగ? వాళ్లు ఇంకా ఏ విషయం నాతో చెప్పడం లేదు."

"మరి పళ్లపండగమాటేమిటి?"

"చేద్దాం అదీను"

"చేద్దాం!" అని ఆశ్చర్యపోయాడు ఎరుకయ్య. "చెడ్డదనుకున్నాం కాదుటయ్యా!" అన్నాడు.

"మన మొక్కళ్లమే కాదుకదా చేసేది"

"మనం దారితీస్తే అందరూ తీస్తారు"

"అందరూ ఎప్పుడూ తియ్యరు, ఎవడి దోవ వాడిదే. తొందరపడి చేసేసందుకు మనమే అనుభవిస్తాం. కులపెద్ద వెలివేస్తాడు. చచ్చేమన్నమాటే. అంచేత దేని దోవ దానిది. ఆలోచనకీ, ఆచారానికీ సంబంధం లేదు."

"అంతే!" అని అణుచుకున్న ఆశ్చర్యంతోటీ, కోపంతోటీ అన్నాడు ఎరుకయ్య.

"సందేహం లేకుండా!"

"ఇన్ని తెలిసినవాడివి నువ్వు ఇలాగ చేస్తావనుకోలేదు" అన్నాడు శాంతం తెచ్చుకుని ఎరుకయ్య.

"తెలిస్తే మట్టుకు చేస్తావని నిర్ణయ మేముంది? వెనక మనలాంటివాళ్లు ఎంతమంది మనలాగ అనుకొని ఉండరు! వాళ్లంతా చేశారా ఏమిటి?"

"మంచిపని చెయ్యడానికి స్వతంత్రం లేదంటావు?"

"సంప్రదాయంకంటే సాధ్యమైనదేదీ లేదు."

"నీ మనస్సులో పళ్ల పండగంటే అభిప్రాయమేమిటి?"

"వెనకే చెప్పాను. మళ్లీ ఎన్నిసార్లు చెప్పిస్తావు?"

కొండయ్యఅభిప్రాయం మారనందుకు ఎరుకయ్య సంతోషించాడు. "అనుకున్నది చెయ్యడానికి ధైర్యం లేదు మనకి" అని పైకి అన్నాడు.

"చేస్తే అందరం చెయ్యాలి. లేకపోతే అందరం మానెయ్యాలి"

"అందరం ఎలా చేస్తాం? ఆలోచించమంటే ఆలోచించనివాళ్లు ఎంతమంది లేరు? ఔనంటావా?"

"నిజమే."

"మరి అందరూ ఎలాగ చేస్తారు ఒక్కమాటుగ?"

"నిజమేనయ్యా! నే నావిషయమై ఏమీ చెప్పలేనుగాని నేనుమట్టుకు చేసే దేమిటో చెప్తాను"

"అది రావలసిన మార్పే అంటావు."

"అవురా. అయితే నేను మట్టుకు చెయ్యలేను."

కొండయ్యఅభిప్రాయానికి ఎరుకయ్య సంతోషించాడు. ఎరుకయ్య రహస్యంగా ఒకవిషయం చెప్పాడు: "అబ్బాయీ! నువ్వు చేసినా చెయ్యకపోయినా న్యాయమని తోచిన నీ అభిప్రాయాన్ని మట్టుకు వ్యాపింపచెయ్యి."

"అవశ్యం" అన్నాడు కొండయ్య.

ఒకరోజున ఎరుకయ్య కోనయ్యదగ్గరికి వెళ్లాడు. వెనక అతనితో పళ్లపండగ విషయం ముచ్చటించి అతని అభిప్రాయం తెలుసుకున్నాడు. "కోనయ్యా! మీ అమ్మాయి మర్రయ్యగారి వానయ్యని పెళ్లాడతా నంటూందిట?" అన్నాడు.

"ఔను. తొందరలోనే శుభకార్యం జరుగుతుంది"

"పళ్లపండగ జరగదన్నమాటేనా ?"

"ఎవ రన్నారు?"

ఎరుకయ్య నిర్ఘాంతపోయాడు. కోనయ్య తన అభిప్రాయం అప్పుడలావెలిబుచ్చి ఇప్పుడిలాగ మాట్లాడడం ఎరుకయ్యకి ఆశ్చర్యంవేసింది. "అది కాదు కోనయ్యా! మీ అమ్మాయికి పళ్లపండగ చెయ్యవుకదా అంటున్నా" అన్నాడు.

"అహే, ఎవరన్నారని అలాగంటున్నావు?"

"నువ్వు మరి అప్పుడు అది మంచి ఆచారం కాదన్నావు కాదూ ?"

"అప్పుడు తెలివితక్కువగా అన్నాను. అంతకంటే మంచి ఆచారం లేదని ఆ ఉత్తరక్షణమే అనిపించింది. మరోక్షణం నువ్వు ఉండేవుంటే నీతో అప్పుడే చెప్పేవాణ్ణి అది గొప్ప ఆచారమని."

ఎరుకయ్య జాగ్రదవస్థని నమ్మలేకుండా ఉన్నాడు. "ఆచారానికి ఎదురు వెళ్లలేక కోనయ్య ఆ పళ్లపండగని గొప్పదనికూడా పొగుడుతున్నాడు" అని మనస్సులో అనుకున్నాడు. పైకి "నువ్వు ఎలాగ చేస్తే చేశావు. కాని పళ్లపండగనిగురించి నీకు మనస్సులో ఉన్న అభిప్రాయం చెప్పు" అని విస్పష్టంగా అన్నాడు.

"నే నిప్పుడు చెప్పేది నా అభిప్రాయమే. నాకు మరొక అభిప్రాయం లేదు."

కోనయ్యమాటలు అబద్ధ మని ఎరుకయ్య "నువ్వు నీఇష్టం వచ్చినట్టు చెయ్యిగాని నీ అంతరాత్మ అనే మాట లేమిటి ?" అన్నాడు.

"నా అంతరాత్మ అనేదా, అందరూ ఎలాగ చేస్తే అలాగ చెయ్యమని. అంతే గాని మరొక దోవకి వెళ్లకు అని."

కోనయ్యమనస్సు ఎరుకయ్యకి బోధపడింది. అతనితో వాదించి లాభం లే దనుకొన్నాడు. "అయితే మరి వెళతాను. ఇంకా ఆలోచించు. తొందరపడవద్దు. మన పక్షంవాళ్లం చాలామంది ఉన్నాం. ఒంటరిగా [illegible]యిపోతావని నువ్వు భయపడనక్కర్లేదు" అని ధైర్యంచెప్తున్నట్టు పలికాడు. కాని కోనయ్యకి వేరే ఆలోచన లేదు. ఎరుకయ్య లేచి వెళ్లిపోయాడు.

ఎరుకయ్యా, అతని బృందం గూడెంలో అనేకమందికి తమ ఉద్దేశాల్ని వ్యాపింపచేశారు. మనస్సులోంచీ ఒప్పుకున్నవాళ్లు కొందరు, ఎరుకయ్యపలుకుబడికి హడిలి ఔనన్నవాళ్లు కొందరు, లోపల మంచిదనుకొని పైకి ఆమాట అనడానికి భయపడేవాళ్లు కొందరు, సంప్రదాయంకంటే మెరుగైనది లేదనేవాళ్లు కొందరు, ఏపద్ధతైతే మన కేమిటి ఇలాగ జరిగిపోనిద్దురూ అని తలచేవాళ్లు కొందరు—ఇలాగ నానా విధాలుగా ఉన్నారు.

ఎరుకయ్యసంస్కరణోద్దేశం కులపెద్ద జాలయ్య నోటీసులోకి వెళ్లింది. జాలయ్య మండిపడ్డాడు. గూడెంలో ముఖ్యుల్ని కొందరిని రప్పించాడు. ఎరుకయ్య వ్యవహారం చెప్పి అతనికి శిక్ష విధించవలసిందనీ, ఆ నేరానికి అతన్ని చెట్టుకి తలకిందులుగా కట్టి వారంరోజులుంచాలనీ చెప్పి, ఎరుకయ్యని తన దర్బానికి రమ్మని కబురుపంపాడు.

ఎరుకయ్యకి అన్నివిషయాలూ తెలిశాయి. అతను జాలయ్యదర్శనం తొందరలోనే చేస్తానని వర్తమానం పంపాడు. ఎరుకయ్యకి జరగబోతూన్న ఆపద విని అతని అనుచరులు అతనిదగ్గరికి వచ్చారు. మార్గాంతరం తెలియజేయవలసిం దన్నారు. జాలయ్యమీదికి యుద్ధానికి వెళ్లడానికి సిద్ధంగా ఉన్నామని చెప్పి పొదులలోంచి బాణాలుతీసి విల్లు ఎక్కుపెట్టి, అతని ఆజ్ఞకోసం ఎదురుచూస్తున్నా మన్నారు. ఎరుకయ్య సంతోషించాడు. తొందరలోనే తన ఉద్దేశం తెలియ

చేస్తామని చెప్పాడు. వారిలో మంచి వీరులైనవారినీ, ఆలోచనపరుల్నీ పన్నెండుమందిని ఎంచి ఎరుకయ్య వారితో మంత్రాంగం జరిపాడు. యుద్ధం ప్రకటించవలసిందే అని వారు ఆలోచన చెప్పారు. కాని ఎరుకయ్య "మనం రహస్యంగా ఒకపని చెయ్యాలి. అది రెండోవాడికి మీవల్ల తెలియకూడదు. జాలయ్య యుద్ధానికి సిద్ధపడిఉంటాడు. కాని మరోకరకమైన ఉపకారం జరుగుతుందని తలచిఉండడు. మీరు రహస్యంగా అతన్ని బందీచేసి దూరంగా ఏ అడవుల్లోనో, కొండల్లోనో దాచెయ్యండి. జాతికి అధికారిని నే నవుతాను. జాతికి మంచి అని మనకి తోచిన ఆజ్ఞలు అమలులో పెడదాము" అని గంభీరంగా చెప్పాడు. ఎరుకయ్యబుద్ధిని చూసానికి మంత్రులు ఆశ్చర్యపోయారు.

* * *

జాలయ్య ఏమయిందీ ఎవరికీ తెలియదు. గూడెమంతా అట్టుడికినట్టు ఉడికిపోతూంది. జాలయ్య న్యాయంగా ఉండనందుకు దేవతలు అతన్ని నాశనం చేశాయని కొందరూ, న్యాయంగా ఉండినందువల్ల దేవతలలో కలిసిపోయాడని కొందరూ, ఎరుకయ్య తన అనుచరులచేత చంపించాడని కొందరూ—అందరూ తలోవిధంగానూ చెప్పుకుంటున్నారు.

ఎరుకయ్య గూడేనికి రాజయ్యాడు. ఉత్తరక్షణంలోనే పళ్లపండగ ఉండకూడదని శాసించి, ఉల్లంఘించినవారిని చెట్టుకి తలకిందుగా నాలుగురోజులపాటు వేళ్లాడకడతానని గూడెమంతా చాటింపించాడు. కొందరు ఏమయినాసరే పళ్లపండగ చేస్తామన్నారు. మరికొందరు అధికారిఆజ్ఞ మీరమన్నారు. కొందరు తాము కోరుకుంటూన్న మార్పు వచ్చిందన్నారు. ఇంకా కొందరు భూలోకం నాశనమయిపోడానికే ఈ ఆజ్ఞ వచ్చిందన్నారు.

కొండయ్య తన కూతుళ్లకి పళ్లపండగ చెయ్యడానికి పూనుకున్నాడు. ఎరుకయ్యభటులు వచ్చి కొండయ్యని రెక్కలువిరిచికట్టి తీసుకువెళ్లి చెట్టుకి తలకిందులుగా కట్టారు. తనని రక్షించవలసిందనీ, తప్పు చేసినందుకు క్షమించ కోరుకున్నాననీ కొండయ్య బతిమాలుకున్నాడు. కొండయ్యయొక్క వెనకటి పరిచయం ఆలోచించి ఎరుకయ్య క్షమించాడు. కొండయ్య తాను బతికి ఇవతలపడడం రెండోజన్మగా భావించాడు.

ఎరుకయ్య తన దగ్గరికి రావలసిందని ప్రత్యేకంగా కోనయ్యకు కబురుపంపించాడు. అతనురాగానే అతని కూతురువిషయమై అడిగాడు. కోనయ్య తాను సంప్రదాయం తప్పితేనే తనకి భయం కాని మరిదేనికీ భయంలేదని నిర్భయంగా చెప్పాడు. ఎరుకయ్య భటులకి ఆజ్ఞ ఇచ్చాడు. కోనయ్యని చెట్టుకి వేళ్లాడకట్టారు. ఒక్క క్షణంలోనే కోనయ్య తన నిర్ణయం మార్చుకొని శిక్షనుంచి విడుదల పొందాడు.

ఊళ్లో ఇద్దరు ఆసాములు పళ్లపండగ ఆజ్ఞని ఉల్లంఘించారు. ఉత్తరక్షణంలో వాళ్లిద్దరినీ చెట్లకి వేళ్లాడకట్టారు. ఇద్దరూ మరణించారు. ఈ కృత్యంతో ఊళ్లో గుసగుసలు బయలుదేరాయి. కాని బహిరంగంగా అభిప్రాయం చెప్పేవారు కాని, ఆజ్ఞని తప్పేవారు కాని లేరు. ఎరుకయ్యపలుకుబడి విస్తరిస్తూంది. ఇంక జాలయ్య తిరిగీ గూడేనికి వచ్చినా ఏమీ ఫర్వాలేదనే ధైర్యం ఎరుకయ్యకి కలిగింది. అతను జాలయ్యని రహస్యప్రదేశంనుంచి తెప్పించాడు. జాలయ్య తన పక్షంవారు లేరనీ, ఉన్నా ఒకరిద్దరివల్ల ఏమీ ప్రయోజనం లేదనీ, తను ఎదురుతిరగడంవల్ల మరణించడమే గాని మరోకలాభం లేదనీ తలచి అందరితోపాటే ఉండడం మొదలెట్టాడు.

నాలుగేళ్లయింది. ఆడవారి నవ్వులలో ఉండే అందాన్ని గురించి కవీశ్వరులు రకరకాల కవిత్వం చెబుతున్నారు. చంద్రుడిలో ఉండే నలుపు ఎప్పటికైనా కన్నెనవ్వుల తళుకులవల్లే పోవాలిగాని మరోక మార్గం లేదని వారిలో గొప్పకవీశ్వరుల అభిప్రాయం.

---

# స్వామి!

శ్రీ వావిలాల సోమయాజులు

కోటికొండల బరువెత్తి కూలబడిన
ఇనుపపాదాల మర్దింతు వేలనోయి!
నీవు నీపూలవనిలోన నిలుపుకొనిన
మావిగున్నను పెకలింప మనసదేల?

మంచుతెరలను నాదారి మరగుపరచి,
ముల్లుగర్రను చేపట్టి, ముక్కుత్రాళ్ల
చేత లాగుచు, నదలింప చేతనౌనె,
స్వామి, ఒక బెత్తె డేనియు సాగినడవ !

అలసిపోయెను నాగుండె; ఆటకట్టె;
ఎత్తు వేయగ లేనింక; ఏడిపింప
నేటి న్యాయమ్ము సఖులలో; నెంచిచూచి
ఆట చాలింపు; మదియె నాయభిమతమ్ము.

తండ్రి, నా పేదయెద రహదారిమీద
ఎంతమందిని నడిపింతు విట్లు నీవు;
ఎన్నిపుట్ల బరువుమోయు నిచ్చగింతు
వూసులాడుచు కుములు నీయోటిబండి!

వెల్ల వేసిన పెండ్లిల్లు; వీధిలోన
నాటక మ్మాడ కట్టిన తాటిపాక;
పూటగంజికి లేనట్టి బాటసారి
బ్రతుకు నాయది వేధింప భావ్యమగునె!

ఆశయ మ్మొక్కటే నన్ను పాశబద్ధు
చేసి నిలుపుచు నున్న దీచేతగాని
పడవవానిగ; నా నావ పగులగొట్టె
తలప వలదయ్య యొక వసంతమ్మువరకు.

---



# మీగడ తరకలు



## ఆధునికహిందూదేశమున నాత్మజ్యోతి : భగవాన్ శ్రీరమణమహర్షి

[ఏతద్వ్యాసమును రచించినవారు శ్రీ సిద్ధేశ్వరానందస్వాములు. వీరు వేదాంతశాస్త్ర పండితులు; శ్రీరామకృష్ణమిషనుకు తిలకాయమానులు; ఇప్పుడు ఆమిషను పారిస్ శాఖకధ్యక్షులుగా నున్నారు.

ఈదేశమున నున్నంతకాలమును వీరు తఱచు రమణాశ్రమమునకు వచ్చి శ్రీమహర్షులను సందర్శించువారు. వీరికి స్వామి పరతత్త్వమునకు మూర్తీభవము, విశ్వమయుఁడు, ఆత్మస్వరూపుఁడు.

శ్రీమహర్షుల జీవితము వేదాంతదర్శనమున కుదాహరణ మని యీవ్యాసము సవిమర్శముగ నిరూపించుచున్నది. ఇది ఫ్రెంచిభాషయందు ప్రథమమున రచితమైనది.]

శ్రీరమణమహర్షు లుపదేశించు తత్త్వము, ధర్మాచరణపద్ధతి కేవలము వేదాంతదర్శనసారమే. ఈదేశమున బోధకుని జీవితమున నభివ్యక్తముగాని తత్త్వబోధ కెట్టి విలువయు లేదు; దాని నాచరించువా రుండరు. ఆలోచించిన నొక ద్రష్ట (ఋషి) జీవితానుభూతుల నాధారముగాఁ గొనియే వేదదర్శనశాస్త్రము ప్రవర్తిల్లుట. ఆజీవితమే మహార్థవంతముగా గ్రహింపఁబడి అది సంఘదృష్టిని విశాలతర మొనర్చి జనులమధ్య సామరస్యమును పెంపొందించును. అట్టి ఋషులే కపిలవ్యాసాదిదర్శననిర్ణేతలు.

ప్రాచీన భారతవర్షమున ఋషులు పరమార్థమును దర్శించి తమతమ దివ్యానుభవములను వేదఋక్కుల రూపముననూ, ఉపనిషదుపదేశములుగను వాచ్యము చేసిరి. అంత జనము వారిని జగత్తున సారభూతులని, సంసారారణ్యమున తెన్నుగానక పరితపించు తమకు వారిజీవితములు దారిచూపు దీపికలుగా భాసిల్లినవని వారిని బూజించినది. ఆమహానుభావులు కనుఁగొన్న సత్యము వారిహృద్గుహాలందే నిక్షిప్తమై యుండకతప్పదు. కాని యాసత్యము ప్రతియొక్కరుని యంతరంగమున స్వతస్సిద్ధమై యున్నది. దానిని లభ్యము చేసికొనుటకు లోన మునుఁగు నుపాయములను మాత్రమే తేటగా వారుపదేశించుచున్నారు. సత్పదార్థము న్యాయతః జనులెల్ల రనుభవింపవలసిన పైతృకసంపద. అంతర్ముఖులై దాని నన్వేషించుటకు ప్రతివ్యక్తికిని హక్కున్నది. కావుననే తద్విషయమై మానవప్రయత్నము శ్లాఘాపాత్రమయినది.

ఉపనిషత్తులు తత్త్వాన్వేషకులను "అమృతస్య పుత్రాః" (అమృతానందసంపద మీ పిత్రార్జితసంపద) అని సంబోధించుచున్నవి. ఆశాపూరితములగు నీవాక్కులకన్న సాధకునికి ప్రోత్సాహకరవాక్యములు వేఱుండునా? మానవునికి సహజమైన తత్త్వము క్రైస్తవు లనునట్లు * పాపభూయిష్ఠము గాదు; అది హిరణ్మయమైన యాత్మజ్యోతిస్సు.

* క్రైస్తవులు ఆదిదంపతులగు నాదామునవ్వలు చేసిన భగవదాజ్ఞోల్లంఘనముచే వారి సంతానమగు

ఎవరి సాహాయ్యమును లేక తమంతట తామే మహర్షి యీ సత్యమును కనుఁగొన్నారు. వారి చిన్నతనమునందే-వారు విద్యార్థిగా నుండునపుడే వారిని మృత్యుభయ మావేశించినది. ప్రతిచిన్నవానికి నీప్రశ్న యేదో యొకనాఁడు వచ్చునదే కాని మృత్యు వన నేమో యెఱుఁగుటకుఁగా నెవరును తమంతట నది తెలిసికొనవలె మృత్యుద్వారదేశమును ద్రొక్కి చూచు నంతటి ధైర్యశాలులుగా నుండరు. మహర్షి కాధైర్య ముండినది. ఆప్రయత్నమును చేసినారు. పుస్తకములలో సత్యము వెల్లడి గాదు సరిగదా, ఎక్కువ ఆచ్ఛాదితమే యగును. కావున నా పుస్తకములను పాఱవైచి మహర్షి శయనించి కన్నులు మూసికొని మృత్యానుభవములను లక్షింప సాగెను. ఆ కథ—వారి మాటలుగానే:

“చావు వచ్చినది. చావనఁగా? చనిపోవున దేది? దేహమే! భావతీవ్రతచే నది అప్పుడే నా యనుభవమునకు వచ్చినది. కాలుసేతులు కొయ్యఁబాఱు నని యనుకొనుచుండునపుడే అవి కొయ్యఁబాఱినవి. అట్లే శ్వాసము నిలిచిపోయినది. లోన నిట్లు స్ఫురించినది. ‘ఈ దేహము మరణించినది. ఇఁక బంధుజనము వచ్చును. దీనిని శ్మశానమునకుఁ గొంపోవును, బూడిద చేయును. కాని ఈ శరీరము చావఁగనే నేను మరణించినట్లే? ఈ దేహమా నేను? ఇది జడముగదా! దానికన్న ‘నేను’ వేఱని నాపృథగస్తిత్వము స్ఫురించుచున్నది గదా. కావున ‘నేను’ అనఁగా దేహమునకన్న వేఱగు నిత్య మగు నాత్మ. దేహమే జీవించుట, మరణించుట.

ఈయనుభవమును వాచ్యము చేసికొనవలసినావశ్యకత లేక ఇది స్ఫుటతరస్వానుభూతిగా గోచరించినది. ఇది తర్కప్రాప్తము గాని యపరోక్షానుభూతి. మఱియు మరణభయమును బూర్ణముగ వెంటనే తరలి పోయినది. ఆనాఁటినుండి శరీరభిన్న ‘అహం’పదార్థము నాకు నిరత ప్రత్యక్ష నిత్యానుభూతముగ నున్నది.”

ఇట్లు ప్రత్యక్షముగ నాత్మ నెఱుఁగుటనే ‘అపరోక్షానుభూతి’ యనుచున్నారు. సాధారణముగ జ్ఞానము మనోవ్యాపారమువలన లభించుచున్నది. విషయము, విషయమును తెలిసికొను విషయి, విషయ విషయి సంబంధము — ఇవి ఈ మనోవ్యాపారమున నున్నవి. కావున నీ జ్ఞానము దిక్కాలనియమితము; పరమార్థము గాదు. ఈ యపరోక్షానుభూతి కలవాఁడు జీవించియున్నపుడును ముక్తుఁడే. కావున నతనిని జీవన్ముక్తుఁ డందురు. వస్తుపరమూర్తులగు నిట్టి మహాపురుషుల యునికిచేతనే ఆ తత్త్వము ఉదాహరణముగా నిరూపిత మగుచున్నది. అట్టి మహానుభావుల వేదాంతపరమార్థానుభూతియే యట్టిది సాధ్యము అని మనుష్యప్రయత్నమున కవకాశ మిచ్చుచున్నది. వారి యనుభవములచేత మనుష్యప్రజ్ఞయు దివ్యపథగామి యగుచున్నది.

ఉత్తరమీమాంసయొక్క యీవిశిష్టలక్షణమే విదేశులను తదుపదేశవిచారమును చేయఁ బురికొల్పుచున్నది. వేదాంతవిచారము దృశ్యమానజగత్తుయొక్క విజ్ఞానముచేతఁ దృప్తిపడదు. అది యింకను గాఢతర విమర్శకుఁ బూని వేదనకు (Perception) ఆధార మేమనును. పరిమితమగు జ్ఞానాంశముతో తనివి చెందదు. సమగ్రజ్ఞానమును వాంఛించును. రమణుఁడు వేదాంతపరమార్థమూర్తిభావ మని చూపఁగల్గుటచేతనే ప్రతీచ్యవిద్వాంసులు రమణజీవితోపదేశములను తెలియఁగోరుచున్నారు. దీనిచే వేదాంతాకర్షణ జగద్వ్యాప్త మని రూఢి యగుచున్నది.

యోగశాస్త్రవిషయమున నొక వ్యాసమును రచించుచు పారిస్ విశ్వవిద్యాలయపండితుఁడు లాకోమ్ దొర శ్రీరమణు నిట్లు వర్ణించెను :

“మేధాశక్తులు సమ్మిళితములై యాయననుండి ప్రవహించుచున్నవి. ఆయనదృష్టి తేజోవిలసితము; నిశితము, స్థిరము అయిన నందు కాఠిన్యము లేదు. ఆయన

---

మానవకోటి సహజముగ పాపభూయిష్ఠమని తలంతురు. దీనినే వారు Original Sin (సహజపాపము) అని చెప్పుచున్నారు.

తనువు నిశ్చలము, అయిన నందేదేని యంగవిన్యాస మెందవెనా, యది లలితాతిలలితము, కోమలము, మృదులము. ప్రామాణిక ప్రాశ్నికు లాయన చరమానుభూతిం గన్న యోగి సిద్ధుఁ డని యంగీకరించుచున్నారు.”

రమణసన్నిధిప్రభావ మెఱుఁగువా రాశ్రమమునకు వచ్చిన నే మనుకొందురో తెలుప నీయుద్ధారము.

కాని ప్రతీచ్యదర్శనమతసంప్రదాయస్థిరుఁ డగు వానికి రమణజీవితతత్త్వము స్పృశింపనైన సాధ్యము గాదు. మహర్షిని యోగియనుటకన్న తత్త్వజ్ఞాని యనుట సరియని నేను ఈదోరగారికి సవినయముగా విన్నవింప వలసి యున్నది. మహర్షికి జీవితమున జాగ్రత్స్వప్న సుషుప్తులందును, తదభావస్థితియందును ఉండు ననికి. హఠయోగ సిద్ధుని యనుభూతి జాగ్రదవస్థపై నాధారపడియున్నది. అందు ప్రాకామ్యసిద్ధి అతని లక్ష్యము. అట్టియనుభూతిం గలిగినవారికి, జాగ్రదవస్థ యందు ప్రాకామ్యసిద్ధి గలవారికి భారతదేశమున కొదవ లేదు.

మహర్షి నా ముందు తత్త్వజ్ఞాని యని మఱి మాటాడవలయును. యోగిసాధనానుభూతులను వారి సాధనానుభూతు లెంతో యతిక్రమించియున్నవి. మహర్షి యనుభూతి అవస్థాత్రయమును దాఁటియున్నది. యోగుల యనుభూతి ‘అహం’ నెఱిఁగికొను నహంకారమునకుఁ (జీవునికి) బరమ-అనఁగా విశ్వతోముఖమైన శక్తి. మహర్షి మార్గమునకు ఫలము జీవునిమూలమునకుఁ బోయి జీవునికిని, మాత్రాస్పర్శాత్మకమగు నీసర్వజగత్తునకు నాధారమగు తత్పదార్థమును బొందుట.

చిన్ననాఁటనే మహర్షి కనుభవము శాశ్వతము, సహజము నై పోయినది. స్వయము మేధాశాలి, కావున నాయనుభూతిని వర్ణించునపుడు తత్త్వజ్ఞులు ప్రయోగించు పదజాలమును వారు సులభముగఁ దెలిసికొనిరి. జిడ్డు కృష్ణమూర్తిగారును ఆత్మవివేకమునకు అతఁడను ‘అహంధారా’ గ్రహణమునకు నీవిచారమార్గమునే చెప్పుచున్నట్టున్నది. కాని వారి పదప్రయోగము వేఱు. మహర్షియో యుపనిషత్కాలమునుండియు తత్త్వజ్ఞులచే నుపయుక్తమై, సంప్రదాయసిద్ధమై, పావనమై యలరుచున్న పదజాలమునే గ్రహించును. ప్రాచీన భారత దర్శనయోగశాస్త్రములును, మహర్షి ఉపదేశించునదియు నొక్కటే. మహర్షి యుపదేశము లాశాస్త్రముల నుండి యుద్భవించుచున్న వనియుఁ జెప్పవచ్చును.

మహర్షిని దర్శించు జిజ్ఞాసువుల కతఁ డంతర్ముఖుఁ డనిగాని, బహిర్ముఖుఁ డనిగాని తోఁచఁడు. వారు ఇతరమానవు లన్నట్లే యుందురుగాని చెప్పవలయుచో వారు స్థితప్రజ్ఞు లనియే చెప్పవలెను. ఒకప్పుడు వా రాత్మనిమగ్నులైనటు లుందురు; ఇతరులును సమాధి (ఆత్మ)నిష్ఠులై యున్నారనియుఁ దలఁచుచుందురు; హాలునం దావలివైపు తమిళపద్యములఁ బఠించువా రేదేని పొరబాటు చేయుదురు; తత్క్షణమే మహర్షి కన్నులు తెఱచి తప్పును దిద్ది యథాపూర్వము కన్నులు మూసికొనును. ఇట్టిది నేను చూచియున్నాను. ఈప్రపంచమున కాయనకు సంబంధమే లేదని యెవరు ననఁజాలరని యిదివఱకే నుడివియున్నాను. ఆయనయేకాగ్రత తీవ్రాతితీవ్రమై జ్ఞాననిష్ఠను, అనఁగా సహజస్థితి నచంచలముగా నాశ్రయించి యున్నది. కనుక నాయన నంతర్ముఖుఁ డనుటకు లేదు, బహిర్ముఖుఁ డనుటకు లేదు. సత్తామాత్రుఁ డననగును. పరమతత్త్వజ్ఞుఁడు తత్త్వ మెన్నియెన్నిభంగుల వ్యక్త మగుచున్నదో ఆ యన్నింటి యందును తాను బ్రహ్మైక్యముం బొందినవాఁడు గనుక ఆయన యుండియే యున్నాఁడు. “బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి” యని యుపనిషద్వాక్యము. శ్రీ శంకరులు వివేకచూడామణి ౪౨౯-వ శ్లోకమున జీవన్ముక్తుని లక్షణముల నిట్లు నుడివియున్నారు:

“లీనధీ రపి జాగర్తి జాగ్రద్ధర్మవివర్జితః,
బోధో నిర్వాసనో యస్య స జీవన్ముక్త ఇష్యతే”

ఎవని మనస్సు (బ్రహ్మమున) లీనమైయున్నను ఎవఁడు మేల్కొనియుండునో, అయినను జాగ్రదవస్థాలక్షణము లెవరియం దొప్పవో, ఎవరిజ్ఞానము ఏ విషయవాసనలు లేకయున్నదో అతఁడు జీవన్ముక్తుఁడు. ఈవర్ణన సమగ్రముగ మహర్షికిఁ జెల్లుట చూచియున్నాను. ఎవనియునికి జాగ్రదవస్థయందును శాంతముగ నొకఁడై యుండునో వానియందు అంతర్ముఖ

బహిర్ముఖభేదము లొప్పవు. వ్యావహారికమే సత్యమను భ్రమను నిర్మూల మనుకొనుట మాత్రమే అనుభూతి గాఁజాలదు. అద్వయలక్షణప్రాప్తి ముఖ్యతమము. అది యేదన అన్నిటిలోని జీవుల కున్న సంబంధముయొక్క జ్ఞానము. ఈసత్యమునే "అహం బ్రహ్మాస్మి" యను మహావాక్య మెఱిఁగించుచున్నది. 'నేను' వే అని తలంచుటయే అజ్ఞానజన్యము.

అద్వైతప్రమాణగ్రంథమగు 'పంచదశి' యందు ౬-వ యధ్యాయము ౧౩-వ శ్లోకము నిట స్మరింపవచ్చును. అందు విద్యారణ్యులు—

"జగన్నాశము, జీవనాశన మనఁగా నవి యింద్రియ గోచరములు కాకుండుట యని యర్థము కాదు. వాని యథార్థజ్ఞాన ముదయించుట" అని అనియున్నారు. అట్లు గానిచో అనఁగా జీవజగత్తులు గోచరముగాకుండుటే జ్ఞానమగుచో నే ప్రయత్నమును జేకయే ముక్తి లభింపవచ్చును. సుషుప్తియందును, మూర్ఛాద్యవస్థలందును నింద్రియజన్యజ్ఞాన ముండదుగదా! గీత చెప్పున దేమి? ఆత్మ స్వస్వరూపజ్ఞానమును మఱచి తాను జీవుఁడే యనియు, తానే కర్తయనియు భ్రమించి యజ్ఞానమునకు లోనగుచున్నది. జీవదశ నతిక్రమించిన మహర్షి యట్టి మహాపురుషుఁడు, అనఁగా జీవమూలము నన్వేషించి జీవభావన పుట్టుకను గ్రహించునతఁడు మహర్షి యన్నట్లు అన్ని యనుభవములకును మూలమగు పరమార్థమును సత్తారూపమును గ్రహించును. ఉపనిషత్తు లట్టి పురుషుఁడు సర్వగతుఁ డగు నాత్మయే యని పరిగణించుచున్నవి.

మహర్షియనుభవమును దర్శనశాస్త్రోక్తమార్గమునఁ దెలియఁగోరుచో మాండూక్యోపనిషత్తును శంకరవ్యాఖ్యాయుతముగ గౌడపాదకారికలను మాటిమాటికిని మననము చేయనగును. మహర్షి వసించు నాశ్రమదర్శనముచేతకన్న నెక్కువగ నీ మార్గమున మహర్షితత్త్వమును బుద్ధిగ్రాహ్య మొనర్చుకొనవచ్చును. కాని ఆశ్రమదర్శనమున మహర్షియనుభూతిగాంభీర్యము దెలియవచ్చుచున్నది. కొలఁదికాల మాశ్రమమం దున్నవానిపైఁ గూడ మహర్షి మునిఁగియున్న మానంపు ప్రభావము తెలుచు ముద్రిత మగుచున్నది. మహర్షి జీవన సమస్యలను సమూల మెఱిఁగియుండుటచేతనే ఈ సహ్యమానస్థితి యుదయించుచున్నది. ఆ స్థితిని గ్రహించుటకు సాధకుఁడు తన విజ్ఞాన దర్శన పథమున మహర్షిని లక్ష్యముగ నుంచుకొనవలెను.

సనాతనములు, పావనములు నైన యుపనిషదుపదేశములు నవ్యభారతము నెట్లు పునరుజ్జీవించుచున్నవో తెలియఁ గోరువారికి అరుణాచల శిఖరమున వెలుఁగు దివ్యజ్యోతివలె జ్ఞానిజీవితమే మార్గదర్శక దివ్యజ్యోతి యని మహర్షిసన్నిధియందు కొంతకాల మేని గడపి దర్శనశాస్త్ర విషయమున మహర్షిసూక్తిదీపికా భాగ్యమును బడయఁగల్గినచో తెలియఁగలరు.

కృష్ణ కౌండిన్యుఁడు.

---

## 'గారు' శబ్దవిచారము

[శ్రీ వేలూరి శివరామశాస్త్రి]

లోకులు విద్యావృద్ధులకును, వయోవృద్ధులకును 'గారు' తగిలింతురు. సవయస్కులను, బాలురను 'ఏమోయి' యనిగాని, 'ఏమిరా' యనిగాని సంబోధింతురు. పెక్కుకారణములచే అయ్యా, అండీ, ఓయీ ఓసీ, ఏమిరా ఏమేలు మారుచుండును.

గారు అనునది భయభక్తులను దెల్పు మాట. దీని పుట్టుపూర్వోత్తరములుగూడ నట్టివే. ఇది బహువచనమయినను ఏకవచనమున, గలిసిపోయి గౌరవమును వెలిబుచ్చును. ఉదా: తాతగారు. కేవలబహుత్వమును దెలుపుటకు వెంకయ్య పుల్లయ్యగార్లని యందురు. కావున గారు అనుదానిని గౌరవమును దెలుపు ఏకవచన మని యననగును.

గారు అనునది గౌరవమును దెలుపు ఏకవచన మగునెడల గాఁడు అనునది నైచ్యమును దెలుపు ఏకవచనము. ఉదా: ఏలిగాఁడు. ఈ గాఁడు దిగువవర్ణములవారి కంటుకొన్నది. కొందఱు శాస్త్రజ్ఞులు మిడిమిడి సాహిత్యము కలవారిని సాహిత్యగాండ్లనుటకు బదులు గాఁడు ప్రత్యయాంతములని వేళాకోళము చేయుదురు. కల, వాఁడు అను రెండుపదములు కలాఁడుగా మాఱి

కాఁడు కానగును. విల్లు కలవాఁడు విలుకాఁడు. అందము కలవాఁడు అందగాఁడు.

కల+వారు కారు అయి గారు కావచ్చును. అగుచో విలుకాండ్రు అను బహువచనమున శకటరేఫ యెట్టుల వచ్చెను? 'ండ్రు' అను నీసంయోగపు బరువును మోయుటకే శకటము వచ్చెనా? ఇది పరిశీలింపఁదగిన విషయము.

గాఁడు అనునది నైచ్యమును దెలుపును గావున నీలిగాఁడు మొదలగు పదములను దొరతనమువారు తమ సారస్వతమునుండి ఎత్తివేసిరఁట. ఇది ప్రశంసనీయము.

పల్లియలలో నిన్నమొన్నటివఱకును గారు వినఁబడునది కాదు. "ఏమోయి నాన్నా", "ఏమే అమ్మా" అని సంబోధించు బాలురు నేఁటికి నన్ని కుటుంబము లందును జెదురుగాఁ గలరు. మిగిలిన పెద్దల యెడలను, పూజ్యులయెడలను గూడ 'గారు' వినఁబడదు. అది పల్లియల ప్రేమకును, నిరాడంబరతకును పతాక.

పల్లియలందలి పామరులకు 'గారు' అపరిచితము. వా రెంత పెద్దలయినను 'నీవు' అని యందురు. పిల్లలకు 'మీరు' అనుమాట రాదు. ఏలనినఁ బెద్ద లెవరును వారిని మీరు అని సంబోధింపరు. దాన వారి వాఙ్మయమున మీరు అను పదము వ్యర్థము. వా రెంతపూజ్యులనయి నను నీవు అని అమాయకముగా నందురు. క్రొత్తవా రెవరేనివచ్చుచోఁ బిల్లలు వారిని నీవు అని యనుటయు, నింటివా రా కుర్రలను కసరుటయు, కుర్రలు చిన్నఁబోవుటయు మామూలు. ఇపుడిపుడు పల్లెలందును బాలు "ఏమండీ నాన్నా"యనియు, "నాన్నగా"రనియు నేరుచుకొని నాగరకులైపోవుచున్నారు. ఈపదము లాతండ్రికొడుకుల నెంతదూరమునకు నెట్టుచున్నవో, మఱి యా నాగరికత అనగ్నులకంటె నెంత నగ్నమైపోవుచున్నదో వారి తండ్రులు గమనించియుండరు. కుర్రల ప్రేమకిది వేరుపురుగు. పిల్లలకీగా రనునది చాలబారు. నాగరికతకు రూపమేకాని హృదయము లేదు.

బ్రాహ్మణక్షత్రియులు గారుతోడనే పుట్టిరి. వీరు తమలోఁ దమకును, బరులకును గారు. వెలమ వారిలోఁ జిన్నయుఁ, బెద్దయు లేక యొకరి కింకొకరు గారు. వీ రించుమించు గారుమతస్థులు. వీరిలో వీరు తిట్టుకొనునపుడేని మానవునిమీఁది గౌరవము తీసివేసినను గారుమీఁది గౌరవము తీసివేయరు. వీరికి గారు పేరులో నొకభాగమే యాయెను. కావుననే కొందఱు ఫలానావారు 'వెంకటరాయణింగారుగారు' అని చేవ్రాలు చేయుదురని యొకపరిహాసము లాడుదురు.

వైష్ణవులకును, లింగధారులకును గారు రూఢము. ఉదా: అయ్యంగారు, అయ్యవార్లంగారు. అయ్య అనునదే గౌరవమునకు వాచకము. పైని వారు. దాని పైని మఱియొక గారు. అయ్యవారు పేరయినటులును, దానిమీఁద నీగారు ఎక్కినటులును కానిపించును.

అగ్రవర్ణములవారు కొంద ఱితరులవర్ణము వార యక రేమండీ యనిగాని, రేమోయి యనిగాని సంబోధించి ప్రసంగక్రమమున వారివర్ణము నెఱిఁగి నోరు కఱచుకొందురు. గంభీరులు కొందఱు ఏమండీ యనిగాని, ఏమోయి యనిగాని యనకయే తమప్రసంగమును సాగించుకొని పోఁగలరు.

నేఁటి బడులలో సహాధ్యాయులకుఁ గాని, సతీర్థ్యులకుఁగాని గారుపట్టిం పంతగా నున్న చందము కానరాదు.

ఎవరిని నీ వనవలయునో, మఱి యెవరిని మీరనవలయునో యాసంగతి యించుమించుగా నందఱెఱుఁగుదురు. అది తెలిసినయే లోకుల వ్యవహారము తూకముగా నడచును. తూకము తప్పినప్పటికిని యేవ్యక్తి యయినను మీ రనిపించుకొనవలయునని ప్రయత్నించుచో వారిని మీరని వ్యవహరించుట సామాన్యవిధి. ఇఁక నచట గుణమే యున్న యెడల గౌరవింపవలయు నని వేఱె చెప్పవలయునా?

ఔత్తరాహులు గంగాజీ యనియుఁ, గాశీజీ యనియు వ్యవహరింతురు. గంగగారు, కాశీగారు అని తెలుఁగువా రెవరేని యనరుగాని గంగమ్మయని యందురు. కాశెమ్మయని పేరుపెట్టుకొందురు. ఈగారు విషయమున భాషాస్వాభావ్యము వింత. ఇంకొక భాషలో గంగరో ఏనుఁగురో వంటి వింత లుండునా? "వాగ్వైచిత్ర్యాణా మనంతత్వాత్" ఈసముద్రము నిపుడు కదిలింపఁజనదు.

ఇపు డొత్తరేయులీగారు మొదలయిన (ఆపని) బహువచనములఁ దొలఁగించి నీవు (తుమ్ తుమి) చేసి వేయవలయు నని యొక యుద్యమ మారంభించు చున్నారు. కాని యిది సఫలము కాదు. స్వభావము దురతిక్రమము. మదరాసు దొరతనమువారు యస్క్వా రార్స్వ తీసివేసి శ్రీ యనిరి. కాని కోర్టుభాషలో నీవు తప్ప మీరు లేదు. ఇది చింత్యము. లోకవ్యవహారమున నీవు తుడిచి పెట్టుకొనిపోదు.

శ్రేయసికిఁగాని, ప్రియతమునకుఁగాని గారు లేదు. కావనే ఆచార్య గోవర్ధనుఁడు

శా. "ఏమండీ యని పిల్చుచోఁ బరుసమా
 నేమోయి నాఁ బిల్చినన్
సామాన్యం బను, నేమిరా యనుచునున్
 సంబోధనం జేయుచో
నామోదంబు ననుగ్రహం బెవరికా
 నవ్వారె దాంపత్యమున్
స్వాముల్; కానిది పల్కు భార్య, పసనై
 నాథుండు చూపట్టెసిన్"

అని పల్కెను.

పరోక్షప్రత్యక్షములలోఁ దేడాకలవు. "హరి నాగభూషణం ఏం పాడేశాడోయ్", "నారాయణ దాసు ఏం హరికథ చెప్పాడోయ్" అని అందురు. ప్రత్యక్షమున నీ యేకవచన ప్రయోగమును జేయరు. అటులు చేయుచో డొక్క బద్దలగునని వారికిఁ దెలియును.

ప్రతిభగలవా రందఱును ప్రత్యక్షములో గారు తగులును. గోడ చాటునచో మాత్రము పేరే మిగులును. వారు గోడచాటునఁ బొంచుండి ఈ యేకవచనప్రయోగమునకు సంతాపపడవలసినపని లేదు. వారి పేరులే గౌరవమునకుఁ బర్యాయపదములు. కాళిదాసు నెవరును కాళిదాసుగా రని యనరు. మృత్యువు లేనివా రెవరికిని గారు లేదు. ఒకవేళ నున్నను దాని కర్థము లేదు.

ఆ. "కవులు పొగడువేళఁ గాంతలు రతివేళ
 సుతులు ముద్దువేళ శూరవరులు
 రణము సేయువేళ రాకొట్టి పిలుతురు........."

ఆయా స్థలములలో రా కుండు గౌరవము గారుకు లేదు.

ఇన్ని వేదములలో, నిన్ని దర్శనములలో దేవుని చివర నెవరేని గారు చూచియున్నారా?

[ఆంధ్రి]





మహాబలిపురములోని అర్జునరథముపైనున్న శిల్పఖండము

# కర్మసిద్ధాంతము :: భౌతికవిజ్ఞానము



శ్రీ వసంతరావు వెంకటరావు

కర్మసిద్ధాంతానికీ, భౌతికవిజ్ఞానానికీ సంబంధం కుదర్చ వలసిన అగత్య మేల జనించిన దని తొలు దొలుతనే సందేహం కలుగవచ్చును. అనాదిసిద్ధమైన కర్మసిద్ధాంతం భౌతికవిజ్ఞానంయొక్క అవలంబం లేనిదే నిజమహోన్నతస్థానం నిలబెట్టుకోలేదా అని సనాతనులు ఉద్రేకంతో ప్రశ్నింపవచ్చును. ప్రాచీనార్యవిజ్ఞానంయొక్క ప్రతిభ, నిత్యత్వం సగర్వంగా స్మరించుకొనుటకు మారుగా భౌతికవిజ్ఞానప్రాముఖ్యం ఉగ్గడించడం సంప్రదాయవిరుద్ధంగా పరిగణింపబడ వచ్చును. కాని, అట్టి సాహసకృత్యం—అది సాహస మైతే—అత్యంతావశ్యక మైనదన్న దృఢవిశ్వాసంతో ఈ క్లిష్టవిషయచర్చకు పూనుకోవడ మైనది.

విద్యావ్యాప్తితోనూ, విజ్ఞానాభ్యుదయంతోనూ సామాన్యమానవుని విషయపరిశీలనావిధానం మారజొచ్చింది. సదాచార మని, మతాదేశ మని, ప్రమాణశాస్త్రమని, కాలపూజితమని, గౌరవభావంతో అనుసరింపబడుచున్న ఆచారాలని, నియమాలని యథావిధిగా పాటించుట మాని, వైజ్ఞానికాధారంలేని పూర్వాచారాలు నిరర్థకమను భ్రమలోపడి వాటిని విసర్జించడం పరిపాటి కాజొచ్చింది. తత్ఫలితంగా ప్రమాదకర మైన అవిశ్వాస మొకటి బయలుదేరింది; అవిశ్వాసంతో మాత్సర్యం జనించింది. అధికసంఖ్యాకులు సంశయాత్ములౌతున్నారు; వారి చిత్తస్థైర్యం అడుగంటుతూంది. పర్యవసానం: "సంశయాత్మా వినశ్యతి, నాయం లోకోస్తి న పరో న సుఖం సంశయాత్మనః" సంశయచిత్తము కలవాడు నశించుచున్నాడు. సంశయాత్మకు ఈలోకము లేదు; పరలోకము లేదు; సుఖము లేదు.

ఈ అధఃపతన మరికట్టి, ఈదురవస్థ తొలగించాలంటే సంశయాత్ములకు సందేహనివృత్తి చెయ్యాలి. కేవల వేదవిజ్ఞానవ్యాప్తితో గాని, భౌతికవిజ్ఞానవ్యాప్తితో గాని అది సాధ్యంగాదు. ఈరెండిటిని సమన్వయించి సనాతన సంప్రదాయాల ఔచిత్యం, ఆవశ్యకత స్పష్టీకరింపగలిగినప్పుడు సంశయాత్ములు విగతసంశయులై వేదవిజ్ఞానోన్ముఖు లౌతారని ఆశింపవచ్చును. ఈ అభిప్రాయంతో కర్మసిద్ధాంత విషయం ఒక ఉదాహరణముగా ఇచ్చట చర్చించడ మైనది.

వేదవిజ్ఞానసమ్మతమై, హైందవసంప్రదాయాలకాధారభూత మైన కర్మసిద్ధాంతం ఆత్మనిత్యత్వాన్నీ, శరీరక్షణభంగురత్వాన్నీ ప్రతిపాదిస్తుంది. భౌతికశరీరబంధాలనుండి విముక్తమైన ఆత్మ మరల వేరొక శరీరంతో పుట్టి పరంపరగా జననమరణాలు పొందుతూ ఉన్నా, జన్మించేదీ నశించేదీ శరీర మేగాని ఆత్మ కాదు. జీవి చేయు పాపపుణ్యాలు శరీరంతో శిథిలంగాక ఆత్మనాశ్రయించి పరంపరాగతమై జన్మజన్మానికి సంచితకర్మగా పరిణమిస్తాయి. అట్టి సంచితకర్మభారంతో భువిపై జన్మించిన జీవులలో,

"నహి కశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠ త్యకర్మకృత్,

కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజై ర్గుణైః"

"ఎవ్వడుగాని క్షణకాలమైనను కర్మను చేయని వాడుగా నుండడు. ప్రకృతివలన బుట్టిన గుణములచే బరాధీనుడై ప్రతిప్రాణియు కర్మలను చేయుచునే యుండును." కాబట్టి

"నియతం కురు కర్మ త్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యే దకర్మణః."

(భ. గీ. 3-౮)

"నియతమైన కర్మములను చేయుము. కర్మములను చేయకుండుటకంటె కర్మములను చేయుచుండుటే మంచిది. కర్మములు చేయకుండుటవలన శరీరము నిలుచుటకూడ సిద్ధించదు" అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని హెచ్చరించినాడు. విశేషించి

"న కర్మణా మనారంభా
న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనా దేవ
సిద్ధిం సమధిగచ్ఛతి"

(3-౪)

"కర్మల నాచరింపకపోవుటవలన జ్ఞానయోగముచే గలుగు నిష్ఠను పొందడు; కర్మములను విడుచుట మాత్రముననే నైష్కర్మ్యస్వరూప మగు జ్ఞాననిష్ఠను పొందడు." కాబట్టి, సామాన్యులకు కర్మములను చేయకుండుటగాని, కర్మసన్న్యాసముగాని పనికిరాదని స్పష్ట మాతూంది.

ఈకర్మములలో

"యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర
లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ
ముక్తసంగ స్సమాచర"

(3-౯)

"భగవంతునిగూర్చి చేయు కర్మములకంటె ఇతరమైన కర్మములను చేయువారికి బంధము కలుగును. కాబట్టి భగవదర్థమగు కర్మములనే అగత్యము చేయవలసినది".

అనుటవల్ల ఈ యజ్ఞార్థమైన కర్మములనైనను ఫలసంగము లేకుండా చేయవలసినదిగా భగవదాదేశము.

ఈ కర్మ మెట్టి దనగా—

"అన్నా ద్భవంతి భూతాని
పర్జన్యా దన్న సంభవః,
యజ్ఞా ద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మసముద్భవః.
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మా త్సర్వగతం బ్రహ్మ
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్."

(3-౧౪,౧౫)

"భూతములు అన్నమువలన పుట్టుచున్నవి; అన్నము పర్జన్యునివలన పుట్టుచున్నది. పర్జన్యుడు యజ్ఞము వలన కలుగును; యజ్ఞము కర్మములనుండి ఉద్భవిల్లును. బ్రహ్మము, లేక ప్రకృతినుండి కర్మము కలుగునని తెలియుము. ఈ బ్రహ్మము పరమేశ్వరునివలన పుట్టినది. కాబట్టి సర్వగతమైన బ్రహ్మము యజ్ఞమునం దెల్ల ప్పుడును ప్రతిష్ఠితమై యున్నది" అనిన్నీ,

"ఏవం ప్రవర్తితం చక్రం
నానువర్తయ తీహ యః,
అఘాయు రింద్రియారామో
మోఘం పార్థ స జీవతి."

(3-౧౬)

"ఇట్లు ప్రవర్తింపచేయబడిన చక్రమును ఎవ్వడు అనుసరింపడో వానిజీవనము వ్యర్థమగును" అనిన్నీ చెప్పినప్పుడు నియతకర్మలయొక్క అత్యంతావశ్యకత స్పష్టంగా వివరింపబడింది.

భగవానుడు తన్నుగూర్చి

"న మే పార్థాస్తి కర్తవ్యం
త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం
వర్త ఏవ చ కర్మణి.

యది హ్యహం న వర్తేయం
జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే
మనుష్యాః పార్థ సర్వశః.
ఉత్సీదేయు రిమే లోకా
న కుర్యాం కర్మ చే దహమ్,
సంకరస్య చ కర్తా స్యా
ముపహన్యా మిమాః ప్రజాః."

(౩-౨౨,౨౩,౨౪)

"నాకు మూడులోకములందును జేయవలసిన దొక్కటీ లేదు. పొందబడనిదై పొందవలసినదియు లేదు. అయినను నేను కర్మములను చేయుచునే యున్నాను. ఏమనగా, అలక్ష్యభావమున నే నొకవేళ కర్మములను చేయకపోతినేని, మనుజు లందరును అన్నివిధములచేతను నామార్గమే యనుకరింతురు. నేను కర్మములను చేయక పోతినేని ఈలోకము లుత్సన్నము లగును. నేను సంకరము చేయువాడ నగుదును, ఈప్రజలను చెడ గొట్టినవాడ నగుదును" అని వచించినప్పుడు భగవంతుని సర్వవ్యాపకత్వము, సర్వకర్తృత్వము విశదీకరించడమైనది. అంతేకాక, కర్మలు చేయవలసిన ఆవశ్యకత దృఢపరుపబడినది.

విశ్వవ్యాప్తమై, సర్వశక్తిసమన్వితమై నిరంతర జాగ్రదవస్థలో నున్న భగవంతునియొక్క మహిమను ఇట్లు తెలియజేసిన పిదప,

"ఇంద్రియాణి పరా ణ్యాహు
రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి
ర్యో బుద్ధేః పరత స్తు సః.
ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా
సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో
కామరూపం దురాసదమ్"

(౩-౪౨,౪౩)

"ఇంద్రియములను శ్రేష్ఠములుగా చెప్పుచున్నారు; ఇంద్రియములకన్న శ్రేష్ఠమైనది మనస్సు. మనస్సుకంటె ఉత్కృష్టమైనది బుద్ధి—వ్యవసాయాత్మకమగు బుద్ధి. బుద్ధికంటెను శ్రేష్ఠమైనది ఆత్మ. ఈ విషయ మెరిగి ఆత్మచేతనే మనస్సును నిలిపి కామస్వరూపమగు శత్రువును నశింపజేయుము" అని శ్రీభగవానుని బోధనము. ఇదే యుత్కృష్టమైన ఆత్మయజ్ఞమను కర్మ.

ఇక జీవితాన్నిగూర్చియు, మానవునికీ బాహ్యప్రపంచానికీ గల సంబంధమునుగూర్చియు భౌతికవిజ్ఞానము చిత్రించు చిత్రాన్ని పరిశీలింతము. మనభూమి యొక పెద్ద అయస్కాంతము (Magnet). ఈ బృహదయస్కాంతానికి ఉత్తర దక్షిణ ధ్రువాలు గలవు. భూతలం ఒక అయస్కాంతక్షేత్రము (Magnetic field). ఈ క్షేత్రంలో అయస్కాంతబలరేఖలు (Lines of force) వ్యాపించిఉన్నాయి. సూర్యునిచుట్టును నిరంతరంచేయు పరిభ్రమణంలో మన భూమి సెకనుకు సుమారు ౧౯ మైళ్ల వేగంతో పరుగిడుచున్నది. అట్టిభూమి నావరించుకొని ఒక విద్యుదయస్కాంతక్షేత్రం ఉన్నది.

సూర్యనక్షత్రాదులు వేడినీ, వెలుతురునూ అమితంగా ప్రసరిస్తున్నవి. యుగాలతరబడి విరామంలేక తరంగరూపంలో దురూహ్యమైన దీర్ఘయానం చేస్తూన్న తేజోస్త్రాలు రెండున్నూ విద్యుదయస్కాంతతరంగాలే. దృగ్గోచరమగు తేజస్సు, స్పర్శమాత్రాన విశదమగు వేడిమి—వీటితోపాటు సూర్యరశ్మిలో అనేకములైన కిరణములు ఉన్నాయి. ఈ వివిధకిరణముల బారికి జీవులు గురియౌతూనే ఉన్నారు. ఇది కాక అంతర్నక్షత్రాంతరాళాల (Interstellar spaces) నుండి మహాశక్తిమంతములైన కాస్మిక్ కిరణాలు యావద్దిగ్వలయం వ్యాపిస్తూ దారిలో నున్న గోళాలన్నిటిని అనారాధ్యంగా మర్దిస్తున్నాయి. ప్రతిమానవశరీరంలోను లిప్తకు వందలకొలది పరమాణువులను అవి భిన్నంచేస్తున్నాయి. ఆ విషయం మన కిసుమంతైనా తెలియదు.

అంతేకాక, మనశరీరంలోని ద్రవ్యం గురుత్వాకర్షణశక్తికి (Gravitational force) లోబడి ఉన్నది. లక్షలకొలదిమైళ్ల వ్యాసం గల విపరీతమైన నక్షత్రగోళాలు శూన్యాకాశంలో నిరవలంబంగా

ఉండుటకు ఈశక్తియే కారణము. ఈగోళాలలో నున్న ద్రవ్యం పరస్పరాకర్షణబలాధీనమై, అదృశ్య శక్తిబంధాన్వితమై ఉండబట్టి నక్షత్రగ్రహాలు ఆదినుండి నియమితమార్గాలలోనే చరిస్తూ ఉన్నాయి. ఈగురుత్వాకర్షణబలంచేతనే సూర్యునిచుట్టును గ్రహాలును, భూమి చుట్టును చంద్రుడును అనవరతప్రదక్షిణాలు చేస్తూ ఉన్నాయి. పైకి విసరిన ఏ వస్తువైనా సరే ఈబలం మూలంగానే వేగవృద్ధితో క్రిందకు పడి భూతలాన్ని చేరుకొంటుంది. అట్టిబలం, మన శరీరాలలో నున్న రక్తమాంసాస్థిస్నాయ్వాది ద్రవ్యంమీద ప్రవర్తించి మన శరీరాలను, తద్వారా జీవితాలను మనప్రసక్తి లేకుండగనే ప్రేరేపిస్తూంది.

వివిధవాయువులతో మిశ్రమైన వాతావరణం (Atmosphere)భూమి నావరించుకొని సుమారు వంద మైళ్లు ఎత్తువరకును వ్యాపించుకొని ఉన్నది. అంత ఎత్తువరకున్న గాలి భూతలంమీద నున్న ప్రతిపదార్థాన్నీ విపరీతంగా పీడిస్తూఉంది. జన్మించినదాది మన వాతావరణపు ఒత్తిడికి అలవాటుపడిపోవుటచే కానోపు మనము దాని పరిమాణం గుర్తించ లేకపోతున్నాము. పావుఅంగుళం దళసరిగల వెండిరేకులు మోయుటే కష్టము. అట్టిది, ౧౫౫ రేకులు బొత్తుపెట్టి, దాని నొక కంబళివలె కప్పుకొంటే ఎంత ఒత్తిడి కలుగునో అంత ఒత్తిడినే మన వాతావరణము అనుక్షణం కలిగిస్తూన్నది. ఆ ఒత్తిడికి క్రుంగిపోతున్నామంటే అతిశయంగాదు.

అయస్కాంతత్వము, విద్యుదయస్కాంతశక్తి, కాస్మిక్ కిరణశక్తి,గురుత్వాకర్షణబలము, వాతావరణపీడనము మొదలగు అనేకశక్తులకు నాట్యరంగమైన భూతలముపై జీవులు నివసిస్తున్నారు. అట్టిప్రకృతిశక్తుల కర్మక్షేత్రంలో నున్నప్పుడు

"నహి కశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజై ర్గుణైః"

అనుటలో సందేహ మేమున్నది? అట్టిసందర్భంలో

"శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యే దకర్మణః"

కాబట్టి

"నియతం కురు కర్మ త్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః"

అని ప్రతిజీవిని సర్వకాలసర్వావస్థలయందును హెచ్చరించవలసినదే గదా!

సమస్తచరాచరములలోను జీవులకు ప్రాధాన్యమొసగూర్చినది వారి ఇంద్రియశక్తి. ఇంద్రియవ్యాపారములను సర్వప్రాణులలో ధీమంతుడగు మానవుడు సర్వోత్కృష్టుడు. మానవునికి బుద్ధి, ఇచ్ఛ, స్వతంత్రయోచనాసామర్థ్యము ఉన్నకారణంచేత జీవులందరిలోనూ అగ్రగణ్యుడైనాడు. సృష్టియందలి పరమార్థాన్ని గ్రహింప నుద్దేశించి పాటుపడు మానవు లెవరైనా సరే, ఆత్మశక్తిచే ఇంద్రియనిగ్రహ మొనర్చి, భౌతిక ప్రపంచవ్యామోహాల నతిక్రమించి, సుస్థిరచిత్తంతో కార్యసాధనకు పూనుకొనవలసియున్నది. ఇంద్రియనిగ్రహం లేనియెడల ప్రకృతిశక్తుల కధీనమై నిజకార్యసాధనం దుష్కరమౌతుంది. మతంపట్లే గాదు, విజ్ఞానవిషయంలోనే గాదు, సామాన్యజీవిత సందర్భంలో కూడా దీక్ష అత్యవసరం. అందుకనే,

"ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా
సంస్తభ్యా త్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో
కామరూపం దురాసదం"

అన్నారు. భౌతికవిజ్ఞానులు విశ్వవ్యాప్తిని కనుగొను ఉద్దేశంలో అనేక యంత్రాలు నిర్మించి ఆకాశకుహరాలను వాటితో అన్వేషిస్తున్నారు. ఇది యొక విధమైన యజ్ఞ కర్మ మనుట దోషంకాదు. ఎంతెంత మహాయంత్రాలతో పరిశోధిస్తున్నా విశ్వాని కాద్యంతాలు గోచరించడంలేదు; గోచరించేటట్టు లేదు. ఎన్నెన్ని కోట్ల మైళ్లు దృష్టి సారించగలిగితే అంతంత దూరాన్నే తండోపతండాలుగా నక్షత్రాలు కనిపిస్తున్నాయి. సామాన్యంగా ఒక్కొక్క నక్షత్రం సగటున ౨౦ లక్షలకోట్ల కోట్లకోట్లటన్నుల బరువున్న, సుమారు

౧,౪౦౦,౦౦౦ మైళ్ల నిడివిన్ని గల గోళం. ఈగోళాలు ఒకదాని కొకటి కనీసం ౨,౫౦౦,౦౦౦ కోట్లమైళ్లు ఎడంగా ఉన్నాయి. వాటిమధ్య నున్నది శూన్యాంతరాళం. చండప్రచండోష్ణంగల తప్తవాయువు లావరించియున్న ఈగోళాలు దుర్నిరీక్ష్యమైన తేజస్సును ప్రసరిస్తున్నాయి. వాటి తాపక్రమం (Temperature) ౬౦౦౦ నుండి ౬౦,౦౦౦,౦౦౦ అంశాలవరకు ఉండుటచేత తమ మహోగ్రగర్భాలనుండి నక్షత్రాలు అశ్రాంతము తేజోష్ణాలను ప్రసరిస్తున్నాయి. అతిసామాన్యనక్షత్రమైన మనసూర్యుడు ప్రతినిమిషము ౨౫ కోట్ల టన్నుల భారంగల ద్రవ్యాన్ని శక్తిరూపేణ సర్వత్ర వ్యాపింప చేస్తున్నట్లు విజ్ఞానులు లెక్కకట్టినారు. అతిప్రమత్తధనికులట్లు నక్షత్రాలు తమద్రవ్యాన్ని నిర్లక్ష్యంగా దుర్వ్యయ మొనర్చుకొంటున్నాయి. నక్షత్రకాంతి సెకనుకు ౧,౮౬,౦౦౦ మైళ్ల మహావేగంతో కోట్లకొలది సంవత్సరాలు యాత్ర చేస్తున్నది. అయినప్పటికి నక్షత్రాలు యథారీతి మెరుస్తూనే ఉన్నాయి. ఇది మరియొక కర్మయజ్ఞ మంటే సాహసంగాదు.

ఇట్లు, తేజోష్ణాది వివిధశక్తి ప్రసారంతో సృష్ట్యాదినుండి నక్షత్రాలు తమ ద్రవ్యాన్ని వెచ్చిస్తూన్నప్పటికీ, విశ్వంలోని ద్రవ్యపరిమాణం తగ్గిపోతూన్నట్లు కనుపించదు. శూన్యాకాశనిగూఢస్థానాలలో బహుదూరయానం చేసి అలసిన కాంతి మందగామియై, ద్రవ్యంగా పరివర్తన మొందుతూన్న దని ఒకసిద్ధాంతం. అయినప్పటికీ విశ్వంలో నున్న యావద్ద్రవ్యము బహుస్వల్ప మనీ, పరాపరిసాంద్రత గమనించిన పక్షమందు విశ్వంలో ద్రవ్య మున్నదా లేదా అని సందేహ ముప్పతిల్ల జేయునంత క్షుద్రంగా నున్నదనీ విజ్ఞానులు కనుగొన్నారు. విశ్వ మంతా శక్తి ప్రధానంగా వ్యక్తమౌతూంది. అంతమాత్రాన్న ద్రవ్యాన్ని తృణీకరింపరాదు. ఈ అనంత విశ్వంలో ద్రవ్యమంటూ రవంతైనా ఉండబట్టే, నక్షత్రాలు, గ్రహాలు, జీవులు ఏర్పాటవడానికి సాధ్యమయింది.

కాని, యథాతథంగా ఉన్న విశ్వచిత్రాన్ని సమీక్షించినప్పుడు విశ్వశక్తుల ప్రభావానికి ఆశ్చర్యచకితులం కాకతప్పదు. అసంఖ్యాకంగా ఉన్న ఇంతింత బృహద్గోళాలను గతులు తప్పకుండా అనాదిగా నడుపుతూన్న సార్వత్రికశక్తుల అపార సామర్థ్యానికి స్తంభీభూతుల మాటలో విశేషంలేదు. అట్టి తన్మయత్వంలో జగత్సృష్టికి కారణభూతమైన పరమశక్తులకు వినమ్రులై అంజలి ఘటింపనివా రుండరు.

ఆమహాశక్తులనే దైవభావంతో వివిధనామములతో ఆరాధించడం సర్వమతాలలో గాంచవసును. మతానుగుణంగా ఏ ప్రత్యేకనామంతో వ్యవహరింపబడుతూన్నా, తత్వతః విశ్వశక్తులనే అన్నిమతముల వారును హృదయపూర్వకంగా కొలుచుచున్నారు. శ్రీరామ, శివ, లక్ష్మీ, లలితాది సహస్రనామములలో వర్ణింపబడ్డ భగవన్మహిమను పరిశీలించినచో ఆయా దైవములనే యేరూపములతో మానవు లూహించిరో తెలియగలదు. శ్రీ లలితాసహస్రనామావళిలో "విశ్వరూప, ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళి, అనేకకోటిబ్రహ్మాండజనని, ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణి, దేశకాలాపరిచ్ఛిన్న, విశ్వధారిణి, భవచక్రప్రవర్తిని, విశ్వభ్రమణకారిణి, జ్ఞానజ్ఞేయస్వరూపిణి" అనియు, శ్రీలక్ష్మీసహస్రనామావళిలో "సర్వమాయాప్రభంజని, సూర్యచంద్రాగ్నిరూప, గ్రహనక్షత్రరూపిణి, మృతసంజీవిని, కాలచక్రాశ్రయోపేత, కాలచక్రస్వరూపిణి, విశ్వనిర్మాణకారిణి, కృత్తికాదిభరణ్యంతనక్షత్రేష్ట్యర్చితోదయ, బ్రహ్మాండాంతర్బహిర్వ్యాప్త, జగదుత్పత్తి సంస్థాన సంహారత్రయ కారణ, వశీకృతజగత్పతి" అనియు, శ్రీ శివసహస్రనామములలో "ఆకాశనిర్విరూపాయ, సర్వేషాం ప్రాణినాం పతయే, జగత్కాలాయ, సర్వభూతానాం నిలయాయ, కళాకాష్ఠాలవామాత్రా ముహూర్తాహఃక్షపాక్షణ" అనియు, శ్రీరామసహస్రనామావళిలో "విశ్వరూపాయ, కాలస్వరూపిణే, కాలచక్రప్రవర్తకాయ, విశ్వసృజే, విశ్వగోప్త్రే, విశ్వమూర్తయే, సర్వభూతాశయస్థితాయ, సర్వేషాం ప్రభవే, జగత్కర్త్రే" అనియు సంబోధనలు గలవు. పైవన్నియు విశ్వశక్తిపరంగానే ఉన్నవి. సర్వాంతర్యామియగు ఆ శక్తి ఏ క్షణమునగాని నిర్వ్యాపారమై యుండుటకు అవకాశం లేదు. కామరహితమైన శక్తి

పొందవలసిన దేదియును లేదు ; తనకుగా చేయవలసినదిన్నీ లేదు. సర్వదా అప్రమత్తమై యుండుటే దాని స్వభావము. ఆ శక్తి క్రియారహితమైనక్షణాన్ని జగత్తు ప్రళయావృతమై లోకములు తల్లడిల్లుతాయి; జీవులు నశించిపోతారు. ఇదే భగవానుని వాక్యములలో

"న మే పార్థాస్తి కర్తవ్యం
త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం
వర్త ఏవ చ కర్మణి.

ఉత్సీదేయు రిమే లోకా
నకుర్యాం కర్మచే దహమ్,
సంకరస్యచ కర్తాస్యా
ముపహన్యామిమాః ప్రజాః"

అని వున్నది. ఆధ్యాత్మిక దృష్టితో గాని, భౌతిక విజ్ఞానదృష్టితో గాని మానవునికిని బాహ్యప్రపంచానికిని గల సంబంధం విమర్శించినప్పుడు తేటపడు విషయమేమనగా : "అనేక ప్రకృతి శక్తులు తాండవిస్తూన్న భూమిపై జీవనం గడుపు మానవుడు నిర్వ్యాపారుడై క్షణమైన నుండలేడు; ఈ శక్తుల ప్రవృత్తిచే జనించు వికారములకు దాసోహమనకుండుటకై ఆత్మాభ్యుదయకరములగు నిత్యకర్మములను ఆచరించుచుండవలెను" అని. అంతేగాక, ఫలాపేక్షారహితమైన కర్మలు శ్రేష్ఠములను విషయంకూడా భౌతికవిజ్ఞానం సూచిస్తూంది. ఎట్లంటే, ఏకర్మకైనా ప్రతికర్మ ముండితీరునని ఒక ప్రధానసూత్రము. అనుటచేత సత్కర్మలు మంచిఫలములను, దుష్కర్మలు చెడుఫలములను ఒసగక తప్పవు. ఇట్లు, కేవలభౌతికపథాల ననుగమించి, దృగ్గోచరద్రవ్యముపై ప్రయోగాలు సలిపి, చతురమైన యంత్రాలు సృజించి, వాటితో విశ్వాన్ని పరిశీలిస్తూన్న భౌతికవిజ్ఞానంకూడా ఆధ్యాత్మికశాస్త్రములను త్రికరణయా అంగీకరిస్తూంది; వాటికి దోహదమౌతూంది. ఇట్లు, కర్మసిద్ధాంతంయొక్క ఉత్కృష్టత భౌతికవిజ్ఞానదర్పణంలో నిర్మలంగా, స్పష్టంగా ప్రతిబింబిస్తూంది.

ఇట్టి పవిత్రమైన సిద్ధాంతాన్ని సామాన్యమానవులు జీవితంలో అనర్థకరంగా ప్రయోగిస్తున్నారు. అసమగ్రంగా వ్యాపించిన భౌతికవిజ్ఞానాభిప్రాయాలను గ్రహించుసామర్థ్యం లేకనూ, మన ప్రాచీనవిజ్ఞానాన్ని విశ్వసించుటకు తగిన నిదానం లేకపోవుటచే దానిని గౌరవించి పాటించలేకనూ, అలజడిగొన్న హృదయాలతో, అవిశ్వాస మావరించిన చిత్తాలతో, ప్రాచీన విజ్ఞానానికి పెడర్థాలు కల్పిస్తున్నారు; కల్పించి నష్టపోతున్నారు. కర్మసిద్ధాంతవిషయంలో అది స్ఫుటంగా గోచరిస్తుంది.

ప్రాక్పశ్చిమ విజ్ఞానాల సంపర్కంమూలంగా జనించిన అవిశ్వాసంచేత నిత్యకర్మాచరణము పూర్తిగా విసర్జించుటే గాక, క్రియావిహీనులై కాలం వ్యర్థ మొనరిస్తూ వారికి కలిగిన దుఃఖాలకు వారిపూర్వకర్మమే కారణమని సామాన్యులు విలపిస్తున్నారు. ఆవిధంగా వచించు 'నాకర్మం' అను చిన్నవాక్యంలో బ్రహ్మాండమంత అనర్థ మున్నది. అట్టివారు, న్యాయంగా చేయవలసిన ప్రయత్నానికి వారిజీవితంలో స్థానమీయడం లేదు. స్వప్రయత్నరహితంగా సత్ఫల మాశిస్తున్నారు. విత్తు నాటకుండా చెట్టుయొక్క ఫలాన్ని అపేక్షించినట్లుంది. అంతకన్న క్షుద్రమైన చిత్తవికారము వేరొకటి ఉండనేరదు.

భౌతికవిజ్ఞానం బోధించు కర్మసిద్ధాంతానికి 'స్వప్రయత్న'మే హృదయమని నిష్కర్షగా చెప్పవలసిఉన్నది. భౌతికశక్తుల క్షేత్రంలో మానవుడు చరిస్తూన్నప్పటికీ, జడపదార్థంవలె ఆ శక్తులకు లొంగిపోడు. వాటితో అనుక్షణం సంగ్రామ మొనరిస్తూ, తన నాయకత్వాన్ని అధిష్ఠించుకొనుటకే ప్రయత్నిస్తూ ఉంటాడు. అట్టి సంగ్రామాని కెంత సన్నాహ మవసరమో చెప్పనక్కరలేదు. ఈ నిత్యసంగ్రామం ఆధ్యాత్మికక్షేత్రంలోనైతే ఆధ్యాత్మికశక్తి సమకూర్చుకోవాలి; భౌతికరంగంలోనైతే భౌతికశక్తి సముపార్జించాలి. చక్కని కృషి చేసి నిరంతరసాధనంతో యోగులు, భౌతికవిజ్ఞానులు మానవాభ్యుదయానికి జయప్రదంగా తోడ్పడ్డారు. ఇదంతా కర్మయజ్ఞమే.

ఆధ్యాత్మిక భౌతికవిజ్ఞానాలలో ప్రత్యేకించి ఏది సంస్తవనీయ మను చర్చ నిరర్థకము. భిన్నమార్గాల నవలంబించినా రెండునూ మహత్తరమైన ఒక్క లక్ష్యాన్నే దృష్టియం దిడుకొన్నాయి. వాల్మీకి, వసిష్ఠుడు, కశ్యపుడు మొదలగు మునిపుంగవులు ఆధ్యాత్మికంగా లోకోపకారులైతే, న్యూటను, మార్కొనీలు, రామనులవంటి విజ్ఞానులు వేరొకవిధంగా లోకజ్ఞానాన్ని పెంపొందించేరు. ఆ ఋషీశ్వరులకును, ఈ విజ్ఞానులకును అనేకవిషయాలలో సాదృశ్యమే గోచరిస్తుంది కాని భేదం కనుపించదు. జిజ్ఞాస, మనోనిశ్చలత, దీక్ష, నిరంతరకృషి - ఇవి వారి సహజలక్షణాలు. అవి ఏవ్యక్తిలో మూర్తీభవించినా అతడు వంద్యుడే.

ఇట్టి క్లిష్టపరిస్థితులలో భారతీయ ప్రాచీనాధ్యాత్మిక విజ్ఞానవ్యాప్తికన్న మానవకల్యాణానికి వేరొక సాధనం లేదు. చాంచల్యావస్థలో నున్న మానవ సంఘాన్ని శ్రేయోదాయకమైన మార్గ మవలంబింపచేయవలె నంటేనూ, మానవజాతిలో ప్రబలంగా ఉన్న అవిశ్వాసమును, మాత్సర్యమును అంతరింపచేయవలె నంటేనూ ఆధ్యాత్మికబోధన మత్యంతావశ్యకము. అది సాగించుటకు భౌతికవిజ్ఞానాన్ని సాధనంగా గ్రహింపవలసి ఉంటుంది. తత్త్వతః సజాతీయమైన ఈ రెండు విజ్ఞానాలలో ఒకదాని సాహాయ్యంతో రెండవదానిని సమర్థించడం ఎంతమాత్రమూ దోషంగాదు. కాబట్టి, వేదవిజ్ఞానవ్యాప్తి కనుకూలించునంతవరకు భౌతికవిజ్ఞానసిద్ధాంతాలను గ్రహించి, ఉచితమగుపద్ధతిని వాటిని విమర్శించి, సంశయాత్ములకు బోధించి వేదవిజ్ఞానమహోత్కృష్టతను ఎఱుకపరచిన పక్షమందు తదనంతరం వారే విజ్ఞానాభ్యాస మొనర్చి తాము తరించి, తద్ద్వారా లోకకల్యాణానికి తోడ్పడగలరని విశ్వసింపవచ్చును. వేదవిజ్ఞానపరులకైనా, భౌతికవిజ్ఞానపరులకైనా లోకకల్యాణమే ఉత్తమపురుషార్థముగదా!



## ఆచార్యులవారి : :
## : : సమయస్ఫూర్తి

కీర్తిశేషులైన ఆనందగజపతి మహారాజావారి సభలో ముడుంబి నరసింహాచార్యులు అనే ఒక మహాపండితు లుండేవారు. వారు ఆనందగజపతి ప్రభువులవారితో మాట్లాడుతోంటే ముచ్చటగా వుండేదిట.

వోసారి ఆచార్యులవారు సభకి రావడం ఆలస్యం అయింది. ప్రభువులు కనిపెట్టుకొని కూచున్నారు. ఎదురు చూశారు చూశారు. ఆచార్యులవారు ఎంతకూ రాలేదు. ప్రభువుల వారికి విసుగు పుడుతుం దని అనుకుంటుండగా కృష్ణాజినం, ఝారీ చెంబు, కుండలాలూ, శిష్య వర్గంతో ఆచార్యులవారు వేంచేశారు. అలా వేంచేసీ వేంచేయంగానే విప్రోత్తము డని ప్రభువులవారూ, ప్రభువని ఆచార్యులవారూ ఒకరి గౌరవానికి ఒకరు భంగం చెయ్యకుండా ఒకేసారి నమస్కారబాణాలు వేసుకున్నారు. "పండితవృషభులు వచ్చారు, పచ్చని శివాచీ (గడ్డి అని భావంతో) వెయ్యరా" అన్నారు ప్రభువులు ఛలోక్తిగా. ఆచార్యులవారు మాత్రం సామాన్యులా! ప్రభువులవారు ఆమాట ముగించే లోపుగానే వారు ఆసనం అదీ అమర్చుకొని, "చిత్తం. తమబోటి కామధేనువులు వుండగా మాకేం లోటు" అని ప్రసంగం ముగించారు. వారి సమయస్ఫూర్తికి సభలోనివా రందరూ ఆశ్చర్యపోయారు.

—కపిల కాశీపతి

#  తెరలు 

శ్రీ చిలుకూరి నారాయణరావు

బ్రదుకుచావుల మధ్య ఒక తెర. దట్టమైన నల్లని తెర. అది పొగతెర.

ఇది ఒక ఉపమానము కాదు; కల్పన కాదు; భ్రాంతి కాదు.

బ్రదు కెంత సత్యమో, చా వెంత సత్యమో, ఆ రెంటికిని మధ్య వ్రేలాడుతూ ఉన్న ఆ తెరకూడా అంతే సత్యమే.

ఆ తెర కీవల ఇహలోకము; ఆవల పరలోకము.

ఇటువంటి తెర ఇది ఒక్కటే కాదు; ఈ అనంత అజీవజీవాజీవ విశ్వములో అంచెలంచెలుగా మధ్యమధ్య ఇటువంటి ఎన్నో తెర లున్నవి. కాని, మన యిప్పటి జీవితానికిన్ని తరువాతి జీవితానికిన్ని మధ్యనుండే తెరననుసరించే మనము సాధారణముగా ఆలోచించుతాము.

కాని, మన మిప్పుడో, మరికొంచెము కాలమునకో చీల్చుకొనిపోబోయే తెరవంటి ఎన్ని తెరలనో ఇంతకు పూర్వము చీల్చుకొని యిచ్చటికి చేరుకొన్నాము. ఇక ముందుకూడా అటువంటి తెరల నెన్నింటినో చీల్చుకొని పోవలసిఉన్నది.

'మనము' అంటే దేహధారులమైన జీవుల మన్న మాట. జీవ మనేది అణుప్రాయమైనది. అణువు మధ్య ఒక చైతన్యగర్భము. దానిచుట్టును ధనఋణవిద్యుత్కణములు; పరస్పరవిరుద్ధస్వభావముకలవి; స్త్రీపురుష లింగాత్మకములు. ఆ రెండిటి పరస్పరాకర్షణమువల్ల లింగద్వయవిశిష్టమైన క్రొత్త అణువుల ఉత్పత్తి. అణుగర్భతత్త్వ మంతటా ఒక్కటే; దాని ననుసరించి అతి వేగముతో క్రొత్తసృష్టికోస మొకదాని నొకటి వెంబడించి సంచరించే ధనఋణవిద్యుత్కణముల స్వరూపము వేరు.

ఒక్కొక్క జీవాణువు తన తెరను తాను కల్పించుకొంటూ ఉంటుంది. ఆ తెరకు పడుగుదారములు పాంచభౌతికవికారములయిన సూత్రములు; పేకదారములు సుఖదుఃఖానుభవజన్యములైన, మానసికవికారములైన సూత్రములు.

ఈ రెండువిధములైన సూత్రములున్నూ వానిలో తగులుకొన్న జీవాణువునకు బాహ్యములే. వానిలో భౌతికసూత్రము లా అణువునకు కేవలమున్నూ బాహ్యములు; మానసికసూత్రములు ఊర్ణనాభి (సాలెపురుగు) గర్భమునుంచి స్రవించి, తీగ సాగి, తెరగా విస్తరించి సున్నితమైనా బలవంతములయిన సూత్రములవంటి కామక్రోధలోభమోహమదమాత్సర్యము లనే సూత్రములు. జీవాణువనే ఊర్ణనాభిగర్భమునుంచే బయలు వెడలినా, అవికూడా ఆ అణువునకు బాహ్యములే.

భౌతికసూత్రములు స్థూలములు. ఇవి ఎంత దట్టముగా, ఎంత విరివిగా, ఎంత ఊరువుగా జీవాణువు చుట్టున్నూ చుట్టుకొంటే, దాని కంతటి స్థూలదేహ మేర్పడుతుంది. ఆ దేహముఆకారముకూడా ఆ సూత్రముల అల్లిక ననుసరించి ఏర్పడి, వివిధజీవముల దేహాకారము వివిధముగా గోచరిస్తుంది. భౌతికసూత్రములు గట్టివే అయినా వాటికి తమలో తాము కలిసి కూడి ఉండగల జిగురుగుణము లేదు. వాటిని పట్టి ఉంచడానికి జిగురుగల మానసికసూత్రము లావశ్యకములు. మానసికసూత్రముల జిగు రార్చుకపోయి, పెళుసుపారితే భౌతికసూత్రాలు వేటి కవి విడిపోయి రాలిపోతవి.

ఆ జిగు రార్చుకపోవడానికి వేడి అవసరము. ప్రతిజీవోర్ణనాభిన్ని తాను తగులుకొని ఉన్న తెరలోనుంచి విడిపోవడానికి తహతహలాడుతూనే ఉంటుంది. కాని, అది తనలోనుంచి పంపగల వేడి పరిమితము. ఆయాజీవాణువుల స్వభావము ననుసరించి ఆ వేడి ఎక్కువగానో తక్కువగానో ఉంటుంది. ఎక్కు

వయినా తక్కువయినా అది పరిమితమే. తన్నావరించుకొనిఉన్న తెర మందమయినకొద్దీ, దానిలోని జిగురు నార్చివేసి భౌతికసూత్రాలు రాలిపోయేటట్లు చేయడము దానికి ఎక్కువ కష్టమవుతూ ఉంటుంది. అయినా అది తనకు సమీపమందుండే జిగురుదారములను ఆర్చివేయడముమాత్రము మానదు. పొరపొరలుగా తన్ను చుట్టుకొని ఉండే ఆ తెరలోని ఒక్కొక్క భౌతికపుపొర రాలిపోతూఉంటే, ఆ జీవమునకు ఒక్కొక్క చావుగా భాసిస్తుంది. వెంటనే అది ఆపైపొరలో చిక్కుకొంటుంది; ఇదే పునర్జన్మము. చావువెంట జన్మము, జన్మమువెంట చావు—ఈపొరలన్నీ రాలిపోయేదాకా సాగుతూఉండవలసినదే.

జీవాణువేమో తనలోని తాపానుతాపములవల్ల ఈపొరలను నిరంతరముగా దుల్లజేసుకొనే శక్తి గలిగి ఉన్నా, తనలోనుంచి జిగురుదారములను స్రవింపజేస్తూ ఉన్నంతకాలమున్నూ దాని కా తెరలోనుంచి విముక్తి ఉండదు. ప్రాతజిగురు ఆర్చుకపోతూఉంటే, క్రొత్త జిగురు భౌతికసూత్రాలను మళ్లీ దానికి దగ్గరగా చేర్చి దానిని బంధించివేస్తూనే ఉంటుంది. అట్టివాగురలలో తగుల్కొన్న జీవానికి ముక్తి దుర్లభమే.

ఒక్కొక్క జీవాని కొక్కొక్క తెర; దాని తెర నది చీల్చుకొని బయటికి రావడమో, దాని లోనే తన్నుకొంటూ పడిఉండడమో జరుగుతుంది.

సంసార మొక పాలెపట్టు; ఒక జీవి పన్నుకొన్న వల, దానికి దగ్గరగాఉన్న జీవులు తాము పన్నుకొన్న వలలు ఒకదాని, కొకటి తగులుకొని ముద్దలు కట్టుకొని పడిఉంటవి. ఏజీవి కాజీవి తనవలను దుల్లజేసుకొంటూవస్తూఉంటే, "అయ్యో, నాదగ్గర ఉన్న ఆ వల ఏదీ?" అని ప్రక్కజీవి మోహముతో కొంతసేపు దేవులాడి, తనకు దగ్గరగా చేరిన ఇతరవలల స్పర్శ తగలగానే "భయము లేదు; నే నేకాకిని కాలేదు. నాకున్న వలవంటి వింకా నాకు సహాయముగా ఉన్న" వని ధైర్యము తెచ్చుకొంటుంది.

జీవి తా నల్లుకొనిన వలల పొర లొకటొకటిగా విడిపోతూఉంటే, కొంచెముకొంచెముగా దానికి బయటివెలుతురు గోచరిస్తూఉంటుంది. వల అంతా దుల్లిపోగానే మహాప్రకాశములో ప్రవేశిస్తుంది.

ఆ మహాప్రకాశములోకూడా ముక్తజీవుల వ్యక్తిత్వ మంతరించదు. అవి ఆప్రకాశములో ఆనందముతో తాండవము చేస్తూఉంటవి. ఆ అనంతప్రకాశమే ఈశ్వరజ్యోతి. అది విష్ణువు, విభువు; అఖండాకాశము నాక్రమించుకొని, వివిధాకారములను తాల్చుతూ భువనమోహనముగా వెలిగిపోతూఉంటుంది. ఆ వెలుగును చూచి అనుభవించడానికి చర్మచక్షువులు పనికిరావు. దానికి దివ్యచక్షువులు కావలెను. తెరలను రాల్చుకొన్న ముక్తజీవులకే ఆ దివ్యచక్షుర్లాభము కలుగుతుంది.



# బాలానందం



## ఏడంకె ఎంతపని చేసిందీ!

ఆ వేళ వాళ్ల కృష్ణ పుట్టువెంట్రుకలు. అంచేత ఇల్లంతా చాలా హడావిడిగా ఉంది. ఆరుగురు ఆడపిల్లల తరువాత ఒక్కడే మగపిల్లవాడవడంచేత బంధువులందరినీ పిలుచుకొని చాలా వైభవంగా చేసుకుంటున్నారు. దూరంగా ఉన్న వాళ్లఅక్కయ్యలుకూడా అంతకుముందే వచ్చేశారు. నాలుగురోజులు ముందుగానే రమ్మని ఉత్తరం వ్రాసినా వాళ్ల మేనమామ మాత్రం ఇంకా రాలేదు.

అప్పటికప్పుడే ఏడున్నర అయింది. ఎనిమిది గంటలకే ముహూర్తం. మామయ్య ఇంకా రాలేదేం చెప్మా అని వాళ్లందరూ ఖంగారుపడుతున్నారు. అందరికంటే ఎక్కువగా ఉంది ఆరవపిల్ల సుధ ఖంగారు. ఈబట్టలు బాగులేవనీ, ఆబట్టలు కట్టుకుంటా ననీ వాళ్ల అమ్మదగ్గిర మారాం చేస్తోంది. వాళ్లందరూ మాటిమాటికీ వీథిగుమ్మంవైపు చూస్తున్నారు మామయ్యబండి ఆగిందేమోనని. తలంటి నీళ్లు పోసుకొనివచ్చిన కృష్ణకూడా "మామయ్య రాలేదేం నాన్నా" అని అడిగాడు. "ఇప్పుడు నీకు జుట్టు తీసేస్తారు. ఏడవకుండా ఉంటావా?" అన్నాడు వాళ్ల నాన్న. "మరి మామ యొస్తాడా?" అన్నాడు కృష్ణ. "ఆఁ, మామయ్యా వస్తాడు" అన్నాడు వాళ్ల నాన్న.

ఎనిమిది అయిపోయింది! అప్పటిదాకా రాకపోవడంవల్ల ఇక మామయ్య రాడని నిశ్చయం చేసుకొని ముహూర్తంవేళ దాటిపోతుందేమో అని ఆవచ్చిన బంధువులలో మేనమామవరస కల ఒకాయనచేత ఆపని చేయించారు. మామయ్య రాకపోవడంవల్లా, అందరూ కొత్తవాళ్లే అవడంవల్లా కృష్ణ మొదటినుంచి చివరదాకా ఏడుస్తూనే ఉన్నాడు.

ఆరోజున పొద్దస్తమానమూ వాళ్ల మామయ్యను తలుచుకుంటూనే గడిపారు ఇంటిల్లిపాదీ. "వాడు చాలా పెంకివాడ్రా! ఉత్తప్పుడు ఇట్టే అట్టే వచ్చినా కానీ, కావాలన్నప్పుడు వేళకు రాడ్రా" అంది వాళ్ల అమ్మమ్మ. అందరినీ పిలుచుకుని అన్నీ చేసుకున్నప్పటికీ ఏదో ఒక లోటు ఉన్నట్లుగా గడిచింది ఆరోజు.

మర్నాడు పొద్దున్నే ఎనిమిదిగంటలకి పీటల మీద పెట్టడానికి బట్టలూ అవీ పట్టుకుని బండిదిగాడు వాళ్లమామయ్య. వచ్చీరాగానే అక్కడే వీథిలో అరుగుమీద పిల్లలతో బొమ్మలపెళ్లిళ్లు ఆడుతూన్న సుధ "అమ్మా,మామయ్యవచ్చాడేవ్" అని ఒక్క కేక వేసింది. "ఏమిట్రా, నిజంగానే?" అంటూ వాళ్లమ్మ ఇవతలికి వచ్చి చూసి, "అదేమిట్రా తమ్ముడూ! 'పండుగు వెళ్లినపాది' అన్నట్లు ఈరావడమేమిటే, ఇదే నిన్నను వస్తే ఎంత బాగుండును" అంది.

"నిన్న ఎనిమిదిగంటలదాకా కనిపెట్టుకుని కూచున్నారు, వచ్చావే కాదేమిట్రా" అంది వాళ్ల అమ్మమ్మ.

ఇదంతా ఏమిటో అర్థం కాలేదు వాళ్ల మామయ్యకి. మండువాలో కాళ్లు కడుక్కుంటూ "కృష్ణుడేడీ, కనపడటం లేదేం" అన్నాడు. "వాడు నిన్ననే జుట్టు తీయించుకున్నాడుకదూ, అంచేత సిగ్గుపడుతున్నాడు" అంటూ గదిలోంచి ఎత్తుకొని తీసుకొచ్చింది వాళ్లఅమ్మ. కృష్ణని చూడగానే వాళ్ల మామయ్య నిర్ఘాంతపోయి, "ఇదేమిటే, నే నింకా రేపనుకొంటున్నాను" అన్నాడు. ఇంతలోకే వాళ్ల నాన్న వచ్చి కొంచెం కోపంతో "అదేమిటోయ్, నేను ఉత్తరం వ్రాస్తే చూసి వచ్చావా, చూడకుండా వచ్చావా?" అన్నాడు. "మరి దీనిమీద ఏడవతేదీ అని వ్రాయక తొమ్మిదవతేదీ అని వ్రాశావేం?" అంటూ

జేబులోంచి కార్డు తీసి వాళ్ల నాన్న కిచ్చాడు మామయ్య.

"నేను ఏడ్లో లేదీ అని వ్రాస్తే తొమ్మిదని ఎవరు దిద్దారు?" అని కార్డు చూసి తెల్లబోయాడు వాళ్ల నాన్న. వాళ్ల మామయ్య వెనకాలే వచ్చి ఇదంతా వింటూన్న సుధ "ఏదీ నా అంక చూస్తానండు నాన్నా" అంటూ చేతిలోంచి కార్డు లాక్కోబోయింది. "ఉండవే, మధ్య నీగొడవేమిటి" అన్నాడు వాళ్ల నాన్న. "అదికాదు నాన్నా, అది నేనే దిద్దాను చూడనీ" అంది సుధ. "అయితే ఎప్పుడు దిద్దేవమ్మా" అన్నాడు వాళ్లనాన్న. "ఆవేళ నువ్వు పోష్టులో వెయ్యమని నాకు కార్డు ఇచ్చినప్పుడు దిద్దాను నాన్నా" అంది సుధ.

"ఎందుకు దిద్దేవమ్మా"

"ఆవేళ ఎప్పుడో అమ్మ ఎవరింటికో పళ్లు పంపిస్తూ ఏడుసంఖ్య మంచిది కాదమ్మా, తొమ్మిది పెట్టూ అని అక్కతో చెపుతూంటే విని, నేను కూడా, తమ్ముడి పుట్టువెంట్రుకలకు ఏడు మంచిది కాదు కదా అని దాన్ని తొమ్మిదికింద దిద్దాను నాన్నా" అని చిలకలా చెప్పింది సుధ.

ఈమాట వినగానే అప్పటిదాకా కోపంగా ఉన్నవాళ్లంతా ఒక్కమాటుగా కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వారు.

"ఎదురుగుండానే పోష్టాఫీసుగదా అని కార్డు వేసిరమ్మని ఇస్తే ఎంతపని చేసింది" అన్నాడు వాళ్ల నాన్న.

వాళ్ల మామయ్య నవ్వుతూ "ఏమంక ఎంతపని చేసింది" అన్నాడు.

మంచాళ శంకరీదేవి

---

# శివాజీ గెడ్డం

శివాజీ పేరు ఎరుగనివారు ఉండరు. శివాజీ మహారాష్ట్రవీరుడు. మనమతాన్ని, మన జాతిని నాశనం చేయాలని హిందువులను అనేకవిధాల బాధలుపెడుతుండే తురకలను శివాజీ తన అనుచరులతో ఎదుర్కొని వాళ్లను వోడించి, పవిత్రమైన హిందూ మతాన్ని, జాతిని రక్షించాడు. అతడు గొప్ప దేశభక్తుడు. మొట్టమొదట భారతదేశస్వాతంత్ర్యంకోసం ప్రాణాలకు తెగించి పోరాడినవాడు శివాజీమహారాజే అని చెప్పవచ్చును.

శివాజీ పేరు వింటే ఎలాంటి వీరుడైనా భయంతో గజగజ వణకిపోతాడు. అతని సాహసకార్యములను వింటూంటే ప్రతివారి శరీరం శౌర్యంతో పులకరిస్తుంది. శివాజీ ఎంత గొప్పవీరుడో అంత శాంతంగలవాడు. అతడు చాలా దయగలవాడు.

శివాజీకి పిల్లలంటే చాలా ప్రేమ. ప్రతిరోజూ పిల్లలంతా ఆయనచుట్టూ చేరి కథలూ, కబుర్లూ, ఆటపాటలతో కాలక్షేపం చేస్తుంటారు. శివాజీ మహారాజైనా అతనికి గర్వం లేకపోవటంచేత సామాన్యంగానే వుంటుండేవాడు. అందుచేత పిల్లలకు చనవు ఎక్కువ. ఇంకా చిన్నపిల్లలైతే ఆయనవొళ్లో కూచుని, భుజాలమీదకు పాకి, మీసాలు, గెడ్డం పట్టుకొని వూపి నానాఅల్లరీ చేస్తుండేవారు.

వీరు ఎంత అల్లరి చేసినా, పిల్లలమీది ప్రేమ చేత, పాపం, శివాజీ ఎంతమాత్రమూ విసుక్కునేవాడు కాదు. రవంతయినా కోపం వచ్చేదికాదు. వారి చిలిపిచేష్టల్ని చూచి చిరునవ్వుతో మురిసిపోతుండేవాడు. చివరకు వాళ్లంతా యిండ్లకు వెళ్లిపోయేటప్పుడు అందరికీ మిఠాయి పెట్టేవాడు. పిల్లలంతా తమ తలిదండ్రులవద్దగల చనువుకంటే ఎక్కువ చనువుతో శివాజీతో ఆడుకునేవాళ్లు.

ఒకరోజు సాయంత్రం మామూలుగా తురాయి చెట్టుక్రింద శివాజీ పిల్లలతో కూర్చున్నాడు. ఆరోజు శివాజీని పూర్వం నిప్పును ఎలా చేసేవారో చెప్పమని ఒక అబ్బాయి అడిగాడు. అందుకు శివాజీ పూర్వం నిప్పును రెండురాళ్లను తెచ్చి రాయిమీద రాయి కొట్టగా వచ్చిన నిప్పురవ్వలతో నిప్పుచేసేవారని చెప్పాడు.

"అన్నిటికంటే త్వరగా మండే వస్తు వేది" అని అడిగాడు ఒక పిల్లవాడు.

"గుడ్డలు" అన్నాడు రెండోవాడు.

"గడ్డి" అన్నాడు మూడవవాడు.

"కాదు. అన్నిటికంటే త్వరగా అంటుకుని మండేది దూది" అన్నాడు నాలుగోవాడు.

అప్పుడు శివాజీ "మీరు చెప్పిన వన్నీ మండే వస్తువులే. కాని అన్నిటికంటే త్వరగా అంటుకునేది దూది" అని చెప్పాడు.

"జుట్టు కాల్తుందా?" అని యింకోపిల్లవాడు ప్రశ్న వేశాడు.

"తప్పకుండా కాల్తుంది. ఒకరోజు మా అమ్మ చిరుతలను పొయిలో పెడుతుంటే, దానికి చుట్టుకుని వున్న జుట్టుకూడా మంటలో పడి క్షణంలో కాలిపోయింది." అన్నాడు మరొక పిల్లవాడు.

"అయితే రాళ్లతో నిప్పు ఎలా వస్తుందో చేసి చూడాలని పట్టుబట్టారు పిల్లలంతా. వెంటనే వారంతా కలిసి ఎండు ఆకుల్నీ, ఎండుగడ్డినీ తెచ్చి పోసవేశారు. శివాజీ రెండురాళ్లతో నిప్పుచేసి మంటచేశాడు. కుర్రవాళ్లంతా సరదాతో మంటలోకి యింకా ఎండు టాకులను వేస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. శివాజీ తురాయిచెట్టుకు జార్లపడి కునికిపాట్లు పడుతున్నాడు,

కొంతసేపయాక అందులో ఒక కుర్రాడు యిలా అన్నాడు: "గడ్డీ, ఎండు ఆకులూ కాలుతాయని తెలుసుకున్నాం కాని జుట్టు ఎలా కాలుతుందో చూడలేదు."

"గడ్డి త్వరగా కాలుతుందో జుట్టు త్వరగా కాలుతుందో చూడాలి" అన్నాడు మరొకడు.

"మీరు నిజంగా జుట్టుకాలటం యిప్పుడు చూడాలని వుందా?" అని అడిగాడు మునుపు జుట్టు కాలటం చూచిన పిల్లవాడు.

అందుకు అందరూ తప్పకుండా అప్పుడే చూడాలన్నారు.

"అయితే యిప్పుడు మనకు జుట్టు ఎక్కడనుంచి దొరుకుతుంది?" అని యింకొకడు ప్రశ్నించాడు.

పిల్లలంతా జుట్టుకోసం వెతికారు. కాని ఎక్కడా వారికి జుట్టు దొరకలేదు. అందరికీ జుట్టును కాల్చి చూడాలని సరదాగా వుంది. వారందరిలో మునుపు జుట్టుకాలటం చూచిన కుర్రాడు మంచి తెలివితేటలు గలవాడు. వాడికి భయమంటూ లేదు. ఆరోజు ఎలాగైనాసరే వారికి జుట్టు కాల్చిచూపించాలనుకున్నాడు. అతడికి మంచి చక్కటి ఆలోచన తట్టింది. అందరినీ జాగ్రత్తగా చూస్తుండమని, మండుతూన్న ఒక పుల్లను తీసి నిద్రపోతూన్న శివాజీ పొడుగుపాటి గడ్డం చివర అంటించాడు. వెంటనే బుర బుర మని కొంతగడ్డం కాలింది. పిల్లలంతా ఆనందంతో చప్పట్లు కొట్టారు.

శివాజీ వులిక్కిపడి లేచాడు. పిల్లలంతా భయపడి పారిపోయారు. తాను ఎంతో ప్రేమతో పెంచుతూన్న గడ్డం కాలినందుకు శివాజీ విచారపడ్డాడు.

ఈసంగతి ఊరిలో అందరికీ తెలిసిపోయింది. శివాజీగడ్డం అంటించిన పిల్లవాని తల్లి తన కొడుకును శివాజీ క్షమించడని భయంతో ఏడుస్తూ శివాజీకాళ్ల మీద పడి తనకుమారుని దుండగానికి క్షమించమని దీనంగా వేడుకొంది.

అందుకు శివాజీమహారాజు అతిశాంతంతో, చిరునవ్వు నవ్వుతూ యిలా అన్నాడు: "అమ్మా! విచారించకు. ఇందులో నేను క్షమించటానికి ఏమీ లేదు. నేను వాళ్లకు చెప్పిందాన్ని వాళ్లు కుర్రకారుతనంతో ఆచరణలో పెట్టారు. నేను చెప్పిందాన్ని వారు అనుభవపూర్వకంగా గ్రహించారు. అందుచేత నీకుమారుడు నేను క్షమించవలసినంత పనేదీ చేయలేదు." అని ఆమెను ఊరడించి పంపేశాడు.

చూశారా! శివాజీ ఎంతగొప్ప మహారాజైనా ఎంత శాంతవంతుడో!

చిలుకూరి శేషగిరిరావు



మహాబలిపురములో సముద్రతీరమున నున్న ఆలయము

# సుఖ దుఃఖాలు

తారల్లు పైపైన
తైతక్క లాడగా
రేరాజు చుక్కల్లో
హాయిగా నుండగా
నేనేమొ నాలోన
నవ్వొచ్చి నవ్వాను!

తారల్లో రేరాజు
తరలిపోతూండగా
మేఘాల్లో రేరాజు
దోబూచులాడగా
నేనేమొ నాలోన
కన్నీరు కార్చాను!

దూరాన రేరాజు
నను జూసి నవ్వాడు
ఆనవ్వు వెన్నెలై
పరిణామమొందింది!

మేఘాలు ననుచూసి
కంట నీరెట్టినై
ఆనీరు వానగా
మారుచూవచ్చింది!

అంతలో కన్నీరు
అంతలో నవ్వులూ
ఈరీతి రెంటికీ
అన్యోన్య బాంధవ్య
మున్నట్లు తోచింది!

నవ్వులో కన్నీరో
కన్నీట నవ్వులో
గుర్తించ లేకుండ
కలసి యుంటావనే
ఊహలో పడ్డాను!

శ్రీ పిల్లలమఱ్ఱి
వెంకటహనుమంతరావు

# ప్రకటన

అసంఖ్యాకులగు మా పాలసీహోల్డర్లకు, శ్రేయోభిలాషులకు, ఏజంట్లకు సంతోషపూర్వకముగ తెలియబరచునదేమన, 31-12-1940 తేదీతో అంతమైన సంవత్సరములో కంపెనీవారు పూర్తిచేసిన వ్యాపారము మొత్తము

**రూ. 1,54,80,770 లు**

## నేషనల్ ఇన్సూరెన్సు

**కంపెనీ, లిమిటెడ్.**

ప్రధానకార్యాలయం: కలకత్తా. స్థాపితము: 1906

బ్రాంచి ఆఫీసు:

"నేషనల్ ఇన్సూరెన్సు భవనము"

362, చైనాబజారు రోడ్డు, ఎస్ప్లనేడ్, మద్రాసు.

సబ్ ఆఫీసులు:

171, న్యూస్ట్రీట్, మధుర.

F, కెంపెగౌడ రోడ్డు, బెంగుళూరు.

## రాజమోహన హేరాయులు



శ్రేష్ఠమయిన సువాసన గల తలనూనె. మెదడుకు చల్లదనమును కలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, కూడు పోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

**పి. శి. ఏ. అండు కంపెనీ,**

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

మకరధ్వజ స్వభావసిద్ధముగా కటువుగానుండు ఔషధమూలిక. ఔషధము తయారు చేయుటకుముందుగా దీనిని మెత్తనిచూర్ణము చేయవలెను. అటులచేసిననే గాని శరీరమునకు గుణమొసంగదు. కల్వమున ఎంతనూరినను అనుకూల మగు మెత్తని చూర్ణము లభించుట దుర్లభము.

ఇందుమూలమున మకరధ్వజ తఱచు గుణమొసంగదు.

నిస్సందేహముగా గుణమొసంగుటకు ప్రతివారును

# అనుమకరధ్వజ

వాడవలెను




1 సీసాలో 14 బిళ్లలుండును (7 పూర్తి మోతాదులు).

## Bengal Chemical & Pharmaceutical Works, Ltd.,

CALCUTTA & BOMBAY.

మదరాసు ఏజంట్లు:— యన్. దేశాయిగౌండరు అండ్ కంపెనీ, 41, బందరు వీధి.

# కారాగృహ కవాటము

[ క థా ని క ]

## శ్రీ కవికొండల వెంకటరావు

"నీవు దొంగచాటుగా నాకు ఇచ్చే ముద్దు నేను తీసికోనూలేను: నేను దొంగచాటుగా నీకు యీ చెట్టుయొక్క పువ్వు కోసియివ్వనూ లేను. నేను ఖైదీని; అస్వతంత్రుణ్ణి."

"నీవు దొరగారి తోటమాలివి కావూ? అస్వతంత్రుడివా?"

"ఈదొరగారికి తోటమాలీలంటూ వేరే లేరు. దొంగలే తోటమాలీలు."

"ఐతే నీవెప్పుడుమటి విడుదల అయ్యేది?"

"ఎందుకు? నీ కాఊసు?"

"ఊరికేనే."

"మూడురోజుల్లో."

"ఈరోజు కలిపా?"

"ఊఁ."

"ఊఁ" అని ఖైదీ అన్నాడో లేదో జైల్లో సాయంకాలం నాలుగు కొట్టారు. జైలు సూపరింటెండెంటు దొరవారి బంగాళా ముంగిటి పూలతోటయొక్క దక్షిణపు కంచె వార పొగడమొక్కకు నీళ్లు పోస్తూవున్న ఆ ఖైదీ రెండుకుండలూ పూర్తిగా వంచి నీళ్లు వెలలించినవాడై కావిడి ఉత్తిది ఊపుకుంటూ, తన్ను కంచెఆవలినుండి పలకరించిన పిల్లవైపు కనుగిలుపుమాత్రంగానైనా చూడకుండా జైలుఘంట మాత్రోత చెవులు దోరట్టుకు వింటూ, తక్కుం గల ఖైదీ లోకకొందర్ని తనలాంటివార్ని కలిసికొని, తిన్నగా రాజమార్గం దాటుకుంటూ దైనందిన కార్యక్రమాన్ని అనుసరించి జైల్లోకి తరలిపోయినాడు.

ఆక్షణాన్ని అతణ్ణి ఆవరించి అతనినుండి క్రమక్రమంగా జారిపోయినవి అల్లా పిల్ల కళ్లున్నూ, ఆకళ్లముందు పొగడచెట్టునుండి పిల్లగాలికి రాలి అతనిమీద అతనికి తెలియకుండా పడ్డ యొకకొన్ని పువ్వులున్నూ.

పూల నెవరైనా లెక్కపెట్టారా? పిల్ల నెవరైనా కనిపెట్టారా? అసలు జైలుకూ బంగాళాకూ దూర మెంత? ఆదూరంలో రాజమార్గమన్న దెంత? ఇదంతా యెవరైనా ఊహించేరా?

*　　　*　　　*

పై సంభాషణ జరిగింది సోమవారం అనుకోండి. సోమవారం లేదు, మంగళవారం లేదు, బుధవారం పొద్దున్నే జైల్లో ఆరున్నొకటి కొట్టేసరి కల్లా జైలుముందు రాజమార్గంమీద పిల్ల కనిపెట్టు క్కూర్చుని వుంది, కొంచెం వారగా మర్రిచెట్టుక్రింద. పల్లెపల్లెలనుంచి పాలు, అపరాలు నెత్తినెట్టుకువచ్చే జనం తెల్లాఅకుండానే పట్నంలో ప్రవేశించివుండడంచేతనూ, కొత్తగా జైల్లోకి చేరుకోవలసినవాళ్లు అప్పటికప్పుడే జైలుఆవరణలోకి గొంపోబడివుండడం

చేతనూ ఆపరిసరప్రాంతం అంతా నిర్మానుష్యంగా వుంది. మఱీన్నీ నిశ్శబ్దంగా వుంది. ఏదన్నా కూస్తే అది గోరింక! ఏదన్నా పలికితే అది చిలక! కోయి లొకటి రావిచెట్టు తుదవ్రాలింది కాని వాయి విప్పనా మానా అని సంకోచిస్తూవుంది. బహుశా గొంతు సవరించుకుంటూ వుందేమో మంచిపాట పాడ్డానికి. ఎందుకు కాకూడదూ? హేమంత ఋతువును, వసంతఋతువును కేటాయించడానికి వీల్లేని దోసందు సుఖవాసరాలవి. కోయిల మఱి తన గొంతు చక్కబఱచుకోకుండా వుంటుందా? అచిర కాలంలో ఎందుకు పాడకుండా వుంటుంది?

విడుదల గన్న మన ఖైదీ కారాగృహ కవాటం తెరపిని అప్పుడే కనిపిస్తూవున్నాడు. అతనివొంటిని సోమవారంనా డున్న మాదిరి చడ్డీ, బనీను, టోపీ-అన్నీ వొకేరంగు తెల్లటి దుస్తులుగా కనిపించేవి బుధవారం ప్రొద్దున్న లేవు. అత నప్పటికప్పుడే వేసికొన్న దిరీసు అదోరకపు సొంత దిరీసు. కట్టాడు గ్లాస్గో మల్లు పంచె; తొడిగాడు కాసులబొత్తాముల చొక్కా; చుట్టాడు గులాబిరంగు కోరపాగా; నడుచుకుంటూ వస్తున్నాడు రాచమార్గం కేసి. "అదృష్టవంతుడివి: విడుదల గన్నావు" అని విడివడని ఖైదీలు అభినందించేరు. "ఈ పై నుంచి అయినా బుద్ధిగలిగివుండు" అని అధికారులు నీతి గరపేరు. ఏదీ అతగానికి అవలోడనం గావడం లేదు. జైల్లోనుంచి ఆవల పడతానా లేదా అనే ఆందోళనే! ఆవల పడ కేంచేస్తాడు విడివడ్డాక? అతగానికి తోచడంలేదు ఆముక్క. తోచడం లేదు కదా, కవాతుచేసేవాళ్లు 'బెయొనెట్లు' గల తుపాకులు సూర్యరశ్మిలో పైకెత్తినప్పుడు కవాతు చెప్పే యుద్యోగి 'ఎటెన్షన్'అని అఱచినప్పుడు, మనవాని హృదయం 'హూ' త్తన్నట్టు బెదరిపోయింది, మనవాని కళ్లు వ్రాదబడ్డట్టు దృష్టి చెదరించుకొనేవి. ఇదంతా ఎంతసేపు? పదినిమిషాలు. మనం మనం అతగా డేం నేరం చేసివుంటాడూ, అసలెంత కాలం శిక్షపడ్డాడూ, ఆ యిచ్చింది న్యాయమైన తీర్పేనా అని విమర్శించుకొన్నంతకాలంకూడా పట్టలేదు.

జైలుఆవరణ దాటుకొచ్చి వొక్కడూ— ఆ పిల్లయొక్క మనోనాయకుడు అని అందామా?— ఆ అందగాడు రాజమార్గం మీద రాణించాడు.

ఎఱ్ఱని రస్తామీద ఎండ బాగా ప్రసరించివుంది. చెట్లనీడలు తమకు తామే అతనిముందు వొత్తిగిల్లినట్టుగా ఓ వెంపుకు తప్పుకున్నాయి. ప్రకృతికి లోపలా వెలపలా కూడా చాటూ మాటూ లేనట్టు అంతా వెల్తురుమయంగా, బాగనబయలుగా అగపిస్తూ వుంది.

తన తెట్టతెన్నునే పిల్లను చూచాడు. పిల్ల పడుచుపిల్ల. ఎంతో సింగారంగా కట్టుకొచ్చిన ఆకుపచ్చరంగు చీరచెంగు జారు చటుక్కున సర్దుకుంది. ఆ సర్దుకోవడంలో విలాసంగా మెఱయించింది లోతట్టు పట్టం గట్టుకొనియున్న మొదపుట్టువులమీది ఎఱ్ఱరంగు జంపర్. దాడిమీకోరకమా? బంధూకకందుకమా? సంధ్యాప్రబంధమా?

* * *

"ఇప్పుడు నీ వెందు కిక్కడకు వచ్చావు?"

"ఈవేళ నిన్ను విడిచిపెడతా రన్నావుగా?"

"అన్నానా?"

"అన్నావ్."

"అంటే?"

"ఇప్పుడు నన్ను ప్రేమించడానికి నీకేమిటి అభ్యంతరం?"

"ప్రేమ? అది ఈ కారాగృహమం దుంచబడకపూర్వ మేమైనా మునుపూ ముందూ ఉండేదేమో నా గుండెల్లో ఎక్కడన్నా దాగుండి. కనికరించి ఎప్పుడైనా వొకానొక బాటసారిని దోచుకోకుండా విడిచి పుచ్చివున్నానేమో? ఇప్పు డది పూర్తిగా నాయందు వమ్మైనది. ప్రేమ? ప్రేమ? ప్రేమ?"

* * *

పిల్ల చకితయై కన్ను లప్పళించుకుంటూ తనకొంగున కట్టుకొచ్చిన యొకానొక చిన్న పొగడపూల దండను ఆమాత్రపు పదిపద హారుపువ్వు లున్నదాన్ని ముడివిప్పి తీస్తూ గద్గదికగా "మళ్ళీ, మళ్ళీ, మళ్ళీ ఈపూలదండ నెవరిదండ కెక్కించను?" అని అడిగింది. "ఏపూలదండ?" అని అడిగాడు విడివడ్డఖైదీ. "ఇదిగో! ఇదీ! అరదండాలవంటిది గాదు. ఒక్క నిండుదండ, నీకైంది గుచ్చితెచ్చాను, ఇదిగో!" అని అతనిమణికట్టునుంచిన్నీ అది గమనించబోయింది పడుచు. అత డా మణికట్టు సొంతశరీరపు వెన్నెముకకు హత్తుకుంటూ నిలువునా వీరోచితుడై నివ్వెరపోతూ "ఎక్కడి పువ్వులు?" అని ప్రశ్నించాడు. ఆకోమలి యిట్లు బదులాడసాగింది: "మొన్న నీవు నీళ్లు పోసిన చెట్టువి. ఆచెట్టు నీమీద తనపువ్వుల్ని విరజిమ్మిందిగా! వాటిని నీవు దారిపొడుగుతా దులుపుకుంటూ నడచిపోతివిగా జైల్లోనికి? రాజమార్గమును దాటుకుంటూ? నేను నీ వెంబడినే వచ్చి, వెంటవెంటనే, నీనుండి రాజమార్గమ్మీద విడివడిన పదపదహారు పువ్వుల్ని ఏరుకు ఇంటికి గొనిపోయి ఈ ప్రకారంగా దండగ్రుచ్చి తెచ్చాను" అంది అతి అమాయకంగా.

అంటూ వున్న పడుచును తప్పుకోమని ఆ నాయకుడు తన నెత్తిమీది కోరపాగాను అట్టె తీసివేసికొన్నవాడై "పిల్లా! నీ మేలు మఱువజాల! జ్ఞప్తికి దెచ్చినావే నే పెంచిన మొక్కను! నేను నీళ్లుపోసిన చెట్టును! అది పూచినదా? ఆహా! పూచి నాపైని పూవుల్ని రాల్చినదా? ఆపువ్వులేనా యివి?" అంటూ ఆదండను తనదోసిటిలో పెట్టుకుని కళ్ల నద్దుకుంటూ "నాతో చెప్పకుండా నామీద తన కుసుమాలిన్నింటి నభివర్షించిన తరువు నెంతని కొనియాడగలను? దానిని నేను తిరిగి చూడనుగదా? చూడనుగదా? అదేనా దానికొమ్మ? అదేనా దాని రెమ్మ? అదేనా? అదేనా?" అని మునివ్రేళ్లమీద మిక్కిలీ ఎత్తరై ఆ మోకను చూస్తూ వేడి కన్నీళ్లు విడిచాడు.

ఆపురుషుణ్ణి ఆముహూర్తమందు అనునయింపగలిగింది దగ్గర్లో వున్న తరుణ స్త్రీ కానే కాదు. వాని పొగడచెట్టుమీది కెక్కడి నుంచో ఎగిరివచ్చి అప్పుడే వ్రాలి ఆనవాలు గొలుపుతూ పాడిన కొదమకోయిలయొక్క నిరంతరవియోగగీతి! నిరంతరవియోగగీతి! ఆ నిరంతరవియోగగీతి యొక్కటే ఆముహూర్తమందా పురుషుణ్ణి అనునయింపగలిగింది.




# ఆవలింతలు, తుమ్ములు, దగ్గు

శ్రీ వేటూరి శంకరశాస్త్రి

ఆవలింత, తుమ్ము, దగ్గు — ఇవి మానవమాత్రుల కందరికీ కలిగే శరీరధర్మాలు. దినదినం మనం ఎన్నోసార్లు తుమ్ముతూ వుంటాం, దగ్గుతూ వుంటాం, ఆవలిస్తూనూ వుంటాం. ఇవన్నీ మనకు తెలీకుండానే, అనగా మనం గుర్తించకుండానే ఒక్కొక్కప్పుడు జరిగిపోతూ వుంటాయి. కాని కాస్త జలుబుచేసినప్పుడు మాత్రం ఇవి మరీ ఎక్కువగా వచ్చి, మనను కొంచెం బాధపెడతాయి. అప్పుడివి ఒక సుస్తీ యొక్క లక్షణాలుగా భావించి, వైద్యుణ్ణి సలహాచేసి, నయంచేసుకోడం కలుగుతుంది.

ఆవలింత, తుమ్ము, దగ్గు — వీటి సంభవం ఆయుర్వేదవైద్యశాస్త్రంలో ఈ విధంగా చెప్పారు:

## ఆవలింత (జృంభా) :

శ్వాసను ఒకసారి దీర్ఘంగా నోటితో పీల్చి, మళ్లా నోటితోనే (కంట నీరు వెళ్లుతూండగా) బైట వెడలించడం ఆవలింత అంటారు.

## తుమ్ము (క్షుతమ్) :

హృదయస్థానంలో చరించే ప్రాణవాతం, కంఠస్థానంలో చరించే ఉదానవాతం రెండూ కలిసి, శిరస్సులో ప్రవేశించి, స్రోతోమార్గాలన్నిటినీ అడ్డగించి, క్షణకాలం స్థిరంగా వుండి, ధ్వనితోకూడా నాసికారంధ్రంలోంచి బైటికి రావడమే తుమ్ము అంటారు.

## దగ్గు (కాసః) :

పొగ, దుమ్ము, దుష్టమైన ప్రాణవాయువు నోట్లోను, ముక్కులోను ప్రవేశించి శ్వాసను అడ్డగిస్తే తలలో వుండే ప్రాణవాయువు దుష్టమై, వక్షఃస్థలంలోను, నాసికలోను, కంఠంలోను సంచరించే ఉదానవాతంతో కలిసి, కంఠంలో పైకి ఎగతన్ని శబ్దంతో బయటికి రావడమే దగ్గు అంటారు.

ఈవిధంగా సంభవించే, ఈమూడు శరీరవేగాలనూ వాటి మార్గాన వాటిని పోనీకుండా నిరోధిస్తే మరి కొన్ని రోగాలు ఉత్పన్నమౌతాయట!

ఆవలింతను నిరోధించడంచేత మెడ, కంఠం ఇవి స్తంభిస్తాయి. మరిన్నీ వాతాత్మకమైన శిరోవ్యాధులు, నేత్రవ్యాధులు, నాసావ్యాధులు, ముఖరోగాలు, తీవ్రమైన కర్ణరోగాలూ కలుగుతాయి.

తుమ్మును నిరోధించడంచేత తలనొప్పి, అర్దితవాతం, ఒంటిగణకనొప్పి, ఇంద్రియదౌర్బల్యం, మెడ పట్టుకుపోవడం, దగ్గు ఇవి కలుగుతాయి.

దగ్గును నిరోధిస్తే దగ్గు ఇంకా ఎక్కువౌతుంది.

మనుష్యుల కుండే నవరంధ్రాల్లోను, ముఖ్యంగా నోరు, ముక్కు, చెవి ఇవి వైద్యశాస్త్రంలో చెప్పబడే అనేకవిధాలైన సూక్ష్మజీవులకు ఆశ్రయమిచ్చే శరీరమార్గాలు. వీటిద్వారానే అనారోగ్యాన్ని కలిగించే అనేకమైన సూక్ష్మజీవులు శరీరంలో ప్రవేశించి రోగాల్ని కలిగిస్తాయి.

మనం దుమ్ములో, గాల్లో తిరిగేప్పుడు, గాలిని పీల్చేప్పుడు, నోరు తెరిచేప్పుడు అందులో ఏవైనా అనారోగ్యహేతువులైన సూక్ష్మజీవులుంటే, వాటిని శరీరంలోకి పోనీకుండా ఆపిపట్టి సంహరించడానికి చెవిరంధ్రాలూ, ముక్కురంధ్రాలూ గొంతులో కలిసే కూడలిచోట, వాకిలికావలిగా కొన్ని గ్రంథులుండి, అవి ఒకవిధమైన ద్రవాన్ని ఉత్పత్తిచేస్తూ, శరీరానికి హానికలిగించే క్రిములను సాధ్యమైనంతవరకు సంహరిస్తూనేవుంటాయి. ఇట్లా సహజంగా ఉత్పన్నమయ్యే లాలాద్రవం యితరపనులతోపాటు క్రిమిసంహారకంగా కూడా పనిచేస్తూ చేతనయినంతవరకు శరీరాన్ని కాపాడుతూనేవుండేటట్లు దయామయుడైన భగవంతుడు కొన్ని ఏర్పాట్లు చేసేవున్నాడు. చివరకు ముక్కులోను, చెవిలోను, కంటిమీదను భగవంతుడు ఏర్పాటుచేసిన నీచరోమాలుకూడా యిటువంటి ఉత్కృష్టమైన పనికే ఏర్పడ్డయ్యన్న సంగతి మనం తెలుసుకుంటే భగవంతుడు సృష్టివైచిత్ర్యంలో ఎంతస్వల్పవిషయంకూడా ఎట్టి మహోద్దేశంతో చేసిందీ బోధపడుతుంది.

ఆరోగ్యదశలో శరీరగతమైన ధాతుశక్తి సరిగ్గా వుండేవుంటే ఎటువంటి క్రూరమైన సూక్ష్మక్రిములు, వాకిలికావలివారినికూడా దాటి శరీరంలో ప్రవేశించినా, వాటిని లక్ష్యపెట్టక, శరీరబలమే వాటిని చంపి, రూపుమాపి ఆరోగ్యాన్ని కాపాడుతూనే వుంటుంది. ఒకొక్కప్పుడు మన తెలివితక్కువవల్ల మిథ్యాహారవిహారాలు ఆచరిస్తాంటే ధాతుశక్తి క్షీణించడంచేత, ఈవాకిలికావలివారి బలంకూడా తగ్గుతుంది. అప్పుడు వ్యాధికారణాలైన క్రిములు శరీరంలో ప్రవేశిస్తే, వీటి దంష్ట్రాక్రికు శరీరం తాళుకోజాలక అనేకమైన అంటువ్యాధులు కలుగుతాయి. క్రూరమైనక్షయ, కుష్ఠు, విషూచి (కలరా), జ్వరం మొదలైనవాటిమాట అట్లా వుండగా సామాన్యమైన జలుబు, దగ్గుకూడా శ్రుతిని మించిన రాగాన బడుతుంది.

సర్వసామాన్యంగా మనకు కలిగే రొంపకు కారణాలైన చల్లగాలి, ఋతుధర్మాలు, ఆహారవిహారాలు అట్లావుండగా కేవలం శరీరహానిని చేసే సూక్ష్మక్రిములే కారణం కావడం మనం గమనించాలి. cold అనబడే రొంపకూడా అంటువ్యాధిగా వ్యాపిస్తుందని కొన్ని కారణాలవల్ల తెలుస్తుంది.

ఆరోగ్యశాస్త్రవేత్తలు దగ్గు, తుమ్ము, ఆవలింతలవల్లకూడా కొన్నివ్యాధులు ఒకరినుండి మరొకరికి వ్యాపిస్తాయని చెబుతున్నారు. సంకుచితమైన ప్రదేశాలు, గాలివెల్తురూ లేని ఇండ్లు, జనసమ్మర్దం యెక్కువగావుండే ఉత్సవాలు, మహాసభలు, సినిమాలు, కర్మాగారాలు, పాఠశాలలు, క్రిక్కిరిసి కాపురాలుండే యిళ్లు — ఇవన్నీ అంటు జాడ్యాలకు నిలయాలే. ఈప్రదేశాలలో జరిగే అపరిశుభ్రపు పనులు, ఈగలు, దోమలు, దుర్వాసన వగైరాల మాట అట్లా వుండగా, కేవలం మానవసహజమైన ఆవలింత, దగ్గు, తుమ్ములవల్లకూడా సూక్ష్మక్రిములు ఒకరినుంచి ఒకరికి వ్యాపించి వ్యాధులను కలిగిస్తున్నా యన్న సంగతి శాస్త్రజ్ఞానంవల్ల విదితమవుతూంది. అనుభవంకూడా దాన్ని రూఢిచేస్తూంది.

ఒకగమ్మత్తు, అందరూ గమనించారో లేదో!!

నలుగురున్నచోట, ఎక్కడైనా సరే, ఒకరు ఆవలించినా, దగ్గినా వెంటనే యెదటివారు, మరొకరు, ఈపని వారికి తెలీకుండానే చేయడం కలుగుతుంది. సభల్లోను, సినిమాల్లోను, నాటకాల్లోనూ ఈసంగతి మనం బాగా కనిపెట్టొచ్చు! ఒకరు దగ్గితే మరికొందరు ఒకరివెంట ఒకరు దగ్గడం కద్దు. ఈజాడ్యం గాలి తక్కువగా వుండి, జనసమ్మర్దం కలచోటే మరీ ప్రబలంగా వ్యాపిస్తుంది. దీనికి కారణం ఎవరైనా ఊహించారా?

మామూలుగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు జరిగే సమయంలో కంటె, ఏమీ చాటులేకుండా, బహిరంగంగా, ఎక్కువవేగంతో వదిలే తుమ్ము, దగ్గు, ఆవలింతలు లెక్కలేనన్ని సూక్ష్మజీవులను నోట్లోంచి, ముక్కులోంచి, గాల్లో విడవడంచేత, అవి యెక్కువ దూరం ప్రయాణం చేసి, వ్యాధులను ఒకరినుండి ఇంకొకరికి సంక్రమించేటట్టు చేస్తాయి. ఈవిధంగా బయటపడే సూక్ష్మజీవులు మామూలుకంటికి కనపడేవి కావు. తుమ్మినప్పుడు, దగ్గినప్పుడు, ఆవలించినప్పుడు బయటకువచ్చే ఒక నోటి తుపరను సూక్ష్మదర్శిని

(Microscope) లో పరీక్షిస్తే అందులో కొన్నివేల క్రిములను మనం చూడగలం. చూడండి, ఈక్రిందిచిత్రం:

నోట్లోంచి అతివేగంగా వచ్చే తుపర్లు కొన్నిఒక సెకండుకు ౧౫౦ అడుగులదూరం వరకు ప్రయాణం చేస్తాయి. కొంచెం పెద్ద తుపర ౧౨ అడుగుల వరకూ పోతుంది. మిగతావన్నీ ౨ లేక ౩ అడుగుల దూరంలోనే పడిపోతాయి. ఈ తుపర్లలో వుండే క్రిములు ముక్కులోంచికంటె నోట్లోంచియెక్కువగా వస్తాయి. కొన్ని నేలమీద పడి, దుమ్ముతో కలిసి గాలిలో యెగురుతూ యెంత దూరమైనా ప్రయాణం చేస్తాయి. కొన్ని గాలిలో వెంటనే కొంతదూరం వరకు వెళ్లి ఇగిరిపోతాయి. ఇవన్నీ మనం పీల్చే గాలితో కలిసి శరీరంలో ప్రవేశించి, అవకాశాన్నిబట్టి వాటి ప్రాభవాన్ని చూపిస్తాయి.

సాధారణంగా ఒక యింట్లో ఒకరికి జలుబు చేసిందంటే ఇంటిల్లిపాదీ అందరికీ జలుబులూ, పడిశాలూ పడతాయి. దీనికి కారణం యిదే నంటారు శాస్త్రజ్ఞులు.

ఈ విషయాలన్నీ గమనించే కాబోలు, వేద ఋషులు, శాస్త్రకారులు మాత్రప్రాయంగా మన పెద్దలున్నూ కొన్నివిషయాలు యిట్లా చెప్పారు:

"న అసంవృతముఖః సదా జృంభఉద్గారశ్వాసక్షవథూన్ ఉత్సృజేత్" —సుశ్రుతం

"న అనావృతముఖో జృంభాం క్షవథుం హాస్యం వా ప్రవర్తయేత్" —చరకం

"నాసంవృతముఖఃకుర్యాత్క్షుతిహాస్యవిజృంభణం" —అష్టాంగహృదయం

ముఖానికి ఏదీ చాటులేకుండా ఆవలింత, తుమ్ము, తేనుపు, శ్వాస, నవ్వు ఇవి చేయరాదు.

"ప్రసంగాత్ ..........నిశ్వాసాత్ ..........
.......రోగాశ్చ సంక్రామన్తి నరాన్నరం" —సుశ్రుతం

మాట్లాడడంవల్ల, ఉచ్ఛ్వాసనిశ్వాసాలవల్ల రోగాలు ఒకమనిషినుండి మరొకమనిషికి అంటుతాయి.



మాశ్చుసెట్సు (Massachusetts) ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన, డిపార్టుమెంటు ఆఫ్ బయాలజీ అండు పబ్లిక్ హెల్తు ప్రొఫెసరగు యం. డబ్లియు. జెన్నిసన్ గారిచే ఈ ఫోటోగ్రాఫు అల్ట్రాహైస్పీడ్ ఫోటోగ్రాఫీ విధానాన్ని అనుసరించి ౧/౩౦,౦౦౦ సెకండు కాలములో తీయబడింది. దీనిలో కొన్నివేలవరకు నోటితుపర్లు గలవు. సూక్ష్మక్రిములు లెక్కలేనన్ని ఉన్నాయి. తుపరయొక్క మధ్యకొలత ౨ m. m. కి ఇంకా తక్కువే. మరికొన్ని ౦.౧ m. m. ఉన్నవి. ఈ చిత్రాన్ని డాక్టరు సి. ఇ. టర్నర్‌గారు ప్రచురించారు. ౧౯౪౦, డిసెంబరు నెల ఇండియన్ మెడికల్ గెజెట్‌లో ప్రకటింపబడ్డది.)

కాబట్టి దగ్గడంగాని, తుమ్మడంగాని, ఆవలించడంగాని ఇటువంటి పనులన్నీ బహిరంగంగా చేయకుండా, అవి వచ్చినప్పుడు జేబురుమాలు నోటికి అడ్డుపెట్టుకునో, అది జేబులో లేనివారు కొంచెం చేయి అడ్డుపెట్టుకునో ముఖం పెడగా త్రిప్పి, చేయడం మంచిది. మర్యాదగానూ వుంటుంది; ఆరోగ్యహేతువుగానూ. అలా చేయనివాళ్లకు అవతలవాళ్లు తెలియచెప్పడం అమర్యాదగా భావించరాదు. ఇది ఒక విధమైన ఆరోగ్యప్రచారంగా యెంచి ఆనోట ఆనోట ప్రబలప్రచారం జరగాలి.

మనసంఘంలో మర్యాద తెలీకుండా చాలామంది మొహాన దగ్గేవాళ్లు, ఆవలించేవాళ్లు, పరామర్శ

కొచ్చి ఇంటినిండా చీదిపోసేవాళ్లు, పత్రిక గాని, పుస్తకంగాని చదువుతూంటే వెనకాతలికొచ్చి మునిగిపోతున్నట్టుగా చదవాలనే ఆశతో తమ శ్వాసను మన ముఖాన విడిచేవాళ్లు, మంచినీళ్లగ్లాసులు సగంవరకు నోటకరుచుకుని మంచినీళ్లు త్రాగేవారు, పసిపిల్లలను నోట్లో నోరుపెట్టి ముద్దాడేవారూ చాలామంది వున్నారు.

చివరకు భార్యాభర్తలు శయ్యాగృహంలో ఏక శయ్యమీద వున్నప్పుడు గాఢాలింగనంలో కూడా ఒకరి శ్వాస ఒకరు పీల్చకూడ దన్నాడు కామశాస్త్రోపాధ్యాయుడు.

కొందరు మాట్లాడుతూంటే యెదటివారి ముఖం మీద తుపర్లు పడుతూనేవుంటాయి. ఒక 'సనాతనిష్టు' పురాణం చెబుతూంటే యెదట వున్న సరస్వతమ్మ వారి ముఖం తడుస్తూంటుంది. కొంతసేపు ఆరితేనేగాని అటు ముఖం యిటు త్రిప్పడానికి వీలుండదు.

కాఫీహోటళ్ల సంగతి సరే; ఒక్కొక్క కాఫీ కప్పు ఎంతమంది నోట్లో నానుతూవుండేదీ మనం చూస్తూనే వున్నాం.

ఇంకో పెద్దమనిషి మాట్లాడుతూంటే నోటి గబ్బువాసన మనకు ఓకిరింత వచ్చేటట్టు కొట్టుతూవుంటుంది. 'పయోరియా'తో బాధపడుతున్నాననేసంగతి ఆ పెద్దమనిషి గుర్తించలేడు. నోరువాసన యొక్క బాబూ అని మనం చెబుదామా, అమర్యాదగా భావిస్తారు సాంఘికులు!!

ఇవన్నీ అనారోగ్యహేతువు లవడంచేత దురల వాట్లక్రింద మన పెద్దలు చెబుతారు.

పాతకాలంనాటివై నేటికీన్నీ ఆచరణలోవున్న కొన్ని ఆయుస్సాధనవిధులు నవనాగరకుల దృష్టిలో పరిహాసపాత్రా లైపోతున్నాయి.

"నాయనా ! తుమ్ముతున్నారు, వెళ్లకురా !" ముందుతుమ్ము మంచిది కాదురా !! అని పెద్దవాళ్లు చెబితే, ఇప్పటివారు "ఛా! పో! చాదస్తుడా!!" అని ఈసడిస్తారు.

నవనాగరకుల్లో కొందరున్నారు. ఆంగ్లేయ భాషలో అచ్చుపడితేనేగాని వారు ఎంతటి త్రికాలాబాధితమైన సత్యాన్నయినా నమ్మరు.

మన చాదస్తాలలో తుమ్ము ఒక విఘ్నకారణంగా భావిస్తాం.

ఎక్కడ చూచినా, ఎంతమంది పెద్దల్ని విచారించినా దీనికి సహేతుకమైన జవాబు చెప్పినవారు లేరు. ముందుతుమ్ము మంచిది కాదట! వెనక తుమ్ము మంచిదిట!! వెనక తుమ్మితే 'డైరెక్టు కంటామినేషన్' ఉండదుగా మరి! ఆరోగ్యపరంగానే దీనికి అర్థం చెప్పాలని నా ఊహ! ముందుతుమ్మకు విఘ్నకారణం చెబితేనేగాని పనిమీద అటు పోబోయేవాడు కాస్సేపు అటు పోకుండా ఉండడు.

మన ఆచారాలన్నీ చాలావరకు మతంతో పొదువుతూనేవుంటారు!

ఇదంతా ఆరోగ్యప్రచారం కాదూ! మనమే తెలివితక్కువవాళ్లం!! వాళ్లు చెప్పడం బాగానే చెప్పారు. ఇంగ్లీషులో అచ్చుపడితేనేగాని మనం నమ్మం.

చూడడాని కివన్నీ స్వల్పవిషయాలే. కాని ఆరోగ్యానికి కలిగే హానిమాత్రం చాలా గొప్పది. దీన్నిగూర్చి ఎంత ప్రచారం జరిగితే అంత మంచిది. దేహారోగ్యం, దేశారోగ్యంకూడా బాగుపడుతుంది.

---

# లేఖలు

## సాయణ భాష్య పర్యాలోకనానంతరము

గత మాఘభారతిసంచికలో శ్రీజటావల్లభుల పురుషోత్తముగారి 'సాయణభాష్యపర్యాలోకన'మనే వ్యాసము చెప్పదలచినదానికన్న ఎక్కువ సంగతులను చెప్పేటట్లు కనబడుతున్నది. నా 'కొన్ని ఋక్కులు' అనువ్యాసము శ్రీ పురుషోత్తముగారినిసహితం మాకర్షించి సందుల కానందము కల్గినా, విమర్శ నొకకళగా భావించక సందర్భమున కుపయోగకరములుగాని నిందాత్మక వివాదగ్రస్తముల (vituperations, polemics) తో ప్రతివిమర్శ చేయటం సహృదయులకు మనస్కరించదనుకొంటాను. ఉద్రేకము విమర్శకునకు కుతేరా మనుపయోగకారి.

"ఋగ్వేదము యజ్ఞాలు చేయమనిగాని వద్దనిగాని చెప్పదు" అని చేసిన వాక్యం పాఠకుని తప్పుదారి కీడ్చకపోవటమే కాకుండా, అసలు ఋగ్వేదకవుల ఆశయాలను, తత్త్వాలను వ్యక్తపరుస్తుంది. యజ్ఞాలంటే ఋగ్వేదకవులకు చాలాగౌరవమని నేనూ ఒప్పుకుంటాను. కాని అయాజ్ఞిక దైవతాలపైనకూడా ఇంకాగొప్ప గౌరవముంది. సందర్భము ననుసరించి పరిశీలిస్తే "కస్మై దేవాయ హవిషా విధేమ" అనే వాక్యము 'కః' అంటే 'ఎవరు' అనే అర్థమిస్తుందే గాని వేరేఅర్థంకాదు. ప్రతివిమర్శకుల ధోరణి చూస్తే ఇక్కడ యజ్ఞనిషేధము చెప్పాలి. అంతేకాకుండా

"యంస్మా పృచ్ఛంతి కుహ సేతి ఘోరం
ఉతే మాహు ర్నైషో అస్తీ త్యేనం"

(౨-౧౨)

ఈఋక్కులో ఇంద్రుడు లేనేలేడనేవారుకూడా ఉన్నారని తెలుస్తుంది. ఈఋక్కు నిషేధాత్మకమైనా, యజ్ఞానుష్ఠానవిధిగాని, పెద్దలు తదర్థాన్ని అనుమానికంగా తీసుకొనటానికి సరిపోయే వాక్యమానాడౌతుందా? ౮-౧౦౩ మండూకసూక్తము. దీనిని సరిగా పరిశీలిస్తే ఋగ్వేదకవులలో కొందరి దృక్పథంలో యజ్ఞాలెట్లా ఉన్నదో తెలుస్తుంది. ప్రథమ ఋక్కులో "వ్రతచారులైన బ్రాహ్మణులలాగా ఒక సంవత్సర ముండి పర్జన్యునిచేత ప్రేరేపింపబడినవై మండూకములు బాగా బెకబెకలాడిన" వని ఉన్నది. యజ్ఞానుష్ఠాననిష్ఠాగులను బ్రాహ్మణులతో కప్పలను పోల్చటంలోనే కొందరుకవులు యజ్ఞాలనూ తదాచరణశీలులనూ ఎలా ఆదరించారో తెలుస్తుంది. ఐదవ ఋక్కులో "ఉపాధ్యాయుని వాక్కు శిష్యుడను వదించినట్లు ఒక కప్పయొక్క వాక్కును మరియొక కప్ప ఉచ్చరించుచున్నది." అని గలదు. అధ్యాపకులకీగతి పట్టిన దిక్కడ! ఇలాంటి వాక్యాలు కనబడటం చేత ఋగ్వేదమంతా యజ్ఞాలమీద గౌరవ ముంచిందని చెప్పటం సాహసమాత్రము. విష్ణువు తత్త్వశాస్త్రమునకు సంబంధించిన దేవత. ఋగ్వేదమత మంతా యజ్ఞమతమైతే విష్ణువు మొదలైన దేవతలకు, ఉపసూక్తాలకు, మధువునకు,* ద్యావాసూక్తాలకు దీర్ఘతమసూక్తాలలో కొన్నింటికి, యజుర్వేదము వదలివేసిన ఋక్కులకూ స్వస్తి చెప్పవలసివుండేది. ఇవేవీ యజ్ఞమతమునుగురించి ప్రచారం చెయ్యవు. వీటికి తాత్త్వికార్థం (Philosophical bearing) ఎక్కువ ఉంది గాని యాజ్ఞిక దృక్పథము కాదు.

పురోహితశబ్దానికి ౧-౧-౧ లో 'పురోనిహితం' అని అర్థం చెప్పుకోవాలి గాని పురోహితుడనికాదు. ఇక్కడకూడా ఆహవనీయాలు మొదలైన వేమీ తీసికొని రావటానికి పనిలేదు. "అగ్నిమీళే పురోహితం" మనేది ఋగ్వేదకవులు మొట్టమొదట వ్రాసిన సూక్తం కాదు. ప్రాక్ప్రతీచీసంశోధనల ఫలితంగా ద్వితీయ మండలంనుంచి సప్తమమండలంవరకు మొదట వ్రాయబడినవనీ, ప్రథమదశమాలు చిట్టచివరివనీ తేలుతుంది.

---

* మధువును Philosophical gods అయిన విష్ణువు మొదలైనవారికే ఇచ్చారు. వారికి సురతో ప్రమేయం లేదు.

అలాంటప్పుడు "అగ్నిమీళే పురోహితం" అనేది చివరి కూర్పులో (Later compilation) ప్రథమాన ఉన్నంతమాత్రాన మొట్టమొదటిసూక్తమనటం హాస్యాస్పదము. †

ఋక్కులు ఋక్కులే గాని మంత్రాలు గావు. కాని ఋగ్వేదకాలానంతరము వాటిని మంత్రాలుగా వినియోగించారు. ధాతువు 'ఋచ స్తుతౌ' అని గాని, 'మంత్రే' అనిమటుకు గాదు. ఋక్కులు ప్రకృతిలో వివిధరూపాల స్తోత్రాలు. మంత్రశబ్దం ఋగ్వేదంలో విచారణ అనే అర్థంలో చాలాచోట్ల ప్రయోగించారు.

ఋక్కులలో కవిత్వమున్నదనుటకు నిదర్శనాలు చాలా ఉన్నవి. అది ముఖ్యముగా కవితాసంహితే గాని మంత్రసంహిత కాదు. మచ్చునకు ఉషస్సూక్తాలను పరిశీలించినచో నిజము బోధపడగలదు. నే బట్టిన కుందేటికి మూడేకాళ్లని కవిత్వం లేదంటే యాస్కుడన్నట్లు "నైష స్థాణోరపరాధః యదేనమంధో న పశ్యతి" నిజమే ఔతుంది. మంత్రాలలోని (అంటే మాతృకలైన ఋక్కులని) కవిత్వాన్ని యజ్ఞాల్లో నిషేధింప నే నభిప్రాయపడిన ట్లూహించటం పొరబాటో, వాదం (Argument) కొరకు చెప్పిన వాక్యమో అయి ఉంటుంది.

సాయణులొక్కరే వేదభాష్యకర్తలు గారు. ఈభాష్యాలు వారియాజమాన్యంక్రింద పండితపరిషత్తులలో జరిగినవి. ఒకేసందర్భంలో వచ్చినా అదేమాటలకు వేర్వేరుస్థలాలలో భిన్నభిన్నవ్యాఖ్యలు కనబడతై. వ్యాకరణప్రక్రియ సమగ్రంగా లేదు. ఒకవిధమైన సమానత (Uniformity) అదృశ్యరూపంతో విహారం చేస్తుందని గోచరింపకమానదు. అందుచేత సాయణులు వేదభాష్యకర్త లనే విషయానికి నే నొప్పుకోజాలను. అలాంటప్పుడు భిన్నార్థాలు రావడం సహజమే ఔతుంది.

సాయణమాధవులు శ్రీ శంకరదిగ్విజయము వ్రాసినారని చాలామంది పొరబాటున నామసాదృశ్యమును చూచి భ్రమచెందటం గొప్ప ప్రమాద విషయము. శంకరదిగ్విజయకారుడు కేవల మాధవుడు. అభినవకాళిదాసుడ నని తన్నుదా పిలుచుకొన్నాడు. ఈ అభినవకాళిదాసు వ్యాసాచలుని శంకరదిగ్విజయమును పేర్కొనటమే కాకుండా అందులోనుంచి ముక్కకిముక్క తన గ్రంథంలోకి ఎక్కించినాడు. సాయణమాధవు లిలాంటివా రని నే నెరుగను, నమ్మజాలను. వ్యాసాచలుడు ౧౬,౧౭-వ శతాబ్దులవాడు కావటంచేత ఈ శంకరదిగ్విజయకారుడైన మాధవుడు ౧౭-వ శతాబ్దివా డౌతాడు. సాయణమాధవుడు హరిహరబుక్కుల సమకాలీను డగుటచేత ౧౪-వ శతాబ్దివాడు. ఇలాంటప్పుడు సాయణమాధవులు శంకరదిగ్విజయకారు లనటం సర్వ్వబాటుక్రిందికి వస్తుంది.

ఈ సంగతి ఇలా ఉంటూ ఉండగా శ్రీశృంగగిరి రికార్డులలో గురువంశకావ్య మనే ఒక చిన్న గ్రంథమున్నది. అందులో సాయణుడు శ్రీ మాధవవిద్యారణ్యుల శిష్యుడనీ, వారు పుత్రసంతానహీనులనీ, తను చేయు శుశ్రూషకు గురువులతా రనుగ్రహించి తమ గ్రంథములలో కొన్నింటికీ, తమ యాజమాన్యమున జరిగిన కొన్నిగ్రంథములకూ శిష్యుని పేరు పెట్టినారనీ తెలుస్తుంది. వంశపరంపరగా పీఠాల్లో వస్తున్న రికార్డులను అసత్యాలనటం అసమంజసం. పాఠకు లీ గ్రంథంకూడా పరిశీలించి ఋగ్భాష్యము సాయణుడు వ్రాసినాడో, విద్యారణ్యుడు వ్రాసినాడో, మరి ఇంకా ఎంతమంది వ్రాసినారో తేల్చుకోవలసి ఉంటుంది.

పురాణశబ్దమునకు నేను వాడిన అర్థము 'ప్రాచీన గాథ' అని. ప్రస్తుతపురాణాలు తర్వాతి కల్పితగ్రంథాలు. బ్రాహ్మణాల్లో పురాణేతిహాసగాథానారాశంసీలు కనబడతై. పొరబాటున క్రిందటివ్యాసంలో "బ్రాహ్మణములందలి పురాణగాథ" యని నే ననవందులకు పాఠ

† మెక్డొనలు, వింటర్నిట్జ్ గారల సంస్కృత వాఙ్మయచరిత్ర లీవిషయాన్ని చక్కగా చర్చించినవి.

కులు క్షమించాలి. అసలు శబ్దవ్యుత్పత్తి సరిగా బోధపడుతూంటే 'పురాణ' గాథ పుక్కిటికథ ఔతుంది.

ప్రకృతిరహస్యమును, కవితాసౌందర్యమును వేదములో కనిపెట్టినది నేను గాదు, వేదకాలపుకవులే. అవి కళోపాసకులను వివేచకులకు బాగా స్ఫురిస్తై. అంతేకాని కవితాప్రపంచంలో discoveries లేనే లేవు. "ఋగ్వేదకవులు ఎంత సర్వసాధారణ(Common place) విషయమునైనా సరే కవితాశ్వత్యగలవారగుట చేత కవితతో చిత్రించినారగుటకిదే నిదర్శన"మని నేను స్కందస్వామివారి వ్యాఖ్యపై వ్రాసిన పంక్తులు. ఈ విషయము స్ఫురించకపోవుట విద్యారణ్యుల తప్పు గాదు. వారిక్రింద పనిజేసినవారి తప్పు. ఒకవేళ ఆపనిచేసిన వారికిది తెలిసినా సమయస్ఫూర్తి ఏకొద్దిమందికో. "యజ్ఞాలంటే చాలాగౌరవం" కలిగిన ఆరోజుల్లో, ఈ స్వల్ప anatomy విషయం 'మంత్రకాండ' అనుకొనే ఋగ్వేదంలోకి వస్తుందని వారెలా ఊహించగలరు? ఇక, కార్యకారణాభేద విషయములోనే కవిత్వమున్నదని చెప్పినట్లు తలమటలో నే నావ్యాఖ్య క్రింది సదుద్దేశాన్ని శంకించవలసి వచ్చింది. భాష్యాలు, భాష్యాలమీద వ్యాఖ్యానాలు, వాటిమీద టీకలు, టీకలమీద ఇంకా ఏవేవో చదువుకొనేవారికి సదుద్దేశాలు ఇంకా ఏవో చాలా ఉంటై. ఉద్రేక పూరితులకు దృష్టి అమాంతం చలించటం కద్దని ఒక లోకోక్తి జర్మనుభాషలో ఉంది. ఈ physiological విషయాన్నిగూడా చక్కనికవితలో ఇముడ్చటమే కవితాలక్షణం. ధ్వనికారు లన్నట్లు "కాంతాకుచకలశవద్గూఢమైన్యైవ చమత్కారకారిత్వం". మరీ నిగూఢంగా ఉండటంచేత తప్పుడువ్యాఖ్యానాలు బయలుదేరినవి.

"అంగి + రస్ శబ్దంలో మొదటిభాగమునకు స్వతస్సిద్ధముగనే అగ్ని అర్థమైయుండగా, రెండవ భాగమునకు కార్యకారణముల కభేదముచే అగ్ని అర్థమవును" అన్న వాక్యమందలి సయుక్తి ఒక దృష్టాంతం తీసికొంటే త్వరగా బోధపడుతుంది. 'మనశ్శిలా'శబ్దంలో 'మనస్సు', 'రాయి' అనే అర్థాలిచ్చే పదా లున్నవి. కాని సమాసంలో ఒక ధాతురస విశేషాన్ని తెలుపుతుంది. వీరి వ్యాఖ్యననుసరిస్తే అలా కాకూడదన్నమాట! ఒకవేళ అలా ఐనా 'మనస్సు', 'రాయి'అనే రెండర్థాలు మాయమవటం వారికి రుచింపదుకాబోలు! సంస్కృతభాషకు Reformation, Renaissance తీసికొనివస్తే ఇలాంటి చిక్కులు పటాపంచలై పోతై! అలాంటి పరిణామం మనోహరము, శ్లాఘనీయమున్నూ!

స్కందస్వామి నాయూహకు ప్రబలాధారమివ్వలేదని ఊహించటం నిరర్థకమైనభ్రమ అనిపించుకొంటుంది. వారి వ్యాఖ్యను తిరిగి నే నుదాహరించి చర్చించి 'వృథాప్రయాస' పడేకన్నా పాఠకులే దానిని తిరిగి పరిశీలించి నిజము తేల్చుకొందురుగాక యని ఆశిస్తున్నాను. స్కందుని వ్యాఖ్యను "ఇది యొకదారిగా నున్నది" అని ఉపేక్షబుద్ధితో వదలివేసి సాయణులే సరిగా వ్యాఖ్యచేశారనటం అర్థాంగీకారమో, విధిలేక అన్నమాటో తెలియదు.

నేనేనో ఋక్కులకు నూతనార్థము తెచ్చిపెట్టుతున్నాననను. సాయణభాష్యముకన్నా ప్రాచీన వ్యాఖ్యలు పరిశీలించి, వాటిని నేటి పాశ్చాత్యవ్యాఖ్యలతో సరిపోల్చి నిజమైన అర్థమేదో కనుగొనుటకే నేనీఋక్కులను పరిశీలించటం. సాయణులను ఖండించి కీర్తిప్రతిష్ఠలు చెందుదామని కాదు. సాయణులకన్నా ప్రాచీనవ్యాఖ్యలు-బాగా నమ్మదగినవ్యాఖ్యలుఉన్నవనీ, కొన్ని ఋక్కులు సరియైన అర్థసహితసంప్రదాయము లేకపోవుటచే చక్కగా అవగతముచేసికొనబడలేదనీ, కొన్ని వ్యాఖ్యలు వ్రాతప్రతులలోనే ఉండి ఈమధ్యనే ప్రచురితాలు కావటంచేత అందరికీ అందుబాటులో లేవనీ, అందుచేత సాయణులే సమగ్రవేదానికి 'సత్యమైన' వ్యాఖ్యాతలని అనుకొనే దురభిప్రాయమో సదభిప్రాయమో ప్రబలమైపోయిందనీ, ప్రస్తుత చారిత్రక తులనాత్మక (Comparative) సిద్ధాంతరీత్యా సరియైన అర్థం తీసికొనివచ్చుటకు ప్రయత్నింపవచ్చుననీ పాఠకలోకానికీ, వివేచకులకూ అందజేయుతలంపే నన్నీపనికి పురిగొల్పింది. నావ్యాఖ్య సబబనిగాని, సాయణులే నిజమైన అర్థం చెప్పినారనిగాని నేబట్టిన కుందేటికి మూడే కాళ్లనే సామెత

ప్రకారంగా చెప్ప సాహసింపలేను. సాయణులు పూర్తిగా సత్యమైన వ్యాఖ్య చేశారని ఒప్పుకోలేను. నావిమర్శ ఒక అన్వేషణం (Query) లాంటిది.

నావే నిజాలని చెప్పేవాడిని కాదు కాబట్టి, వాటిని పాఠకులెవ్వ రంగీకరింపకపోయినప్పటికీ నాకు కలిగే ఇబ్బంది ఏమీ లేదు. వీటివలన నూతన విమర్శలూ, నిజమూ బయటపడతాయనే నా ఆశయము.

"పురాణమిత్యేవ న సాధు సర్వం
నచాపి కావ్యం నవ మిత్యవద్యమ్,
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

ప్రతి విమర్శకులు ఇంకా ఒక పెద్ద పొరపాటు చేశారు. మాధవ నిదానమును సాయణమాధవులే వ్రాశారట! గ్రంథనామధేయంలో మాధవశబ్దం కనపడినంతనే దాన్ని మాధవుడే వ్రాశాడంటే విమర్శనాబుద్ధి మనకు కావలసినచోట్లలో స్థూలబుద్ధిలోకి పరిణమించిన దన్నమాట. నామసామ్య ముండగానే చాలదు ఏకకర్తృత్వ స్థాపనకు. జ్యోతిర్విదాభరణము కాళిదాసు పేరనే వ్యవహరింపబడుతున్నా దాన్ని శాకుంతల కర్త కంటగట్టితే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో ఇదీ అంతే.

మాధవనిదానము మెహర్చంద్ లక్ష్మణదాస్ గారిచే లాహోరునుండి ఒక ప్రతి ప్రకటింపబడినది. దానిని మహామహోపాధ్యాయ శ్రీవిజయరక్షిత శ్రీకంఠ వ్యాఖ్యలతో శ్రీ దీనానాథ శాస్త్రిగారు ముద్రితం చేశారు. వారిపీఠిక ౧-౨ పేజీలలో మనం గ్రహింపదగ్గ కొన్ని ముఖ్యవిషయా లున్నవి.

"చక్రదత్తనామక గ్రంథనిర్మాతలైన శ్రీచక్రపాణి మహాశయులు తమ సిద్ధయోగమనే గ్రంథంలో మాధవనిదానాన్ని బాగా అనుసరించారు. వీరు క్రీ. శ. పదకొండవశతాబ్దానికి చెందినవారు. అదేగాకుండా ఈ మాధవనిదానం హరూనల్రషీద్ కాలంలో అరబ్బీభాషలోకి తర్జుమాచేయబడింది. ఈహరూనల్రషీద్ క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దానికి చెందినవాడని చారిత్రక పరిశోధనలవలన తెలుస్తున్నది. అందుచేత మాధవనిదానగ్రంథకర్తయైన మాధవుడు ఏ ఏడవశతాబ్దమువాడో అయివుంటాడు." పైగా గద్యలో "ఇతి శ్రీమాధవకర విరచితే" అని కనిపిస్తుంది. మామూలుగా సాయణమాధవుల గ్రంథాల్లో "మాధవీయే" అనే ఉంటుంది. సాయణమాధవులు హరిహరబుక్కల సమకాలీనులు కావటంచేత ౧౪-వ శతాబ్దివారు. కాబట్టి ఈమాధవకర, మాధవులకు ఏడు శతాబ్దాల వ్యవధి ఉంది. ఇలాంటప్పుడు సాయణమాధవులే మాధవనిదానము వ్రాశారనటం కేవల సాహసమాత్రం. ఈ మాధవనిదాన వ్యాఖ్యాతలైన విజయరక్షిత శ్రీకంఠదత్తులు పండ్రెండవశతాబ్దికి చెందినవారు. ఇన్ని విషయాలు కంటికి కట్టినట్లు కనపడుతూ ఉండగా సాయణ మాధవులు మాధవనిదాన కర్తలంటే ఏమనాలో తెలియదు.

—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

* * *

## సాయణభాష్య పర్యాలోకనము (ii)

'కొన్ని బుక్కలు' అను శీర్షికగల తమ రెండవ వ్యాసములో శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఏడుబుక్కల యర్థమునుగూర్చి విచారణ చేయుచు నందాలు బుక్కలకు సాయణులు వ్రాసిన యర్థ మసంగతముగ నున్నదని సులభముగ తేల్చివైచినారు.

సవితదగ్గర నున్న రెండు లోకములు ద్యులోకభూలోకము లని సాయణులును, ద్యులోకాంతరిక్షలోకములని స్కందస్వామియు వ్రాసిరి. ఈ వ్యాఖ్యాతలిద్దరును మహాపండితులు, విమర్శకులు. కనుక వారిని మనము జాగ్రత్తగ నర్థము చేసికొనవలెను. ఇచట స్కందస్వామి వ్రాసిన భావమునకును, సాయణులు తెల్పిన భావమునకును వైరుద్ధ్యము లేదు. ద్యులోకమున కవ్యవధానముగ క్రిందనున్నది యంతరిక్షము కావున నీ రెండును సవితకు సమీపమున నున్నవని స్కందస్వామి నుడివినాడు. సాయణులు ద్యులోకభూలోకములు సమీపమున నున్న వనుటకు కారణ మేమన: అంతరిక్షము భూలోకముకంటె హెచ్చుగ తిర్యగ్వ్యాప్తి కలది. ఈ తిర్యగ్వ్యాప్తివలన నిది

భూలోకపు సీమలను దాటినది. ఇంతింత దూరము దీని తిర్యగ్వ్యాప్తి కలదని చెప్పలేము. యమలోకములో గూడ నీ యంతరిక్షము వ్యాపించియున్నది. భూలోకమును దాటి దక్షిణపూర్వ దిక్కుగా పోవుచో యమలోకము తగులును. "దక్షిణపూర్వస్యాం దిశి నారకః" అని తైత్తిరీయారణ్యకము చెప్పుచున్నదికదా. కావున అంతరిక్షములోని కొంతభాగముమాత్రమే భూలోకముకంటె సవితకు దగ్గరగ నున్నది. మిగిలిన యపారమైన యంతరిక్షము భూలోకముకంటె సవితకు దూరముగ నున్నది. ఈ భావముతోనే, అనగా అంతరిక్షము యొక్క యీ తిర్యగ్వ్యాప్తిని మనస్సులో నిడికొనియే సాయణులు అంతరిక్షముకంటె భూలోకము సవితకు సమీపమున నున్నదని తెల్పినారు. శాస్త్రిగారు సాయణుల హృదయమును గ్రహింపలేక యొక్కపెట్టున సాయణభాష్యమును ఖండించివైచినారు.

మరుత్తులు ద్యావాపృథివులను వృష్టిప్రదానాదులచే వృద్ధి నొందించిరని సాయణులు ఋ. వే. ౧-౮౫-౪ పై భాష్యము వ్రాయుచు తెల్పిన యభిప్రాయమును శాస్త్రిగారు తప్పుపట్టుచున్నారు. మరుత్తు లలంకారములను పెట్టుకొన్నవారగుటచే నీ రెండు లోకములకు వారు సౌందర్యమును వృద్ధి నొందించుచున్నారని శాస్త్రిగా రనుచున్నారు. మరుత్తులు లోకమునకు వర్షము నిచ్చుచున్నా రని యితరస్థలములలో కలదు కాన సాయణుల యర్థము సుప్రతిష్ఠితము. శాస్త్రిగారి యర్థము స్వీయకవితామూలకము. మరుత్తులు వర్షము నిత్తురను భావము తైత్తిరీయ సంహిత ౨-౮-౪ లో కలదు. వర్షముచే మరుత్తులు భూలోకమునకే వృద్ధిని కల్గించినవా రగుదురు కాని రెండు లోకములకును వృద్ధి నెట్లు కల్గింతు రని శాస్త్రిగారి సందేహము కాబోలును! భూలోకములో వర్షము కురియుట, పంటలు పండుట యను రెండును జంటగ వేదములలో పేర్కొనబడినవి. "పర్జన్యో వర్షతు ఓషధయో నః పచ్యన్తాం యోగక్షేమో నః కల్పతాం" మున్నగు వేదవాక్యములవలన నిది స్పష్టము. భూలోకములో నైశ్వర్య ముండుచో మనుష్యులు క్రతువులను హెచ్చుగ చేసి దేవతలను హెచ్చుగ సంతోషపెట్టుదురు. "యదఙ్గదాశుషే" యను ఋక్కులో నీభావమున్నట్లు నేను వెనుకటి వ్యాసములో వ్రాసియుంటిని. ఇట్లు క్రతువులవలన ద్యులోకము వృద్ధినొందును. వర్షమువలన పంట, దానివలన యజ్ఞములు, వానివలన ద్యులోకవృద్ధి. కావున మరుత్తులు వర్షాదులచే నుభయలోకములకును వృద్ధిని గల్గించినవారైనారు. ఆదిశబ్దమును సాయణులు సార్థకముగ వాడినారు. శాస్త్రిగారు దానిని గుర్తించినట్లు కనపట్టదు.

ఋ. వే. ౧-౩౫-౯ పై సాయణులు భాష్యము వ్రాయుచు సవిత సూర్యుని పొందుచున్నాడని చెప్పుటను శాస్త్రిగా రాక్షేపించుచున్నారు. సవితృసూర్యులకు మూర్తిభేదమే కాని వాస్తవిక భేదము లేదు కదా! అట్టిచో సాయణులు సవితయే యవస్థాంతరమును సూర్యుడగుటను పొందుచున్నా డనుటలో నేమి తప్పున్నది? ఇది మిక్కిలి సరళమైన యర్థము. శాస్త్రిగా రంగీకరించిన ప్రథమార్థములో ద్వితీయ చెప్పుకొనుటకంటెను, 'సూర్యం' అను పదమునకు సూర్యసంబంధమైన పర్వతమని యర్థము చెప్పుకొనుటకంటెను, "పొందుచున్నా" డను దానికి "మార్గము చూపుచున్నా" డని యర్థము చెప్పుకొనుటకంటెను సాయణులు సూచించిన యర్థము హెచ్చుసరళముగమాత్రమే కాక సరసముగ కూడ నున్నది.

ఋ. వే. ౧-౮౫-౪ లో గల 'వృషణం' అను పదమునకు సాయణులు "కోరికలను వర్షించు యజ్ఞము" అని యర్థము చెప్పగా శాస్త్రిగారు "కోరికలను వర్షించు ఇంద్రుడు" అని యర్థము చెప్పవలె ననుచున్నారు. వృషణశబ్దము ఇంద్రు డనునర్థమున వేదములో నితరస్థలములలో వాడబడుటయే తమ కాధారమని శాస్త్రిగారు వ్రాసినారు. ఇంద్రుడు యజ్వలకు కోరికల నిచ్చువాడైనట్లే యజ్ఞముకూడ కోరికల నిచ్చునది కావున దానికి వృషణశబ్దము నెందులకు వాడరాదు? యౌగికార్థమును హతమొనర్చువిధముగ నీ విధముగ నీ పదము ఇంద్రునియందు రూఢమైనచో యజ్ఞమను నర్థమును చెప్పుకొనుట కాక్షేప ముండవచ్చును. కాని యీ పదము యౌగికార్థమున వాడబడుచునే యున్నది. తైత్తిరీయ సంహితలో "మారుతమసి ...

వృషణం" (౨-౪-౮) అనుచోట 'వృషణం' అను పదము వాయువునకు విశేషణముగ వాడబడినది. అట్టిచో యజ్ఞమువలన కోరికలు ఫలించును గావున యజ్ఞమును తెల్పుటకు 'వృషణం' అని యేల వాడరాదు? ఈ యర్థమునే యిచ్చెడు 'కామధుక్' విశేషణము యజ్ఞమునకు వాడబడుచునేయున్నదికదా!

"అద్య క్రియాః కామదుఘాః క్రతూనాం
సత్యాశిషః సంప్రతి భూమిదేవాః"

అను భారవివాక్యములోను,

"ఏష వోఽస్త్విష్టకామధుక్"

అను గీతావాక్యములోను నీ విశేషణము గన్పట్టుట లేదా? ఇది రూఢిచేత యౌగిక మపహాత మయినదని చెప్పుటకు వీలులేని స్థలమగుటచేతను, వృషణశబ్ద యౌగికార్థము యజ్ఞమందు వర్తించునని శాస్త్రిగా రంగీకరింపవలసియుండుటచేతను వారికి సాయణుల యర్థమును ఖండించుటకును తత్సమర్థనమునకై ప్రథమకు సప్తమ్యర్థము చెప్పుకొనవలెననుటకును గల యధికారము పూర్తిగ తొలగిపోయినది.

సాయణాచార్యులు ఋ. వే. ౧-౩౨-౧ పై భాష్యము వ్రాయుచు శ్రవశ్శబ్దమునకు 'అన్నము' అని యర్థము వ్రాసినా రనియు, 'కీర్తి' యనిన బాగుండు ననియు శాస్త్రిగారు వ్రాయుచున్నారు. శ్రవశ్శబ్దమునకు 'అన్న' మను అర్థము కలదనికూడ వా రంగీకరించుచున్నారు. ఏదో విధముగ దిద్దవలెననియే వారి తలంపని తోచుచున్నది. వ్యర్థముగ దిద్దుటయేకాక శాస్త్రిగారు తమ్ము సమర్థించుకొనుటకై మనస్తత్వ శాస్త్రమునుగూడ సాక్ష్యము తెచ్చిరి. "మానవుల Psychological instinct కీర్తినే కోరుతూ ఉంటుంది" అని వ్రాసినారు. కీర్తికంటెను ఆత్మసంరక్షణము (Self-preservation) ముఖ్యమైన instinct కదా, అన్న మట్టి శరీరధారణమున కుపకరించును గావున శాస్త్రిగా రెత్తికొనిన 'సైకాలజీ' సాయణుల యర్థమునకు గాక తమ యర్థమునకే బాధను గల్గించుచున్నది.

"త్వష్టాయద్వజ్రం" అను ఋక్కు (౧-౩౨-౯) పై భాష్యము వ్రాయుచు సాయణులు త్వష్ట యింద్రునకు వజ్రము నిచ్చెనని వ్రాసిరి. శాస్త్రిగారు అట్లు త్వష్ట యింద్రునకు వజ్రము నిచ్చెనని యెచ్చటను లేదు కాన నాయర్థమును చెప్పకూడదనిరి. ఇది పొరబాటు. తైత్తిరీయ సంహితలో త్వష్ట యింద్రునకు వజ్రము నిచ్చెనని స్పష్టముగ నున్నది.

"తస్మై వజ్రగ్ం సిక్త్వా ప్రాయచ్ఛ త్తేన జహీతి"
(తై. సం. ౨-౫-౨)

ఇచ్చట విస్పష్టముగా 'ప్రాయచ్ఛత్' (ఇచ్చెను) అని యున్నదికదా. శాస్త్రిగారు వేదము నంతయు పరికింపలేదని వారి విమర్శవల్లనే తేలుచున్నది. పైగా నంతయు పరికించినట్లు మాట్లాడినారు. శ్రీ సాయణులు వేదమును పిపీలికాదరిగ చూచినవారు కారు. వారిది కూలంకష జ్ఞానము. వారిని విమర్శింపబూనినపుడు మన యజ్ఞతను మనము సవరించుకొనవలెను.

—జటావల్లభుల పురుషోత్తము

* * *

## 'కొన్ని ఋక్కులు' లో నా జిజ్ఞాస

జనవరిభారతిలో శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వ్రాసిన 'కొన్నిఋక్కులు' అనే వ్యాసంలో "త్వష్టా యద్వజ్రం సుకృతం..." అనే ఋక్కు భాష్యాన్ని పరిశీలించే సందర్భాన కడపటి పేరాగ్రాఫులో ఇలా వ్రాశారు:

"త్వష్ట చాలా అందమైనవాడనీ, అందమైన ఆయుధాలు కలవాడనీ ౬-౪౯ లో వర్ణింపబడ్డాడు. ఇతడు జీవరాశికి ఒకరూప మిచ్చినవాడట. మానవజాతికి ఆదిపురుషుడని పొగడినారు కవులు. కాని చివరకు ఇంద్రునిచేత ఇతడు చంపబడ్డాడని కొన్ని ఋక్కులలో చెప్పబడింది. ఈ వుయంకూడా పౌరాణికగాథకు చాలా బాగా తోడ్పడిఉంటుంది. ఈ ఋగ్వేదగాథదగ్గఱ పురాణగాథను చూస్తే కథకు కాళ్లు లేవనే సామెత చక్కగా బోధపడక మానదు."

దీన్నిబట్టి చూస్తే ఇంద్రుడు త్వష్టను చంపినట్టు ఋక్కులే చెప్పుతున్నట్టు తెలుస్తుంది. యజుర్వేదంలో త్వష్టపుత్రుడైన విశ్వరూపుణ్ణి ఇంద్రుడు స్వపురోహితుడనికూడా శంకకుండా చంపినట్లును, దానిమీద త్వష్ట ఆగ్రహించి వృత్రుని ఇంద్రజయార్థమై సృజించినట్లును గలదు. కాని ఈగాథ ఋగ్వేదములో ఏమంత్రములం దుద్ఘాటింపబడినదో నాకు తెలియదు. శ్రీశాస్త్రిగారు శ్రమ యనకొనక దయతో ఆఋక్కులను (ఇంద్రుడు త్వష్టను చంపినట్లు చెప్పేవానిని) వెలువరించి నాకృతజ్ఞతకు పాత్రులగుదురని కోరుచున్నాను.

—కొండూరు వీరరాఘవాచార్యులు

* * *

## త్రిమత సామరస్య ప్రయత్నము

'వేదాంత దర్శనము: స్వతంత్రాస్వతంత్ర వాదము' అను శీర్షిక క్రింద శ్రీ పూర్ణానందగారు భారతిమార్గశీర్ష మాససంచికలో నొకవ్యాసము వ్రాసిరి. ఆవ్యాసమును ముగించుచు వారు మతత్రయమునుగూర్చి యిట్లు వ్రాసిరి: "ఈమూడింటిలో నేయొక్కటియును త్యాజ్యము కాదు. అనుభూతిసంపన్నులగు ఆచార్యులు ఆయా దేశకాలపరిస్థితుల ననుసరించి తమదివ్యమగు సత్యభావమును లోకకల్యాణార్థము ప్రచారముచేసిరి. ఎద్దాని నాశ్రయించినను శ్రేయమే లభింపగలదు" దేశకాలపరిస్థితులనుబట్టియే ఆయామతము లుత్పన్నమైనవని అంగీకరించుటవలన నవి యాకాలమునకు సరిపోవనియే తేలుచున్నది. శంకరమతము, అటుపిమ్మట అది దేశకాలపరిస్థితులకు సరిపోనందున రామానుజమతము, అదియు గొంతకాలమునకు సరిపడనందున మధ్వమతము వచ్చినదని తలంచినప్పుడు అద్వైతులు, విశిష్టాద్వైతులను అనగా నాయాకాలములం దామాతనమతములను స్వీకరింపనివారు అకృత్యమొనర్చిరేమో! వీరిరచనలో ప్రస్తుతకాలమున త్రిమతము లెట్లు సరిపోవుచున్నవో ఊహించుటకు రాలేదు. మఱియు వారు తుది మాటలలో నిట్లువ్రాసిరి: "చరమసత్యము కేవల మనుభవయోగ్యము, అవర్ణనీయము అగుట వలన అద్వైతము, దానిని నోటితో చెప్పవలసివచ్చిన విశిష్టాద్వైతము, కార్యరూపమున పెట్టవలసివచ్చిన ద్వైతమును మన దైనందినజీవితమున సంభవించుచున్నవి. కనుక ఈమూడింటిలో నేయొక్కటియు త్యాజ్యముకాదు." ఇది అర్థములేని మాట. కార్యరూపమున ద్వైతము నాశ్రయించి, నోటితో విశిష్టాద్వైతమును బలుకుచు నద్వైతము నందినవా డొక్కడైన దేశమం దుండునా? అది సాధ్యమగునా? ఇది ఆచరించుటకు వీలులేని మాట. సందర్భించని పర్యవసానము. ఈవ్యాసమున దేలిన ఫలితార్థము అద్వైతబ్రహ్మమట్టుల శూన్యము. మఱియు వారిట్లు వ్రాసిరి: "మానవుని నిశ్శ్రేయసలాభార్థము ఈమూడును ప్రయోజనములే యని గ్రహింపగలము. సాధకుడు ద్వైతమతముతో దనసాధన నారంభించి, శ్రీరామానుజుడు చూపిన పథము ననుసరించి అద్వైతమును జేరునని నానిగమనము." ఇట్లుగా సాధనచేయువా డొక్కడైన నున్నాడా? లేడు. ఉండుట కవకాశము లేదు. త్రిమతములవారికిగూడ నీయభిప్రాయము సరిపడదు. త్రిమతములందును సాధకుని పరిస్థితినిబట్టి సాధనములు చెప్పబడియున్నందున త్రిమతసాంకర్యముగా సాధనముచేయువా రుండరు. ఆరంభసాధకుడు మధ్వాచార్య ద్వైతము నాశ్రయించి సాధనమొనర్పవలె ననుదాని నేయద్వైతిగాని యంగీకరించునా? ఈయూహ అద్వైతమతప్రకారము సమంజసమగునా? కావున వీరిమతము నాశ్రయింపని స్వతంత్రాస్వతంత్రవేదాంత దర్శకు లగుచున్నారు.

సమాప్తి యని వారిట్లు వ్రాసిరి: "ఇప్పుడుదయించు ప్రశ్నలు — శంకర రామానుజమతములలో నెయ్యది సరియైనది, ఒకటి సరియైన తక్కినవారు అల్పజ్ఞులనవలసివచ్చునే, వీరందఱును సర్వజ్ఞులైన, ఇట్లు విభిన్నపంథల ద్రొక్కనేల, వీట నెయ్యది ఆశ్రయణీయము అని. ఈప్రశ్నలకు ఒక్కమాటలో జవాబిచ్చుట కష్టము. త్రిమతకర్తృనామమున వ్యవహరింపబడు వీరు పరస్పరఖండనమండనములకు వ్రాసిన గ్రంథములు కొన్నివందలుగ నున్నవి. కేవలము పాండిత్యము నాశ్రయించి, న్యాయశాస్త్రదృష్టితో బరికింప శంకరమత మొక్కటే నిలువగలదు. అదియునుగాక ఆధునికవిజ్ఞాన, మానసిక, తర్కదర్శనశాస్త్రముల ఆదపునకు గూడ ఆగగలిగిన శక్తిసామర్థ్యములు దీని కున్నవి. తక్కినవి పడిపోవును. ఈదృష్ట్యా శాంకరమతమే సమం

జనము. "ఆధునికవిజ్ఞానాంశములు ఈనాడు సిద్ధాంతములైనవి రేపు పూర్వపక్షము లగుచున్నవి. అట్టివాని యాధారమున నద్వైతమును సమర్థించుట కేవలము అవివేక మగుచున్నది. ఇది ప్రపంచ మెఱిగిన సత్యమైయున్నదికదా. వీ రీసందర్భమున నొక చక్కనిమాట వ్రాసిరి : "ఈ శ్రేణికి జెందినవారు తమకుతామే అభ్రాంతులు. తక్కినవి పొల్లులు అని యెంతురు." ఇదియే యీవ్యాసమందున్న యథార్థమగు విషయమైయున్నది. కావుననే వీరు మధ్వాచార్యులవారినిగూర్చి యిట్లు వ్రాసిరి:

"౧ మధ్వాచార్యునకు గ్రామపాఠశాల కరిగెను గాని విద్య యంటలేదు. కుస్తీ మున్నగు వ్యాయామ క్రీడలలో మేటియై భీముడను నామమును బడసెను. ౨. తిరువేంద్రమునకు మధ్వాచార్యు డరిగెను. అచ్చట శృంగేరీమఠాధిపతియగు విద్యాశంకరులతో వాదించి ఓటమినందెను. అప్పటినుండియే శ్రీమధ్వుడు శాంకర మతమును తీవ్రముగ విద్వేషింప మొదలిడెను. ౩ రామేశ్వరమునందలి అద్వైతపండితులు తర్కయుద్ధమున కాహ్వానించిరిగాని శ్రీమధ్వుడు ఒప్పుకొనలేదు. ౪ ఈ పర్యటనమున ఈయనకు బూలదండలు, ముష్టిగూడ స్థానవిశేషము ననుసరించి లభించెను. ౫. ప్రాణరక్షణకై గోవానగరమునకు పారిపోవలసివచ్చెను. ౬. ముసల్మానుల భాష నీయన నేర్చుకొనెను. ౭. పూర్వ గురువగు అచ్యుతప్రకాశుని భయపెట్టి స్వమతమునకు త్రిప్పుకొనెను. ౮. శృంగేరిపీఠగురువుతో విరోధము హెచ్చుకాగా, ఆయన శ్రీమధ్వుని పుస్తకాలయమును దోచికొని, దానిమీద మధ్వాచార్యుల కట్టిహక్కును లేకుండున ట్లొనర్చెను. పిదప విష్ణుమంగళరాజగు జయసింహుని సాయమున దానిని మరల ఈయన సంగ్రహింపగలిగెను." దేశకాల పరిస్థితుల ననుసరించి తరుచితమగు సత్యభావమును లోకకల్యాణార్థము ప్రచారముచేసిన వారు మధ్వాచార్యులవా రని అంగీకరించుచు నిట్లు నిందాపూర్వకముగా రచించిరి. ఈమాటలు మధ్వాచార్యులందు వీరి కున్న అసహిష్ణుత్వమును వ్యక్తము చేయుచున్నవి. మఱియు సత్యదూరములై యున్నవి.

మధ్వాచార్యులు సుమారు ముప్పదినాలుగు గ్రంథములను సంస్కృతమున విరచించిరనియు, పూర్ణప్రజ్ఞభాష్యమనబడు సూత్రభాష్యమున పౌరాణికవాక్యసహాయమున స్వమతము సముద్ధరింపబడిన దనియు వీరు వ్రాసిరి. మధ్వాచార్యులు రచించినవి ముప్పదియేడు గ్రంథములు. వారు బ్రహ్మసూత్రభాష్యమందు శ్రుతులను, పురాణములనుగూడ నుదాహరించియున్నారు. ఇతిహాసపురాణములు వేదమునకు పంచసంఖ్యాపూరకమైన వేదమే యగుటయు, నవి బ్రహ్మసూత్రకర్తయగు వేదవ్యాసుడే రచించుటచేతను మధ్వాచార్యులు పురాణవచనములనుగూడ నుదాహరించియున్నారు. వేదవిభాగ మొనర్చినట్టి వ్యాసుడు బ్రహ్మతత్త్వ నిర్ణయార్థము ఇతిహాసపురాణములను రచించెను. కావున మధ్వాచార్యులు ఆ బ్రహ్మతత్త్వనిర్ణయమందు శ్రుతులను, పురాణములనుగూడ నుదాహరించియున్నారు.

"ఈమధ్వమతపరంపరకు సనత్కుమారుడు ఆదిగురువుగా చెప్పబడుచున్నను ఉపనిషత్తులు, లేక వేదాంతసూత్రముల ద్వైతప్రసక్తి కనబడదు. కాశకృత్స్న, ఆశ్వరథ్య, ఔడులోములు క్రమముగా అద్వైత, విశిష్టాద్వైత, భేదాభేదవాదములను బరిగ్రహించినట్లు వేదాంతసూత్రములవలన గ్రహింపగలము. కాని సంపూర్ణముగ ద్వైతమతము నవలంబించినవారి పేరు ప్రాచీనులలో నగపడదు" అని వీరు వ్రాసిరి. దేవతలు, వేదవ్యాసుడు, ఋషులందఱును ద్వైతులే యని వేదశాస్త్రములవలన ద్వైతులు నిరూపించియున్నారు. అట్లే కాశకృత్స్నాదులు వేదవ్యాసశిష్యులనియు, వారి మతమునకు వేదవ్యాసమతమునకు భేదము లేదనియు స్వప్రమాణముగ ద్వైతభాష్యము నిరూపించుచున్నది. అద్వైతమున కనుగుణమైనది ఒక్క శ్రుతిగూడ లే దని ద్వైతమతము స్వప్రమాణముగ రుజువుచేసియున్నది. మధ్వభాష్యమందు ఏవిషయము సాధింపబడుచున్నను అది గ్రంథకర్తయొక్క (మధ్వాచార్యులయొక్క) అభిప్రాయమని ప్రత్యేకింపబడియుండదు. సమస్తవిషయములును ప్రమాణగ్రంథవచనములవలననే సమర్థింపబడుచుండును. వారి యవతారవిషయముగూడ వేదపురాణవచనములవలననే వ్యక్తముచేయబడియున్నది.

—కాళ్ళూరి వ్యాసమూర్తి

# కలగూరగంప

## నాటకములు, ఫిల్ములు – రసప్రదర్శనము

నాటకములకును, ఫిల్ములకును కొంత సాదృశ్యము, కొంత విభేదము ఉండుట అందరూ ఎరిగిన సంగతే. రెండును శ్రవ్యములు, దృశ్యములే. రెండును నవరసప్రదర్శనకు అనుకూలములే. వాటి ఉద్దేశము కూడా అదే. ఫిల్ములలో వాతావరణసృష్టికి విశాలావకాశ మున్నందున, నాటకములకంటె ఫిల్ములు ఎక్కువ ఆకర్షణీయములుగా నుండగలవు. కాని ఒకేనాటకము ఒకేనటబృందము వేరువేరు చోట్లగాని, వేరువేరు సమయములలో కాని ప్రదర్శించునప్పుడు వేరువేరు విధముల రసప్రదర్శనము చేయు వీలున్నది. ఫిల్ములలో అట్లు గాదు. ఒకేవిధమైన నటనను—ఫిల్ములలో ముద్రింపబడినదానినే అన్నిచోట్లను ప్రేక్షకులు చూడగలరు. రసప్రదర్శనమందు భిన్నత్వ ముండజాలదు. ఇది కళాదృష్టిలో మంచిదా, కాదా అన్న ఒకప్రశ్న కలుగుతుంది.

అదటుండ, తొలిప్రశ్న—రసప్రదర్శన నాటకములలో ఎక్కువ వీలగునా, లేక ఫిల్ములలో ఎక్కువ వీలగునా అని. ఇది మనము ఆలోచించవలెను.

దీనిని దృష్టాంతముతో చర్చించినచో బాగుండు నని నా ఊహ. హరిశ్చంద్రనాటకము తీసుకోండి. హరిశ్చంద్రపాత్రను ఉత్తమోత్తమముగా ధరించి, ఆంధ్రప్రేక్షకజనమును ఉర్రూతలూగించిన డి. వి. సుబ్బారావుగారి నటన, రసప్రదర్శనము మనకు ఇప్పటికీ కండ్లకు కట్టినట్లు ఉంటుంది. సుబ్బారావుగారి నాటకములలో స్త్రీపాత్రలను పురుషులే ధరించుచుండినను అది ప్రత్యేకలోపముగా కన్పించలేదు. హరిశ్చంద్రనాటకములో గాని, ఫిల్ములో గాని ప్రదర్శింపవలసిన రౌద్ర, బీభత్స, కరుణ, శృంగార, హాస్యరసములు అంతా ఒకటే. ఫిల్ములో ఆయా రంగోచితమైన సెట్టింగులు అమర్చి, కంటికి ఆకర్షణ ఎక్కువ చేయబడినది. కాని, రసానుభూతిని నాటకప్రదర్శనము ఎక్కువ కలిగించినదా, ఫిల్ము ఎక్కువ కలిగించినదా అని అడిగితే, నామటుకు నేను నాటకమే ఎక్కువ కలిగించిన దంటాను. అది ఆ ఫిల్ములో నటించిన స్త్రీ పురుషుల లోపమని నే ననను. అది వస్తుతః ఫిల్ముకును, నాటకమునకును ఉండే తారతమ్యమువల్ల తటస్థించినది.

చూచుచున్నది నాటకమే యని గమనించియున్నా, విశ్వామిత్రుని రౌద్రము మనలో ఆరసము నుద్భవింప జేసినది. హరిశ్చంద్రుని సత్యదీక్ష మనలను గంభీరులుగను, పునీతులుగను చేసినది. చంద్రమతిలోహితాస్యుల మానవత్వము మనలో సానుభూతిని కలిగించినది. చంద్రమతిపాతివ్రత్యము మనకు విస్మయమును కలుగ జేసినది. నక్షత్రకుని దౌర్జన్య క్రౌర్యములు మనలకు ఏవగింపును, కోపమును కలిగించినవి. కాలకౌశిక, కలహకంఠుల రాతిగుండెలు మనలను కలచి వైచినవి. శ్మశానరంగమున సత్య నిష్ఠా గరిష్ఠుడైన హరిశ్చంద్రుని అచంచలిత దీక్ష, అకుంఠిత నిశ్చయము మనల నావరించినవి. అసదృశమైన ఆ విషాదఘట్టమును చూచి మనము కన్నీరు గార్చినాము. సత్య విజయమునకు ఉప్పొంగినాము. నాటకమును చూచుచుండినంత సేపు నిత్యజీవితమును మరచిపోయి, ఒక ఉత్తమ ప్రపంచ

ములో మన మనస్సులు విహరించినవి. నాటకశాల విడిచి వచ్చునప్పుడు ఒక విధమైన నూతన పవిత్రతానుభవము కలిగి, ఈమనశ్శాస్త్రములమైనా భిన్నులమై యింటికి మరలినాము. అనగా, హరిశ్చంద్ర నాటకమునందలి రసప్రదర్శనము మనకు అనుభూతి అయిపోయినది. అందరమును ఒకే రీతిగ తాదాత్మ్యమును పొందితిమని చెప్పలేను, గాని ఎంతటి కర్కశ హృదయుడైన ప్రేక్షకుడుగూడ ఆ నిమిషమునైన చలించక పోలేదు. నాటకశాలయందు క్రిక్కిరిసియుండిన స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూకూడా వారి వారి వయస్సు, మనస్సు మొదలగు యోగ్యతలనుబట్టి కొంచెముగనో, గొప్పగనో సానుభూతి పొందినారు. ఆ నాటకమును మళ్ళీ మళ్ళీ చూడవలెనని కోరినారు.

ఈ రసానుభూతి, ఈ ప్రేక్షకతాదాత్మ్యము కేవలము సుబ్బారావుగారి నటనాప్రాగల్భ్యమువల్ల కలిగిన దని అనడానికి లేదు. దానికి కారణము నటకులకును, ప్రేక్షకులకును గల సజీవసంబంధమే.

రంగస్థలముపైకి వచ్చి ఆయాపాత్రల నభినయించినవారు వస్తుతః ప్రేక్షకులకంటె ఉత్తమ శ్రేణికి చెందినవారు కాకపోవచ్చును. కాని, ఆ రంగస్థలమున నిల్చినప్పుడు తాము ధరించిన పాత్రలో లీనమైపోయినారు. లేదా, లీనమయినట్లు మనకు తోపించినారు. అంతేకాక, వారు ఆ ఘట్టములలో చేసిన రసప్రదర్శనము ప్రేక్షకులైన మన కెట్లు రుచించినదో గ్రహించగలిగి, తదనుగుణముగా ఇంకా ఉత్సాహముగా నటించగలిగినారు. లోపములను సవరించుకొని సెబాసని అనిపించుకొనగలిగినారు. తమతోపాటు మనకుకూడ రసానుభూతిని కలిగించినారు. నాటకప్రదర్శనము ప్రేక్షకులకొరకు; వారిని తనియజేయుట అవసరము అనేభావము నటకులలో నుండినది. తదనుగుణముగ—స్వభావముగానైతేనేమి, శిక్షణవల్లనైతేనేమి, అనుభావముచేతనైతేనేమి వారు గడించిన నటనాకౌశలమును, హావభావప్రకటనమును, గానసామర్థ్యమును కనబరచినారు. అంతేకాక, ఈ భౌతికచక్షువుకు కనబడే హరిశ్చంద్ర నాటకపాత్రధారులేమైనా, వారు మనకు అసలు హరిశ్చంద్రు డిట్లుండును, ఇట్లు ప్రవర్తించియుండును, ఇంతటిధీరుడు, అకలంకుడు, అసామాన్యపురుషుడు అనే భావములను మనకు కలిగించినారు. ప్రత్యక్షముగా చూచుచుండిన నాటకముతోపాటు ఊహాపథమునకూడ హరిశ్చంద్రనాటకము ప్రదర్శింపబడుచుండినది. అందువల్ల నటీనటకుల లోపములు, రంగస్థలిశూన్యత, పరికరాభావములు—ఇవేవీన్ని మన రసానుభూతికి ఆటంకము కలిగించలేదు. వాటిపై మన దృష్టి పారినదో లేదో కూడ చెప్పలేము. నటుని లోపములను మనము మానసికముగా సవరించుకొన్నాము. అయోధ్య, కాశీ, వనములు, తపోవనములు, స్మశానములు— అన్నిటినీ మనము ఊహించుకొన్నాము. హరిశ్చంద్రుని జీవితచరిత్రావలోకనమున లీనమైనాము. నటించుచుండినది డి. వి. సుబ్బారావుగారని మధ్యమధ్య స్ఫురించుచున్నా, అతడుమాత్రము తాను హరిశ్చంద్రుడ ననే భావమును మనకును గట్టిగా కలిగించికొని, మనకును ఆభావము కలిగించునట్లు నటించుచున్నందునను,ఇతరపాత్రధారులుకూడఅలాగే వర్తించినందునను మనకు నాటకప్రదర్శనమునకు ఉత్తమ ఫలితమైన రసానుభూతి కలిగినది. నటకునికిని ప్రేక్షకునికిని గల సజీవసంబంధమువల్ల ఇది సాధ్యమైనది. నటకుడు పాత్రధారియైనా నిర్జీవప్రతిమ కాడు. అతని హావభావ రస ప్రదర్శనమునకు అనుగుణముగా—అనుకూలముగానో,ప్రతికూలముగానో ప్రేక్షకులుఆమోదమును, హర్షమును,ఖండనను తెలుపుచున్నందున పరస్పరసంబంధము ఏర్పడినది. నటకులయొక్కయు, ప్రేక్షకులయొక్కయు మనస్సులు ఒకేరీతిన వర్తించుటవల్ల నాటకము తన ప్రయోజనమును సఫలము చేసుకొన్నది. ప్రేక్షకులు తృప్తి చెందినారు.

ఇక ఫిల్ముప్రసంగతికి వత్తము. నాటకమునందు కంటె ఫిల్ములో నటీనటులు కౌశలమున తక్కువ అని చెప్ప వీలులేదు. అద్దంకి శ్రీరామమూర్తిగారు డి. వి. సుబ్బారావుగారివలెనే నటించ యత్నించిరి. కరుణరస ప్రదర్శనమున కన్నాంబ ప్రసిద్ధిగాంచినదేగదా. ఇతర నటీనటబృందము నాటకమునందు వారితో సమానులే గదా. పైగా ఫిల్ములలో కంటికి ఇంపగు దృశ్యములు ఎక్కువగా నుండినవి. బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్

వాతావరణకల్పనకు మరొక తోడుగా ఉండినది. వెండితెరమీద నానాకోణములతో హరిశ్చంద్రఫిల్ము ప్రదర్శింపబడినది. మూడుగంటలసేపును చూచినాము. అయినా, వెలితిమనస్సుతో బయటికి వచ్చినాము. ఎందువల్ల ?

అద్దంకి శ్రీరామమూర్తి, కన్నాంబ మొదలగువంటి నటకులు బాగా నటించకనా ? కాదు. డైరెక్షను బాగా లేకనా, కాదు. మరిదేనివల్ల ?

నాటకములో నటక, ప్రేక్షకవర్గమునకు గల సజీవసంబంధము ఫిల్ములో లేనందువనే రసానుభూతి కలుగలేదని నాభావము. మనము ఫిల్ములో చూచినది బొమ్మలను. అవి మాట్లాడినవి; నటించినవి; ఏడ్చినవి; నవ్వినవి. కాని వాటితోపాటు మనలను మాట్లాడించలేదు; నవ్వించలేదు; ఏడ్పించలేదు. నిస్సంగముగా చూచినాము. బాగున్నదంటే బాగున్నదంటూ బయటికి వచ్చినాము.

ఇది నటుల లోపముగాదు, డైరెక్టరు లోపము గాదు, స్టూడియో లోపముగాదు, సంగీత లోపముగాదు. వస్తుతః భగవత్సృష్టిలోని జీవులకును, మానవసృష్టిలోని యంత్రజీవములకును గల భేదములోనే ఉన్నది లోపము. ఛాయాగ్రహణయంత్రము చలనచ్ఛాయలను గ్రహించినది. శబ్దగ్రహణయంత్రము మాటలు పాటలను గ్రహించి మనకు వినిపించినది. అయిన నేమి ? ఒకజీవికిని మరొక జీవికినిగల ఆధ్యాత్మికసంబంధము, సహానుభూతి మొదలగు అలౌకికానుభవములను ఈయంత్రపరికరములు చేకూర్ప జాలకున్నవి. ఎన్ని గ్రామఫోను రికార్డులను విన్నా, గాయకుని సంగీతమును ప్రత్యక్షముగా విన్నప్పుడు కలిగిన ఆనందము (గాయకునికిని శ్రోతలకును ఇది సమానమే) కలుగజాలదు. అదేవిధముగ నాటకమునందు కలిగిన రసానుభూతి ఫిల్ముప్రదర్శనమున కలుగదు.

ఇది అన్నిరసముల ప్రకటనకును వర్తిస్తుందా అంటే వర్తించదని నాభావము. ఏలన, మానవ హృదయాంతరాళమును కలచివైచి, కరగించి, కరుడుగట్టిన దయాదాక్షిణ్యభావములను వెలువరించునట్టి ("ఏకోరసః కరుణ ఏవ") ఆ ఏకైకకరుణరసమునకును, తదితరరసములకును ఎంతో భేద మున్నది.

హాస్య, శృంగారముల ననుభవించుటకు నాటకముకన్న ఫిల్మే ఎక్కువ ప్రయోజనకరము. బీభత్స, భయానకప్రదర్శనములకు సినిమాలలో ఎక్కువ అవకాశ మున్నది. వీరరౌద్రములను నాటకరంగమునకంటె సినిమారంగమున ఎక్కువ బాగుగా చూపెట్టవచ్చును.

కాని కరుణరసమునకు,—ముఖ్యముగా సుప్రసిద్ధమైన హరిశ్చంద్రకథవంటివి ప్రదర్శించుటకు నాటకరంగమే ఉత్తమ మని తోచుచున్నది.

నూతనసాంఘిక కథలను చలనచిత్రములలో ప్రదర్శించినప్పుడు కలిగే రసానుభూతికిని, సీతావనవాసము, హరిశ్చంద్ర, ద్రౌపదీవస్త్రాపహరణము, లవకుశలాంటి పురాణగాథలను ప్రదర్శించినప్పుడు కలిగే రసానుభూతికిని ఎంతో భేద మున్నది. పౌరాణికఫిల్ములను చక్కగా తీసినయెడల ఇప్పటికిని అవి జయప్రదమగుటకు కారణము ఈ రసానుభూతియే. ఈజాతి పుట్టినది మొదలు (ఏనాడు అద్వైతపరబ్రహ్మోపాసకులైన ఋషు లుండినారో గాని) పురాణగాథలును, పురాణమహాపురుషుల, స్త్రీల జీవితచరిత్రలును ఒంట బాగా జీర్ణమై పోయినవి. మనతోడివారలు సత్యపథమున జీవనము గడపుటకై, సత్యనిష్ఠకై ఎంత త్యాగము చేసి, ఎంత కష్టపడుతున్నా సానుభూతి చూపని మనము, ఏకృతయుగము నాటి హరిశ్చంద్రునికథనో విని, నాటకమును చూచి కరగిపోతాము. మన తత్వములో జీర్ణించిపోయిన రసము ఆనాటకప్రదర్శనమువల్ల ఉప్పొంగుచున్నది; ఈ ఫిల్మువల్ల ఉప్పొంగుటలేదు. ఆనాటకములో జీవము ఉన్నది; ఈఫిల్ములో జీవము లేదు. అక్కడ నటకప్రేక్షకులకు సజీవసంబంధ మున్నది; ఇక్కడ లేదు. ఒక్క కరుణరసప్రదర్శనముననే నాటకములకును, ఫిల్ములకును ఈ భేదము ఎక్కువగా నాకు కనిపించినది.

యం. వి. శర్మ

---

1941



కీ. శే. జయంతి రామయ్యపంతులుగారు

వీరు గత ఫిబ్రవరిమాస ప్రారంభమున భౌతిక దేహమును చాలించి కీర్తికాయులైరి. ప్రస్తుత కాలములో పూర్ణాయువనదగిన ౮౨ సంవత్సరములు జీవించి, తమ జన్మమును సార్థకము గావించుకొన్న వారిలో శ్రీ పంతులుగారు ఒకరు. వీరు ఆంగ్ల భాషలో ఉన్నతపట్టముల నంది, గొప్ప సర్కారుపదవిని నిర్వహించి పింఛను పుచ్చుకొనిరి. రాజకార్యములనుండి అవకాశము దొరికినతోడనే భాషాసేవాతత్పరులై ఆంధ్రభాషోద్ధరణకు నడుముకట్టిరి. వీరు కీర్తిశేషులైన గిడుగు రామమూర్తిగారికి సరాసరి ప్రతివాదులు. గ్రాంథికభాషా స్థితిని దృఢము గావింప వీరు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికను స్థాపించి యావజ్జీవమును దానిని నడపుచుండిరి. ఆంధ్రభాషకు మకుటాయమానములైన గ్రంథములలో శ్రీసూర్యరాయ ఆంధ్రనిఘంటువు ఒకటి. దానికి వీరే గౌరవసంపాదకులు. వీరి మరణమువలన ఆంధ్రభాషాభివృద్ధికి తీరనిలోటు వాటిల్లినదని చెప్పుట అతిశయోక్తి గాదు. పరమేశ్వరుడు వీరి ఆత్మకు శాంతిని ప్రసాదించుగాక.



# విమర్శనము

## సూర్యసాముద్రికము

గ్రంథకర్త: సాముద్రికశిరోమణి జోశ్యుల నారాయణమూర్తిగారు, సూర్యసాముద్రికాలయము, జోశ్యులవారివీథి, కాకినాడ.

సకలశాస్త్రములకును భారతదేశము జన్మభూమి యైనట్లే సాముద్రికశాస్త్రమునకును భారతదేశమే జన్మస్థానము. త్రికాలజ్ఞానులగు మనమహర్షులు సకలశాస్త్రములను రచించి మనకొసంగిరి. కాని మనకు గల అలసత్వముచేతనో, మరి దేనిచేతనో అపూర్వములగు శాస్త్రవిషయములను అభ్యసించి పరిశోధింపక విడిచితిమి. పాశ్చాత్యదేశీయులు మన శాస్త్రములను అభ్యసించి పరిశోధించి వానిఫలితములను దా మనుభవించి, అచటి ప్రజల ననుభవింపజేయుచున్నారు. మనదేశమున శాస్త్రపరిశోధనకు సకలసౌకర్యము లుండియు వానివైపు దృష్టి సారింపకున్నాము. ఈ సాముద్రికశాస్త్రము పురాతనమును, మహర్షి ప్రోక్తమును నైయున్నది.

సాముద్రికశాస్త్ర విషయకమైన గ్రంథములు తెలుగుభాషయందు మిక్కిలి తక్కువగ నున్న ఈ సమయమున గ్రంథకర్తగారు ఈ గ్రంథమును ప్రచురించి ఆ కొరతను కొంతవరకు దీర్చిరి. ఇందు మానవుని నఖశిఖపర్యంతము గల సర్వాంగములను గూర్చిన సాముద్రికమును వివరించిరి. గ్రంథమంతయు ౨౮ ప్రకరణములక్రింద విభాగించి అనుభవపూర్వకముగ సర్వాంగములను గూర్చి చక్కని తెలుగుభాషలో సులభశైలిని చర్చించిరి. పాఠకుడు ఈ గ్రంథసాయముతో తనకు సంబంధించిన సాముద్రికమును ఇతరుల సాయ మక్కరలేకయే తెలిసికొనవచ్చును. చదువరులకు సులభముగ బోధపడుటకై చిత్రములను గూడ ప్రతివిషయమునకును జతపరిచిరి. చర్చింపబడిన విషయముల కాధారముగ మహర్షులచే రచింపబడిన సంస్కృతశ్లోకములను గూడ పొందుపరచిరి ౨౫౦ చిత్రములతోను, 3 వందలకు పైబడిన పుటలతోను చక్కని యచ్చు, బైండు కలిగిన యీగ్రంథము వెల 3 రూపాయలు.

శర్మ

---

## విమర్శవ్యాసములు

రచయిత: శిష్టా రామకృష్ణశాస్త్రిగారు ఎమ్. ఏ., శిష్టావారిగృహము, బచ్చుపేట, బందరు.

వాఙ్మయచరిత్రకును, భాషాచరిత్రకును గల వ్యత్యాస మెట్టిదో తెలిపి, రసానందమును గలుగజేయు రచనలును, గ్రంథకర్తయాత్మీయతను వ్యక్తీకరించు రచనలును, మానవజీవితప్రతిపాదనము జూపు రచనలును వాఙ్మయమున చిరస్థానమును పడయగల వని తెలిపి గ్రంథకర్తగారు తమ విమర్శనమునకు అక్కరైన అంశములను గ్రంథారంభమున వివరించుట ముదావహము. దేశచరిత్రకును, వాఙ్మయచరిత్రకును ఆంతరంగిక బాంధవ్యము కల దని వివిధవాఙ్మయ చరిత్రలను పరిశీలించినవా రెఱుగుదురు. ప్రాచీప్రతీచీ వాఙ్మయతత్త్వముల నెఱిగిన విద్వాంసులగుడు, ప్రస్తుత గ్రంథకర్తగారు ఆంధ్రచరిత్రకును, ఆంధ్రవాఙ్మయ చరిత్రకును గల అవార్యసంబంధమును సహేతుకముగ

జాపి, బ్రాహ్మణబౌద్ధమతముల సంపర్కమువలనను, బ్రాహ్మణజైనమతముల సంఘర్షణము వలనను ఆంధ్రవాఙ్మయవసుంధరలో పొడమూపిన శాఖోపశాఖలను వివరించిరి. ప్రాఙ్నన్నయయుగమున నాగవర్మ ప్రభృతులు కావ్యరచనము చేసియుందు రనియు, మతవిభేదములచేతనేమి, ఈర్ష్యాకలహములచేతనేమి ఆయుగమున వాఙ్మయము నాశన మైనదనియు తెలిపిరి.

నారాయణభట్టు నన్నయకు ఆంతరంగికమిత్రుడై ఈతనికి కొంత భావశబలత ఇచ్చినను, కార్యసఫలత ఇతనిచే చేకూరెననువిషయము నుల్లేఖించిరి సంస్కృత పండితులకుగూడ సంతోషము కలిగింపదెంచి నన్నయ తన రచనమును సాగించుటచే, ఈతనిశైలి సంస్కృతానుసరణము గలదైన దని తెలిపిరి. నన్నయ, తిక్కనల రచనారీతుల వ్యత్యాసములను దెలుపుచు, వీనిని దృష్టాంతీకరించు భారతభాగములను చేర్కొనిరి. "నన్నయరచన కరడుగట్టిన దధివలె స్నిగ్ధమైయుండ, తిక్కనరచన క్షీరమువలె జాలువారుచుండు" నని వీరు వచించిన వాక్కు భావబంధురమైనది. నైష్ఠికుడగుచు యాగాదికర్మలను నన్నయ శ్రద్ధతో వర్ణించినా డనియు, లోకవ్యవహారదృష్టిగల తిక్కన యుద్ధాది వర్ణనములందు సిద్ధహస్తు డాయె ననియు శ్రీ శాస్త్రిగా రనిరి. సభాపర్వమందలి కథను పరిశీలించి, అది పూర్వోత్తరకథలకు నైక్యమును గూర్చె ననియు, భారతకథ యంతయును సభాపర్వముమీదనే ఆధారపడియున్న దనియు తెలిపిరి. భాగవతప్రశస్తిని దెలుపుచు, పోతనపద్యములందు పోతనవ్యక్తిత్వమును గుర్తింపవచ్చు ననిరి. ఈతని హృదయము భక్తిభరిత మైనట్లే, ఈతని భాగవతము భక్తిపూరిత మైన దనిరి పోతన రసోపాసకు డనిరి. తిక్కన పోతనల కవిత్వ ప్రభావమందలి వ్యత్యాసములను చక్కగ తెలిపిరి. రచయితల చరిత్ర విభేదముల ననుసరించియే ఆంధ్రభారత, భాగవతములందలి పాత్రముల చరిత్రలందలి వ్యత్యాసములు పొడమూపినవివ యము నుల్లేఖించిరి.

ఈ యంశములను పరిశీలించినపాఠకులు గ్రంథప్రశస్తిని చక్కగ గమనింపగలరు. ఈ గ్రంథమును పఠించినపిదప నన్నయ తిక్కన పోతనల రచనలను మరియొకమారు పరిశీలించుపఠితలు వారి కవిత్వమందలి మహత్త్వ పటుత్వములను చక్కగా హృదయంగమము గావించుకొనగలరు. గ్రంథము అమూల్యవిషయములతో నిండియున్నది. ఆంధ్ర వాఙ్మయమును సవిమర్శముగ పరిశీలింప దలచువారి కిది సహాకారి కాగలదు.

జో. న.

---

*Principles & Practice of Life Insurance*

(జీవిత భీమా వ్యాపారము, అందలి ముఖ్యసూత్రములు)

గ్రంథకర్తలు: శ్రీ జె. ఎస్. రెడ్డి, బండి సీతారామమోహనరావు బి. ఏ, బారెట్లా గారలు. ఈస్ట్ అండ్ వెస్ట్ ఇన్సూరెన్సుకంపెనీయొక్క బొంబాయి, మద్రాసు కార్యాలయాలలో ప్రతులు దొరుకును. వెల ప్రతి ౧కి రూ. ౨-౮-౦

౧౯౩౮-వ సం.పు భారత భీమా చట్టము అమల్లోకి రావడంతో భారతీయ భీమావ్యాపారచరిత్రలో చాలా ప్రధానమైన అధ్యాయం ప్రారంభమైంది. ఇదివరలో అమల్లోనున్న కంపెనీల చట్టము, రాబడి పన్ను చట్టములవలె కాక ఈభీమా చట్టము కేవలం క్రొత్త శాసనమై భీమా వ్యాపారంలో చాలా గొప్పమార్పులు తెప్పించింది. ఈచట్టంవల్ల కొంత చెఱుపు ఉన్నప్పటికీ మేలును చాలా ఉన్నది. దీనివల్ల భీమావ్యాపారం సంపూర్ణంగా ఇండియా ప్రభుత్వంవారి అజమాయిషీ క్రింద జరగవలసివుంది. వాటాదారులు దానివల్ల మంచి రక్షణపొందటమేకాకుండా డైరెక్టర్లుగా ఉండేటందుకుకూడా చాలా అవకాశాలు కల్పింపబడ్డవి. దేశీయ విదేశీయకంపెనీలమధ్య ఇదివరలో ఉండే తారతమ్యం లేకుండా అయింది. దీనిఫలితంగా మనదేశంలో వ్యాపారంచేసే విదేశీసంస్థలు మనదేశంలో ఉన్న లయబిలిటీకి సరిపోవునంత డబ్బు ప్రభుత్వంవారివద్ద ధరావతుగా వుంచాలి. భీమా వ్యాపారం కాన్వాసు చేసే ఏజంట్లకు లైసెన్సు లివ్వడంకూడా ఒకసుగుణమే. దీనివల్ల భీమాచేసేవారికంటె చేయించే ఏజంట్లే జాస్తిగా ఉన్నారా అని సాధారణంగా ఇదివరకు మన

దేశంలో ఉండే అపోహ తొలగిపోవచ్చు. మేనేజింగ్ ఏజంట్లను తొలగించడం మరో గొప్పగుణం.

చెల్లింపులు చెప్పవలసివస్తే కంపెనీ పెట్టుబడులను గూర్చి చేసిన శాసనం కంపెనీలకు, పట్టాదార్లకు కూడా కొంతవరకు ఇబ్బంది కల్గించేదిగానే వుండవాలి.

క్రొత్తశాసనాలు అమల్లోకి వచ్చినపుడు వాటిని వ్యాఖ్యానించి ప్రజలకు అందులోని లోటుపాటులు తెలియజెయ్యడం చాలా అవసరం. ఈభీమాచట్టానికి వ్యాఖ్యానం గావించిన ఈగ్రంథకర్తలు ప్రశంసాపాత్రులు. ఈగ్రంథానికి భీమాచట్టం అమల్లోకి రావడంలో చాలాకృషి, శ్రమలకు పాల్పడ్డ కె. సంతానంగారు పరిచయవాక్యాలు వ్రాయడం చాలా సమంజసంగా వుంది.

ఈ గ్రంథం మొదటి ఐదుఅధ్యాయాలూ వ్యాఖ్యానం. అటుపైన ౧౯౩౮ సం. భారత భీమాచట్టం పునర్ముద్రితము. మొదటిభాగంలో ఆక్టుకు సంబంధించిన విషయాలను చాలా విపులంగా చర్చించి సాధారణపట్టాదారులకు కూడా అర్థమయ్యేటట్టు చేశారు. 'ఇన్సూరబిల్ ఇన్టరెస్టు' మున్నగు పారిభాషిక పదాలను చక్కగా వివరించి ఏయే సందర్భాల్లోమాత్రం అట్టిదానికి అవకాశం వుందో విశదీకరించారు.

అసైనుమెంటు, నామినేషన్లలో గల భేదం కూడా చక్కగా వివరించారు.

భీమాప్రాపోజలులోని వివరాలనన్నిటిని ఏమాత్రం దాపరికం లేకుండా పట్టాదారు జవాబీయవలసినయావశ్యకతను, దానివల్ల కలుగగల లాభాలను బాగా నివేదించారు.

తర్వాత 'భీమాసూపరింటెండెంటు' పదవిని గూర్చి చర్చిస్తూ దానివల్ల పట్టాదారులకు కొన్ని గొప్ప సౌకర్యాలు కల్గినప్పటికీ భీమావ్యాపారవిషయంలో ఈ సూపరింటెండెంటుకు నిరంకుశమైన అధికారం ఇవ్వబడిందని నిర్మొగమాటంగా చాటారు.

ఈ చిన్నపుస్తకంలో విశదీకరించిన సూత్రాలను అనుసరించి భీమావ్యాపారంలో పట్టాదారులు, భీమాఏజంట్లు, భీమాకంపెనీలుకూడా అమలులో పెట్టినట్లైతే క్లెయిముల పరిష్కారం మొదలయ్యే విషయాల్లో ఏమాత్రం విలంబం లేకుండా భీమావ్యాపారం చాలా ఉత్తమంగా సాగవచ్చునని నా విశ్వాసం.

పు. వెం. సు.

---

## చూపరము

కర్త: జయంతి సుబ్బారావుగారు, ప్రకాశకులు: సప్తతిపూర్తి మహోత్సవ సంఘము, చోడవరము.

కవితాసమితి అధ్యక్షులు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు వ్రాసినట్లు తోడివారికి పనికివచ్చు పాత్రములు తమ గ్రంథావళిలో వెల్లడించుటయే వారి సమితివారి సంకల్పము. అట్టివానిలో మచ్చుముక్కల వంటివి మనుగడలు. విశాఖపట్నము జిల్లాలోని వీరవల్లి తాలూకా కర్మవీరుడనదగు శ్రీ వేపా భీమశంకరము పంతులుగారి మనుగడ ఈ రూపమున వ్రాయబడినది

కడలికడుపున లభించున వన్నియును పుష్యరాగమణులు కావు. మానవలోకమందు జన్మమెత్తు సర్వులును మహాపురుషులు కారు. అయినను సంతతమైన ఆత్మసాధనచే అభ్యున్నతి జెందగోరువారు పలువురు. వారి మనుగడలు మాన్యములు, గ్రాహ్యములు. చూపరము ఈ రీతిది. పుస్తకము పేరువలెనే పుస్తకమును ఉన్నది.

న. పరకతపక.

---

## జాతక కథాగుచ్ఛము

[రెండవ భాగము]

గ్రంథకర్త: శిరోమణి సన్నిధానము సూరన నారాయణశాస్త్రిగారు, ౪౪ జీరా, గోశలము, సికింద్రాబాదు (దక్కను). వెల రూ ౧.

ఆర్యశూరుని 'జాతకమాల' లోని పది జాతక కథలు ఈ పద్య కావ్యమున బొందుపరుపబడియున్నవి. నూతన రూపము దాల్చిన ఈ కథలలో మూలమున లోపించిన కవితా శిల్పమును కల్పించుటకై అందందు అలతియలతి మార్పులు చేయబడినవి. అ

మార్పులు రసానుకూలముగానే యున్న వనుటకు సందేహము లేదు. పద్యములు సరళశైలీవిబద్ధములై ధారావాహికగా నడచి యింపు నింపుచున్నవి. అసలు జాతకకథల తత్వము నెరుగనివారికి ఈ యనువాద కథలు దానిని చేటతెల్లముగా వివరింపగలవు. బౌద్ధ ధర్మవ్యాపనకు ఈజాతక కథ లెట్లు తోడ్పడినవో కూడ సుబోధముగా నిరూపింపగలవు.

---

### శ్రీ కృష్ణరాయాభ్యుదయ సంచిక

ఇటీవల రాజమహేంద్రవరములో జరిగిన శ్రీ నాళం కృష్ణారావుగారి షష్టిపూర్తి ఉత్సవమును పురస్కరించుకొని వారి యభిమానులు కొందరు ప్రకటించిన సత్కృతిసంచిక ఇది. ఆంధ్ర భాషారంగంలో ప్రస్తుతం పేరు పొందివున్న పండితులూ, కవులూ వ్రాసిన రచన లెన్నో ఈ సంచిక నలంకరించి వున్నాయి. ఇది శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిలవారి ఆశీర్వాదపద్యములతో ఆరంభ మవుతుంది. స్వయం కృష్ణారావుగారూ వారి కుటుంబమూ అందరూ సంగీత సాహిత్య విద్యాకోవిదులే. స్వయం శ్రీ కృష్ణారావుగారును వారి కుమార్తెయు వ్రాసిన లేఖలును ఇందుగలవు. అట్టివారి షష్టిపూర్తి ఉత్సవమును గావించి ఇందరు పండిత కవులు గౌరవించారంటే వీరూ తమ విద్యుక్తధర్మాన్ని నెరవేర్చుకొన్నారని చెప్పవచ్చును. సంచిక కంతటా రావుగారి కుటుంబచిత్రాలు వన్నె తెస్తున్నాయి. వీరింకనూ ఇట్లే తమ విద్యా వ్యాసంగ పరిమళాలను దేశమంతటా ప్రసరింపచేస్తూ సుదీర్ఘాయువులై మనియుందురుగాక.

---

# గ్రంథస్వీకారము

—◇—

### ఛందస్సు

రచయిత: కీ. శే. శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు. ప్రకటన కర్తలు: వేదము వేంకటరాయ శాస్త్రి అండ్ బ్రదర్సు. 8. మల్లికేశ్వరస్వామి గుడి సందు, లింగిచెట్టివీధి. జి. టి. మదరాసు. వెల రు. 0-3-0.

### గ్రామ్యాదేశ నిరసనము
### ఆంధ్రగ్రంథ విమర్శన ప్రకారశేశవము
### భారతాభారతరూపక మర్యాదలు

ఈ మూడును సంపుటీకృత ఉపన్యాసములు. కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రులుగా రిచ్చినవి. ప్రకటనకర్తలు: వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, 8, మల్లికేశ్వరస్వామి గుడిసందు, లింగిచెట్టి వీధి, జి. టి. మదరాసు.

---

### వత్సాంకుడు

గ్రంథకర్త. శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు. ప్రచురణకర్తలు: సాహితీమేఖలవారు. ఇనగల్లు, Via చీరాల, గుంటూరుజిల్లా. వెల రు. ౧-0-0.

---

### నిర్మాణం

ప్రత్యూషమాలలోని నాలుగో గ్రంథం. సంపాదకులు: సాధనసమితివారు. ౭౮-౮. బన్సీలాల్ పేట, సికింద్రాబాదు,(దక్కన్). వెల ప్రతి ౧కి రు. 0-౮-0.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.



గొల్ల భామలు